జూన్ 2016
రూ. 15/-

# చతుర



నవనీత్ కౌర్ దిలాన్
సౌందర్య రహస్యం ..122

# ప్రకృతి వికృతి

వారెవ్వా!

ఫ్లయింగ్ సాసర్‌లా కనిపిస్తున్న ఈ వింత ఆకారాలు చిత్రమైన మేఘాలు! వీటిని లెంటిక్యులర్ క్లౌడ్స్ అంటారు. ఎత్తయిన ప్రదేశాలలో గాలి వీచే దిశకు లంబంగా ఏర్పడతాయివి. ఉష్ణోగ్రత తగ్గినపుడు గాలిలోని తేమ వ్యాకోచం చెంది విచిత్ర ఆకారంలో మేఘంగా ఏర్పడుతుంది. వాతావరణ పరిస్థితులు అనుకూలించినపుడు ఇవి ఒకదానిపై ఒకటి ఇలా పేర్చినట్లు ఏర్పడతాయి!

సంపుటి : 39
సంచిక : 5
పేజీలు : 132
జూన్ 2016
461 వ సంచిక

# చతుర

## ఇదీ వరస...!



'ఇద్దరు ఆడపిల్లల్ని కన్నావ్. స్కానింగ్‌లో మళ్లీ ఆడపిల్లే అని తేలింది. ఆడపిల్లల్ని కని కొంప కొల్లేరు చేయడానికా? నా మాట విని గర్భస్రావం చేయించుకో!' భర్త అనంత్ చెప్పాడు.

'ఇప్పటికే ఒకసారి అబార్షన్ చేయించుకున్నాను. మళ్లీ చేయించుకుంటే ఎలా' అందామె.

'ఏదో గర్భంలో తప్పకుండా కొడుకు పుడతాడని మా గురువుగారు చెప్పారు. ఈ కడుపు పోగొట్టుకో! తప్పకుండా కొడుకు పుడతాడు' ఆదేశించాడు అనంత్.

'మళ్లీ ఆడపిల్లే పుడితేనో..?' నిలదీసిందామె.

అనంత్‌కు కోపం తారస్థాయికి చేరింది..!

ఆ తర్వాతేమైంది? అనంత్ ఏం చేశాడు? ఆద్యంతం ఆసక్తిగా సాగే **అలపర్తి రామకృష్ణ** కౌటుంబిక నవల **జీవనలిపి** **పేజీ– 6లో**



భవిష్యత్తును పూలబాటగా మార్చేందుకు అనుక్షణం పిల్లలను ఆజ్ఞాపించే తండ్రి మనసును చూడగలిగితే అడుగడుగునా ప్రేమమయం.. జూన్ మూడో వారం జరుపుకునే పితృదినోత్సవం సందర్భంగా ప్రత్యేక వ్యాసం **పైకి కఠినం.. లోన మధురం!** **పేజీ 94లో..**



ప్రేమించి పెళ్లి చేసుకుందామె. ఆమెకు లేని సౌకర్యం లేదు. తెలివైన పిల్లలు. కానీ ఏదో తీరని లోటు ఆమెలో కనిపించేది. దానిని పసిగట్టిన కొడుకు తల్లిని సంతోషపెట్టాలనుకున్నాడు. అందుకు ఓ మార్గాన్ని ఎంచుకున్నాడు. ఇంతకీ ఏమిటా మార్గం? అది తల్లిని సంతోషపెట్టిందా? కథాలోక మార్మికుడు **డి.హెచ్. లారెన్స్** ఇంగ్లండ్ కథ **కొయ్యగుర్రపు విజేత..** **పేజీ – 98లో**




ఆ చుట్టుపక్కల గ్రామాల్లోని భూమి అంతా దేశ్‌ముఖ్ గారిదే! ఆ పొలాలన్నీ ఊరివాళ్లే దున్నాలి. దేశ్‌ముఖ్‌గారి పని తర్వాతే ఎవరికైనా సొంతపని. దేశ్‌ముఖ్ అధికార ప్రతినిధి అప్పన్న ఆ రోజు తన జోరును రాములమ్మ మీద చూపించాడు. ఇంట్లో జొరపడి కూరలు తరుగుతున్న రాములమ్మని జబ్బ పట్టుకుని వీధిలోకి లాక్కొచ్చాడు. కాదనే ధైర్యం , ఎదిరించే శక్తీ ఎవరికీ లేదు. ఇంతకీ రాములమ్మ అప్పన్న చెప్పినట్టు చేసిందా? ఎదిరించిందా? నిజాం కాలం నాటి తెలంగాణ పల్లెల్లోని జనజీవనానికి అక్షరచిత్రం ప్రఖ్యాత రచయిత **బొల్లిముంత శివరామకృష్ణ** **మృత్యుంజయులు** నవలపై విశ్లేషణ చదవాల్సిందే!

**తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ దినోత్సవ** ప్రత్యేకం ఈనెల **నవలావలోకనం** **పేజీ – 115లో**

ఆ కన్యకు ఐదు కాలి పిక్కలున్నాయట! ఏడు కళ్లు.. చిత్రంగా ఆ ఏడు కళ్లకు నాలుగు కనుబొమ్మలు! అంతేనా..! కుచద్వయాలు ఆరు ఉన్నాయట! ఇక నడుము చూస్తే పన్నెండట! అలాంటి

కన్య నీవు పద్మైతే బాగుంటుందని కస్తూరి రంగనాయకునితో చెబుతున్నాడో కవి. ఇంతకీ ఏమిటిం దులోని సౌందర్యం? తెలుసుకోవాలనుకుంటున్నారా? అయితే మీరు **చమత్'కారం'** వీక్షించాల్సిందే! **పేజీ – 23లో**



స్వర్గం నరకం ఉన్నాయా? పాపకృత్యాలు నివారించడానికే పెద్దలు అలా చెబుతారా? మనిషికి ఏ కాస్త కీడు జరిగినా గ్రహశాంతి చెయ్యాలంటారు. అలా చేస్తే పునీతుడవుతాడా? గత జన్మలో పాపపుణ్యాలు ఈ జన్మలో పరిగణనకు రావా? నేటితరం ఆడపిల్లలు కొందరు బొట్టు పెట్టుకోవడం అనాగరికంగా భావి స్తున్నారు. కొందరేమో కనిపించీ కనిపించకుండా పెట్టుకుంటున్నారు. భారతీయ సంప్రదాయంలో తిలకం వైశిష్ట్యం ఏమిటి? శ్రీకృష్ణుడు మధురా నగరాన్ని కాదని సముద్రం మధ్యలోని ద్వీపంలో నివాసమేర్పరచుకొని పాలించడానికి కార ణమేమిటి? ఇలాంటి ఆధ్యాత్మిక, పౌరాణిక ధర్మ సందేహాలు నివృత్తి కావాలంటే **చతుర ప్ర.జ.**లోకి ప్రవేశించాల్సిందే! **పేజీ – 118లో**

పదాల పూరణలో ఆసక్తినీ, మాతృభాష మీద అనురక్తినీ పెంచుతూ గడి గడిలో తెలుగు నుడి కారం ధ్వనించే అక్షరక్రీడ **చతురంగం పేజీ – 129లో**



'పెద్దయ్యాక నా కూతురు మిస్ వరల్డ్ అవుతుంది' అన్న తండ్రి మాట లనే తన జీవిత లక్ష్యంగా తీసుకుందామె. అనేక అందాల పోటీల్లో పాల్గొంది. మిస్ ఇండియా టైటిల్ గెలుచుకుని, మిస్ వరల్డ్ పోటీలకూ వెళ్లింది. బాలీవుడ్‌లో ఒక్కసారిగా రెండు ఆఫర్లు కొట్టేసింది. ఇంతకీ ఎవరా అందాల భామ? ఆమె తన సౌందర్య పోషణలో తీసుకునే జాగ్ర త్తలేంటి? తెలుసుకోవాలనుకుంటున్నారా? **భామనే.. సత్యభామనే.. పేజీ – 122లో**

ఎండలకు చర్మం నల్లబడిందా? కాంతి విహీనంగా కనపడుతున్నారా? మరయితే ఈ తేలికైన చిట్కాలు పాటించి తక్షణం మునుపటి కాంతిని తిరిగి పొందండి.. **సోయగం పేజీ – 124లో**

తీరిక సమయాల్లో చాటింగుల్లాంటి వాటితో కాలం వెళ్లబుచ్చే కంటే ఎంచక్కా భగవద్గీత చది వితే..? ఎంత ముక్తి! ఇపుడు తెలుగులోనే భగవద్గీత మీ ఫోన్‌లో చదువుకునే చక్కని అవకాశం! ఎలాగంటారా? తెరవండి.. **టెక్ గురూ! పేజీ – 124లో**

పిల్లలకైనా పెద్దలకైనా కాసేపు ఆడితే అలసట ఇట్టే మాయమవుతుంది.. మరి మీరూ ఈ ఒక చిన్న క్విజ్‌తో రిలీఫ్ అవ్వండి.. **జతపరచండి పేజీ – 125లో**

సంతోషమే సగం బలం. అవును హాయిగా నవ్వుతూ ఉంటే ఎటువంటి జబ్బులూ దరిచేరవు. ఈ జోకులు చదివి మీరూ కాసేపు మనసారా నవ్వుకోండి.. **పేజీ 125లో..**



పెసరపునుకులు, క్యాబేజీ పకోడీలు.. వావ్! వింటుంటేనే నోరూరు తోంది కదూ? ఇలాంటి చిరుతిండ్లు పిల్లలకే కాదు, మీకూ ఎంతో ఆరో గ్యకరం. మరి వీటిని తయారుచేయడమెలా? అనుకుంటున్నారా? మరింకెందుకాలస్యం.. తెరవండి **చిటికెలో రుచిగా! పేజీ – 126లో**

తొమ్మిదో శతాబ్దం నాటి ఆ ప్రసిద్ధ బౌద్ధ ఆలయం ఎక్కడుంది? దాని వింతలు, వేశేషాలు ఏంటి? భూమి వయస్సును లెక్కకట్టడానికి శాస్త్రవేత్తలు కనుక్కున్న కొత్త పద్ధతి ఏంటి? తెలుసుకోవాలనుందా? మరింకెందుకాలస్యం? తెరవండి.. **పేజీ 97**

ముఖచిత్రం : **రోహిత** పుస్తకాలంకరణ : **రాజుయాట**

e-mail: vipula.chatura@eenadu.net / vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

# ఆత్మీయులకు అక్షర కానుకలు!

ప్రతినెలా నవనవోన్మేష నవల ఒక్కటే కాదు..
ప్రపంచ నవలల పరిచయం కాలాతీతం
ప్రసిద్ధ తెలుగు నవలల సమీక్ష
నవలావలోకనం
అతివల అంతరంగానికి అద్దం
భామనే.. సత్యభామనే..!
సాహిత్య చమక్కులు విప్పి
చెప్పే చమత్'కారం'
మెదడుకు మేత చతురంగం,
ప్రవేశిక.. చతురకతలు,
కొత్తగాలులు నవనవలావేదిక చతురలో
ఒకటేమిటి.. ప్రతి పేజీ రసానందమే!




వీసా లేకుండా విదేశాలను చుట్టించే ప్రపంచ భాషల కథలు
గడపదాటకనే ఆసేతుహిమాచలాన్నీ కళ్లకుకట్టే భారతీయభాషల కథలు
తెనుగు లోగిళ్ల ఊసులను మోసుకొచ్చే తెలుగు కథలు
యువతతో కరచాలనం చేయించే పేరడీ, రింగరింగారింగరింగారే..
కార్టూన్లు.. కవితలు.. సమీక్షలు అన్నీ కలగలిపిన విశ్వకథావేదిక
విపుల ప్రతి పేజీ పసందే!




ఆబాలగోపాలాన్నీ అలరిస్తూ కనువిందు చేస్తున్న
ఈ జంటగువ్వలు ప్రతిమాసం మీ ముంగిట్లో
వాలాలని కోరుకుంటున్నారా?

అమ్మానాన్నలకి ఈ అక్షర కానుకలందిస్తూ
సత్కాలక్షేపం కలిగించాలనుకుంటున్నారా?

బంధుమిత్రులు, శ్రేయోభిలాషులకు ఈ అపురూప
కానుకలు అందించాలనుకుంటున్నారా?

ఈ కానుకలు అందించాలనుకున్న వారి పేర
**రూ. 320/-** చందా కట్టండి చాలు!
ఏడాదిపాటు మీ తరపున **చతుర - విపుల**
నెలనెలా వారిని పలకరిస్తాయి.

*డిడి లేదా ఎంఓ పంపవలసిన చిరునామా : వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు బిల్డింగ్, గ్రౌండ్‌ఫ్లోర్, రామోజీ ఫిల్మ్‌సిటీ, హైదరాబాద్- 501 512. రంగారెడ్డి జిల్లా ఫోన్: 040- 22232223 Ext: 4941*
***ఆన్‌లైన్ చందా చెల్లింపునకు*** *యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015. వివరాలకు vipula.chatura@eenadu.net లేదా vipula.chatura@gmail.comకు మెయిల్ కూడా చేయొచ్చు*

**పె**ళ్లిచూపుల్లో విఠల్‌కు చిన్నమ్మాయి బాగా నచ్చింది.
తన కోరికను తండ్రితో చెప్పాడు.
'మనం చూడటానికొచ్చింది పెద్దమ్మాయిని, ఆ అమ్మాయిని కాదు.
ఇపుడు చెల్లెల్ని పెళ్లి చేసుకుంటామంటే బాగుండదు' చెప్పాడు తండ్రి.
'ఒక్కసారి అమరయ్యగారిని అడిగిచూడు నాన్నా!'
తండ్రిని బతిమిలాడాడు విఠల్.
కొడుకు మాట కాదనలేక అమరయ్యగారిని అడిగాడు విఠల్ తండ్రి.
'సాయంత్రం చిన్నమ్మాయిని చూడ్డానికి తెనాలి నుంచి వస్తున్నారు.
వాళ్లు మా పెద్దమ్మాయిని ఇష్టపడితే చిన్నమ్మాయిని మీరు చేసుకుందురు గానీ'
అన్నాడు ఆ ఆడపిల్లల తండ్రి అమరయ్య.
ఇంతకీ తర్వాత వచ్చినవాళ్లు ఎవరిని ఇష్టపడ్డారు? విఠల్ కోరిక నెరవేరిందా?
ఆత్మీయానురాగాలకు అద్దం పడుతూ ఆద్యంతం ఆసక్తిగా సాగే

అలపర్తి రామకృష్ణ నవల **జీవనలిపి**
చతుర జూన్ కానుక!



బొమ్మలు : సీతు

మెటర్నిటి వార్డులో వాసంతి పక్కనే కూర్చుంది సంపూర్ణ.

నొప్పులతో మెలితిరిగిపోతూ వుంది.

లేడీడాక్టరు, నర్సు అటువైపు వచ్చినా వాసంతిని పట్టించుకోలేదు.

"నొప్పులు ఎక్కువగా వస్తున్నాయి.. మీరు ఓ అరగంటలో ఆమెను థియేటర్‌లోకి తీసుకెళ్ళకపోతే హాల్లోనే ప్రసవించేటట్లుంది" అంది సంపూర్ణ డాక్టరు దగ్గరకు వెళ్ళి.

"నాకేం పదిచేతులు లేవుగా? ఉన్నవి రెండు చేతులు.. పిల్లల్ని కని దేశంమీద వదిలేయడానికి ఒక్కసారే పదిమంది వస్తే నేనేం చేయాలి? పదినిముషాలాగు, లోపలికి పిలుస్తాను. నువ్వేమవుతావు ఆ అమ్మాయికి? " అడిగింది డాక్టరమ్మ.

ఏం సమాధానం చెబుతుంది?

వాసంతి తనకు బంధువు కాదు. తనతో బాటే మున్సిపాలిటిలో పనిచేస్తోంది.. తాత్కాలిక ఉద్యోగం.. ఆమె భర్త ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.. వాసంతిని వదిలేసినట్లే! తల్లిదండ్రులు కూడా లేరామెకి.

"దగ్గరి బంధువు. చెల్లెలు వరసవుతుంది.. నేను మున్సిపాలిటిలో టైపిస్టుగా పని చేస్తున్నాను" అంది సంపూర్ణ.. 'బంధువు కాదుగానీ ఆత్మబంధువు' అనుకుంటూ..

మెత్తబడింది డాక్టరమ్మ. మున్సిపాలిటీ వాళ్ళతో ఎప్పుడూ ఏదోకపని వుంటూనే వుంటుంది. కొంచెం కనికరం చూపిస్తే మంచిదనుకున్న డాక్టరు "లోపలికి తీసుకొచ్చేయి" నర్సువైపు తిరిగి అంది.

గంట తర్వాత ప్రసవించింది వాసంతి.

"ఆడపిల్ల.. చూడముచ్చటగావుంది" అంది సంపూర్ణ స్నేహతురాలితో.

నీరసంతో మంచానికి అతుక్కుపోయిన వాసంతి మెల్లగా తలెత్తి కూతురివైపు చూసి "శివయ్యకి ఆడపిల్లంటే ఇష్టం!" అంది భర్తను తలచుకుంటూ.

"నిన్ను వదిలేసి వెళ్ళినవాడి గురించి ఎందుకు ఆలోచిస్తావ్? నీ కూతురెంత అందంగా వుందో చూడు! పెద్దకళ్ళు, పొడుగ్గావున్న చేతివేళ్ళు, బుగ్గమీద పుట్టుమచ్చ, నల్లటి ఒత్తైన జుట్టు" పసిబిడ్డ చేయిపట్టుకుని నిమురుతూ అంది సంపూర్ణ.

కానుపుకోసం వచ్చినవాళ్ళకు తగినన్ని మంచాలు లేకపోవడంతో కొంతమంది గచ్చుమీదే దుప్పటి పర్చుకుని పడుకున్నారు. హాల్లో ఫ్యాన్ తిరగడంలేదు! 'నిప్పుల కొలిమి దగ్గర పడుకున్నట్లుంది' అనుకుంది వాసంతి.

కిటికీ పక్కన మంచం మీద పడుకోబెట్టారామెను. బయటనుంచి దుర్గంధం ముక్కులోకి దూసుకువస్తోంది. హాస్పిటల్ వ్యర్థాలన్నీ ఆ కిటికీకి ఆవలవైపు గుట్టగా పోశారు.

"వేడివేడి టీ తాగు!" అంటూ సంపూర్ణ వాసంతిని మెల్లగా లేపి కూర్చోబెట్టి టీ తాగించింది.

శుభ్రమైన తెల్లటి బట్టలో పాపాయిని చుట్టింది.

"పాపాయికి తల్లిపాలు శ్రేష్ఠం.. ముందు కొన్నిరోజులు తల్లి రొమ్ముల్లో తక్కువ పాలుంటాయి.. అది సహజం. పాలు తక్కువగా వున్నాయని పోతపాలు అలవాటు చెయ్యకూడదు. తక్కువగా వుంటే తరచుగా పాలివ్వాలి" వివరంగా చెప్పింది సంపూర్ణ.

బిడ్డను తల్లి ఒడిలో వుంచి పాలు ఎలా తాగించాలో చెప్పింది.

★ ★ ★

మరుసటిరోజు బిడ్డనెత్తుకుని వాసంతిని మెల్లగా నడిపిస్తూ హాస్పిటల్‌నుంచి బయటకొచ్చింది.

సంపూర్ణ కళ్ళు కోటి కోసం వెతికాయి.

"మెల్లగా నడుచుకుంటూ పోదాం అక్కా!" అంది వాసంతి.

ఆమె దగ్గర ఆటో ఎక్కడానికక్కూడా డబ్బుల్లేవు.

కోటి ఆటో తీసుకొచ్చి వాళ్ళదగ్గర

ఆపాడు.

"చెప్పినట్లే వచ్చాసేవే!" అంది సంపూర్ణ భర్తతో.

ఆటోఎక్కి కూర్చున్నారు. పాపను ఒళ్ళో జాగ్రత్తగా పడుకోబెట్టుకుంది సంపూర్ణ.

"కుదుపుల్లేకుండా మెల్లగా నడుపు. అసలే పచ్చిబాలింత" అంది భర్త భుజం ఆప్యాయంగా తట్టి.

"మీ అందరికీ ఇబ్బంది కల్గించాను.. ఊళ్ళో చుట్టాలున్నా ఎవరూ పట్టించుకోరు. నువ్వు సొంత అక్కలా కంటికి రెప్పలా చూస్తున్నావ్" అంది వాసంతి.

"బంధువులు సుఖంగా వున్నప్పుడు వాళ్ళింటికెళ్ళి పలకరించకపోయినా ఫర వాలేదు. ఇబ్బందుల్లో వున్నప్పుడే పక్కన వుండి చేతనైన సహాయం చెయ్యాలి!" అంది సంపూర్ణ.

వాళ్ళిద్దరి సంభాషణ వింటూ ఆటో ముందుకు పోనిచ్చాడు కోటి. అతనెక్కువగా మాట్లాడడు.

నిండు గర్భిణీ స్త్రీలను చూసినా, పసిబిడ్డను ఎత్తుకున్నా, తల్లులను చూసినా అతనికి అవ్యాజమైన అభిమానం కలుగుతుంది. గర్భిణీస్త్రీలు ఆటో ఎక్కితే డబ్బు తీసుకోడు. డబ్బులివ్వబోతే చేతులెత్తి నమస్కరించి మీరు ఆనందంగా వుంటేనే ఈ లోకం చల్లగా వుండేది" అనేసి తీసుకోకుండా వెళ్ళిపోతాడు.

పాత బస్స్టాండు దాటి కూరగాయల మార్కెట్ వెనుక వైపుకు ఆటో మళ్ళించాడు. వాసంతి వుండే ఇంటిముందు ఆటో ఆపాడు.

"రెండ్రోజులనుంచి నాతోపాటే ఆసుపత్రిలో వున్నావు.. ఇంటిదగ్గర పిల్లలు నీకోసం ఎదురుచూస్తుంటారు. నువ్వెళ్ళు అక్కా!" అంది వాసంతి.

"పసిబిడ్డతో జాగ్రత్త! నేలమీద పడుకోబెట్టి అటూఇటూ తిరగకు. కుక్క ఇంట్లో దూరిందంటే పసిబిడ్డను నోటకరుచుకుని వెళ్ళిపోతుంది! పసిబిడ్డకు తల్లిపాలే శ్రేష్ఠం! రోజూ ఉదయంపూట వచ్చి పాపకు స్నానం చేయిస్తాను. ఏదన్నా అవసరం అయితే నాకు చెప్పు! మొహమాటపడకు!" అంటూ సంపూర్ణ వాసంతి తల నిమిరి, తీసుకోవాల్సిన జాగ్రత్తలన్నీ చెప్పింది.

వాసంతి కళ్ళు చెమర్చాయి. సంపూర్ణ భుజంమీద తలవాల్చి ఏడ్చేసింది.

"నేనున్నాను గదా నీకు తోడుగా! భయపడాల్సిన అవసరం లేదు" అని వాసంతికి ధైర్యం చెప్పి వెళ్ళిపోయిందామె ఆటోలో.

★ ★ ★

సెంటరు నుంచి పాతపొన్నూరు తిరిగొచ్చింది సంపూర్ణ.

ఇంటిముందు నీళ్ళతొట్టి దగ్గర సిమెంట్ చప్టాదగ్గర కూర్చుని బట్టలుతుకుతున్న లాలిత్య కన్పించింది.

"నేను వచ్చేసేనుగదా! ఇంట్లో పని నేను చూస్తానుగానీ, నువ్వెళ్ళి ఆడుకో" అంది కూతురి చేతిలోని సబ్బుబిళ్ళ అందుకుని.

"అన్నయ్యకి పరీక్షలు! గదిలో కూర్చుని చదువుకుంటున్నాడు. ఇల్లంతా ఊడ్చేశాను. నువ్వు లేనప్పుడు నాన్న, నేను కలిసి వంట చేశాం!" అని కూతురు చెప్పడంతో నవ్వుకుంది సంపూర్ణ.

తను చేసేది మున్సిపాలిటీలో చిన్న ఉద్యోగం. భర్త ఆటో నడుపుతాడు. ఓ కొడుకు, కూతురు. కొడుక్కి పదిహేనేళ్ళు, కూతురికి పదేళ్ళు. అందరూ తనని గౌరవిస్తారు. చెప్పినట్లు నడుచుకుంటారు. ఆర్థిక పరమైన ఇబ్బందులు అప్పుడప్పుడు చుట్టుముట్టినా, ధైర్యంగా సంసారాన్ని నెట్టుకొస్తూవుంది. చిన్న ఇల్లే అయినా సొంతిల్లు ఏర్పర్చుకోవడం అదో అదృష్టం.

"నువ్వెళ్ళి ఆడుకో!" అంది కూతురితో.

వాళ్ళింటికి రోడ్డుకు ఆవలివైపున్న ఆర్చీ ఇంటివైపు వెళ్ళింది లాలిత్య.

ఆ పిల్ల ఇంట్లో పనులన్నీ చేయడం, అణకువగా వుండటం చూసి చుట్టుపక్కల

## కొత్తగాలి...

**ఒడిసి పట్టు**
**ప్రతి నీటిబొట్టు**
**జాతి భవితకది**
**తొలిమెట్టు!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

వాళ్ళు కూడా ముచ్చటపడుతుంటారు.

"అన్నీ నీ పోలికలే సంపూర్ణా నీ కూతురికి.. ఏ పని చెప్పినా చిటికెలో చేస్తుంది. ఎదురు మాట్లాడదు. చదువులో కూడా ఫస్టే! మా పిల్లలూ వున్నారెందుకు? టీవీ దగ్గర కూర్చుంటారు.. అన్నీ వాళ్ళకంది వ్వాలి! మంచినీళ్ళ గ్లాసు కూడా మనం ఇవ్వాల్సిందే!" అంటూ వుంటారందరూ.

తన పనులు ముగించుకుని వెనుక గదిలోకి వెళ్ళింది.

చదువుకుంటున్న దరహాస్ కన్పించాడు. పదోతరగతి.. వాడు చదివేది.

"మిమ్మల్ని వదిలేసి హాస్పిటల్‌కు వెళ్ళాను, ఇంట్లో ఇబ్బంది పడ్డావా? నీకు పరీక్షలు జరుగుతున్నాయి గదా! దగ్గరుండి నీకు కావాల్సినవి అందించాలనుకున్నాను. వీలుపడలేదు" అందామె.

"వాసంతి పిన్నికెలావుంది? " అడిగాడు

"అమ్మాయి పుట్టిందిరా! ముద్దొస్తోంది"

"పరీక్షలయ్యాక వాళ్ళింటికి వెళ్ళి పాపను ఎత్తుకుని ఆడిస్తాను"

ఆమె చూపు వాడి మోచేతి మీద పడింది. బాగా దోక్కుపోయి రక్తపు చారికలు కన్పించాయి. ఆదుర్దాగా దరహాస్ దగ్గరకు వెళ్ళి చెయ్యిపట్టుకుని చూసింది.

"కాలుజారి కింద పడ్డావా? "

"లేదమ్మా! స్కూల్ దగ్గర వికాస్ నన్ను కావాలని నెట్టాడు, కింద పడ్డాను.. దోక్కుపోయింది. కొద్దిగా మంటగా వుంది"

"ఎందుకు తోశాడు? వాడినేమన్నావు? "

"నేనేం అనలేదమ్మా! పరీక్షలు రాసేటప్పుడు బెంచీ మీద నా పక్కన కూర్చున్నాడు. నేను రాసిన ఆన్సర్ పేపర్ వాడికి చూపించలేదని బయటకొచ్చేక తోశాడు"

"చూపిస్తే పోయేదిగా"

"టీచర్లు ఊరుకోరమ్మా! నేను రాసింది వాడు కాపీకొడితే ఇద్దరినీ బయటకు పంపించేస్తారు. అప్పటికీ రెండు లెక్కలు చూపించాను. వాడేమో అన్నీ చూపించమంటాడు"

"సర్లే! వికాస్‌తో పోట్లాటకు దిగకు. మరింత ఇబ్బందిపెడితే టీచర్‌కు చెప్పు!" అందామె.

దరహాస్‌ను బాత్‌రూములోకి తీసుకెళ్ళి దెబ్బ తగిలిన చేతిని నీటితో కడిగి డెటాల్ రాసింది.

★ ★ ★

ఆర్చీ ఇంటి ముందు నిలబడింది లాలిత్య. ఊళ్ళో వున్న అన్ని ఇళ్ళకంటే ఆర్చీ ఇల్లు పెద్దది. విశాలమైన ఆవరణలో ఎత్తయిన ప్రదేశంలో ఉంది. చుట్టూ పద డుగుల ఎత్తులో ప్రహరీగోడ! రోడ్డుమీద ఎవరెళ్తున్నా ఆర్చీవైపు చూడకుండా వుండలేరు. ఇరవై అడుగుల ఎత్తులో పెద్ద ఆర్చీ ముందుభాగంలో ఆదిశేషుని పడగ నీడలో మురళి వాయిస్తున్న వేణుగోపాలుడు. ఆ వేణుగానం వింటూ తన్మయత్వం చెందినట్లు శ్రీకృష్ణునికి ఇరువైపులా రెండు ఆవులు, పాలు తాగడం మర్చిపోయి మురళీకృష్ణుని వైపు చూస్తున్న ఆవుదూడ.. ఆ బొమ్మలు అందరి దృష్టినీ ఆకర్షిస్తాయి.

ఆర్చీని దట్టంగా అల్లుకుని వున్న రాధా మనోహరం పూలనుంచి వస్తున్న వాసన ఆ ప్రాంతమంతా వ్యాపించి వుంది.

వరండా మెట్లు దిగి దర్జాగా నడుచుకుంటూ వస్తున్న బాపయ్యను చూసి తత్త

రపడుతూ ఆర్చి గోడకు అత్తుకుపోయి నిలబడింది లాలిత్య.

ఆరడుగుల ఎత్తు, గుబురు మీసాలు, మెళ్ళో బంగారు గొలుసు, సిల్కులాల్చీ తెల్లగా మెరిసిపోతున్న ధోవతి, భుజంమీద ఉత్తరీయంతో.. నడుస్తున్న మఱ్ఱిచెట్టులా కన్పించేడు. అంత భారీ విగ్రహం ఊళ్ళో మరొకరు లేరు.

రోజూ చూస్తున్న మనిషే అయినా విప్పారిన నేత్రాలతో బాపయ్యగారిని చూస్తూ వుండిపోయింది.

"ఏం పిల్లా! దాక్కున్నావెందుకు? గండు పిల్లిలా కన్పిస్తున్నానా? ఇటురా!" గర్జించాడు బాపయ్య.

వణికిపోతూ ఆయన ఎదురుగా నిలబడింది లాలిత్య.

లాల్చీజేబులోంచి చాక్‌లెట్ తీసి లాలిత్యకు ఇచ్చాడు.

"ఈ రోజు నా పుట్టినరోజు.. ఎనభైయ్యేళ్లు వచ్చాయి. ముసలోడిలాగా కన్పిస్తున్నానా? " నవ్వుతూ అడిగాడు.

చూపులకు గంభీరంగా కన్పిస్తాడు గానీ ఆయనది చిన్నపిల్లల మనస్తత్వమే.

తల అడ్డంగా ఊపింది.

నిజంగానే అంత వయసొచ్చినా ముసలాయనలా కన్పించడు.

"అమృత కోసం వచ్చావా? ఇంట్లోనే వుంది, వెళ్ళు" అన్నాడాయన ఆర్చీ వైపు నడుస్తూ.

హాల్లో అడుగుపెట్టింది. గోడలకు వేలాడదీసిన తైలవర్ణచిత్రాలకేసి చూస్తూ వుండిపోయింది. ఎన్నిసార్లు చూసినా మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తుంది.

అమృత తల్లి అనసూయ హాల్లో పేపరు చదువుతూ కన్పించింది. రెండుమూడు దినపత్రికలు తెప్పించుకునేది ఆర్చీ ఇంట్లోని వాళ్ళే.

"అమృత ఏం చేస్తున్నదండీ? " అడిగింది లాలిత్య.

"గదిలో వ్యాసం రాస్తున్నది. నువ్వెళ్లి దాన్ని చెడగొట్టకు! కాసేపు మాట్లాడి పో!" అందామె.

తలూపి గదిలో అడుగుపెట్టింది.

గదిలో వికాస్, అమృత పక్కపక్కన కూర్చుని మాట్లాడుకోవడం కన్పించింది. డోర్‌దగ్గరే నిలబడిపోయింది లాలిత్య.

లాలిత్యను చూసి "ఎందుకొచ్చావ్? ఇంట్లోకి దూసుకొచ్చెయ్యడమేనా? మా ఇంటికి రావొద్దని చెప్పాను చాలాసార్లు" అన్నాడు వికాస్.

"మీ అమ్మగారికి చెప్పే వచ్చాను ఇంట్లోకి" సమాధానమిచ్చింది.

"మా చెల్లెలు చదివేది ఎనిమిదో తరగతి. నువ్వు ఐదో తరగతి చదువుతున్నావు.. అమృత నీకంటే పెద్దదిగదా! దానితో నీకు స్నేహమేమిటి? వెళ్ళిక్కడి నుంచి" గదమాస్తున్నట్లు అన్నాడు.

అన్న ప్రవర్తనకు ఒళ్ళు మండిన అమృత "అది నా ఫ్రెండు, నాకోసం వచ్చింది. రావొద్దని చెప్పడానికి నువ్వెవరివి? డాడీతో చెబుతా!" అంది.

చెల్లెలు తండ్రికి చెప్పేది తను లాలిత్యను ఇంట్లోకి రావొద్దన్నాడన్న సంగతి ఒకటే కాదు, దానిక్కోపమొస్తే కారుషెడ్‌లో కూర్చుని చాటుగా సిగరెట్టు కాల్చిన సంగతి కూడా చెప్పేస్తుంది. అనవసరంగా తగాదా పడకూడదనుకున్నాడు.

"సర్లే! ఆడుకోండి ఈ గదిలోనే! రేపు నాకు ఎగ్జామ్ వుంది. చదువుకోవాలి!" అంటూ గదిలోంచి బయటకెళ్లాడు.

లాలిత్యను పక్కన కూర్చోబెట్టుకు "మా స్కూల్లో టీచరు ఐదొందల పదాలతో ఓ వ్యాసం రాయమంది. ఏం రాయాలాని ఆలోచిస్తున్నాను. సొంత విషయాల మీద రాయమంది" అంది అమృత.

"మీ నాన్నగారి గురించి రాయి" అంది లాలిత్య.

"ఆయన గురించి ప్రత్యేకంగా రాసేదే

## కొత్తగాలి...

**ఉంటే ప్రతి ఇంట్లో**
**ఇంకుడు గుంత**
**ఉండదు నీటికి**
**ఎటువంటి చింత!**

– యస్. వేణుగోపాల్,
హైదరాబాద్

ముంది? డబ్బు వడ్డీలకిస్తాడు, కాంట్రాక్టులు చేస్తాడు. డబ్బు బాగా సంపాదించాడు. ఊళ్ళో జనమెవరూ నాన్నను మెచ్చుకోరు"

"మీ అమ్మగారి గురించి రాస్తే ఎలా వుంటుంది? "

"ఆమెకు కోపం ఎక్కువ. మా పిన్నిమీద ఎపుడూ అరుస్తూంటుంది. అమ్మ ఏది చెబితే అది వింటాడు నాన్న. ఆమె చెప్పిందే వేదం. ఈ విషయాలన్నీ రాసుకెళ్ళి క్లాసులో చదివితే అంతా నవ్వుతారు, వెక్కిరిస్తారు"

"మీ అన్నగారి గురించి రాస్తే? "

"మనూళ్ళో వున్న మూర్ఖుల్లో మా అన్నయ్య మొదటివాడు" అంది అమృత.

"మీ ఆర్చీ ఇంటిని గురించి రాయి" అంది లాలిత్య.

లాలిత్య వైపు ఆశ్చర్యంగా చూసింది అమృత. తనకు రాని ఆలోచన తనకంటే చిన్నపిల్లకెలా వచ్చింది? ఆర్చీ ఇల్లంటే తనకూ అభిమానమే! హాల్లో నిలువెత్తు తైలవర్ణ చిత్రం వుంది. ఎంతో ఠీవిగా కన్పిస్తాడు కుప్పుస్వామిగారు. ఆయన కట్టించాడని బాపయ్యతాత చెబుతూ వుంటాడు.

"ఎప్పుడు కట్టించారో మనకు తెలీదు గదా! తాతగారిని అడుగుదాం పద"

ఇద్దరూ ఇంట్లోంచి బయట ఆర్చీ దగ్గరకు వచ్చారు. ఆర్చీ అరుగుమీద కూర్చున్న తాత పక్కన కూర్చుంది అమృత. ఆమెకి ఆనుకుని కూర్చుంది లాలిత్య.

ఆర్చీ ఇంటిని గురించి చెప్పమని మనవరాలు అడగ్గానే ఎక్కడలేని ఓపిక వచ్చిందాయనకు. "బ్రిటిష్‌వాళ్ళ కాలంలో సైనిక శిబిరాలకు మా ముత్తాత కుప్పుస్వామి సరుకులు తరలించే కాంట్రాక్టరుగా పనిచేశాడు. నాగపూర్‌లో వుండేవాడు. బాగా సంపాదించాడు. రైళ్ళొచ్చేక సరుకులు ఎడ్ల బండ్లమీద తరలించే పని తగ్గిపోయింది. మన ఊరు వచ్చేసాడు. ఎత్తయిన పాటి మట్టి దిబ్బమీద మండువాలోగిలి ఇల్లు కట్టించాడు. చుట్టూ పదడుగుల ఎత్తున్న ప్రహరీగోడ కట్టించాడు. ప్రధాన ద్వారం దగ్గర పెద్ద ఆర్చీ కట్టించాడు. ఆర్చీ పైభాన కృష్ణుడు, ఆవుల బొమ్మలు పెట్టించాడు. చుట్టుపక్కల గ్రామాలవాళ్ళు ఇటువైపు వచ్చినప్పుడు చెప్పులు విడిచి, ఆ ఆర్చీ వైపు చూసేవాళ్ళు! రెండుమూడుసార్లు గాలివానకు ఆర్చీలో కొంతభాగం పెచ్చులూడి కిందపడింది. మళ్ళీ మా తాత, నాన్నలు ఆర్చీని మరింత అందంగా కట్టించారు.

"ఆ రోజుల్లో వరదలొస్తే ఊళ్ళోవాళ్ళంతా ఆర్చీ ఇంటి ఆవరణలోకి చేరుకునేవారు. పదిరోజులపాటు భోజనాలు పెట్టేవారట మా ముత్తాత. కరువొస్తే పురులు, పాతర్లలోని ధాన్యం తీయించి ఊళ్ళోవాళ్ళ ఆకలి తీర్చేవారట. ఆ రోజులు పోయాయి. ఇప్పుడు ఆర్చీ ఇంటివైపు చూడాలంటేనే జనం చీదరించుకుంటున్నారు" అంటూ చెప్పాడాయన.

"ఎందుకని? " అడిగింది అమృత.

"మీ నాన్న ఎవరిమాటా చెవికి ఎక్కించుకోడు. తనకు ఏది తోస్తే ఆ పని చేసుకుపోతాడు. పంటలు పండక రైతులు అల్లాడుతుంటే వాళ్ళదగ్గరున్న బంగారం, ఖరీదైన వస్తువులు తాకట్టు పెట్టుకుని అప్పు ఇస్తాడు. కనికరంలేదు మనిషికి. ఆ విషయంలో మీ అమ్మా అంతే. అడుక్కు

నేవాళ్ళకు గుప్పెడన్నం పెట్టదు. మీ పిన్నమ్మే నయం. ఇంట్లో మిగిలిన అన్నాన్ని మీ అమ్మ చూడకుండా పేదవాళ్ళకు పెడుతుంది.

నా చిన్నతనంలో మా నాయనమ్మ పండుగలొస్తే పెద్ద గంపల నిండా పిండి వంటలు చేయించేది. బెల్లపప్పచ్చులు, లడ్లు, కారప్పూస చేయించి ఇంటిముందుకొచ్చిన వాళ్ళందరికీ లేదనకుండా పంచిపెట్టేది. ఇంట్లో, పొలంలో పనిచేసేవాళ్ళకు కొత్తబట్టలు పెట్టేది. ఆ రోజులు పోయాయి" అంటూ భుజంమీద కండువాతో చెమర్చిన కళ్ళు తుడుచుకున్నాడు బాపయ్య.

ఆయన ఎన్నో విషయాలు చెప్పాడుగానీ అవన్నీ కాగితంమీద పెట్టడం కష్టమేననుకుంది. వ్యాసం సంగతి పక్కనపెట్టి తాతయ్య చెప్పే విషయాలు శ్రద్ధగా వింది అమృత. లాలిత్య సరేసరి! బొమ్మలా కూర్చుని ఆసక్తిగా వింటూ వుండిపోయింది.

"నేను చెప్పిన విషయాలు మీ నాన్నతో అనకు. నామీద ఎగిరిపడతాడు. అడుగో వస్తున్నాడు మీ నాన్న. లోపలికి వెళ్ళండి" అన్నాడు బాపయ్య.

లోపలకు పరుగెత్తారు వాళ్ళిద్దరూ. విఠల్‌కు కనబడకుండా ఓ పక్కన నిలబడి, ఆయన తన గదిలోకి వెళ్ళగానే ఇంట్లోంచి బయటపడింది లాలిత్య.

★ ★ ★

అనసూయ దగ్గర చేరి స్కూల్లో జరిగిన సంఘటన గూర్చి చెప్పింది అమృత.

"అన్నయ్య దరహాస్‌ను బలంగా తోసేశాడు. కిందపడిపోయాడా అబ్బాయి. చేతులకు దెబ్బలు తగిలాయి"

"పనీపాటలు చేసుకునేవాళ్ళ పిల్లలతో తిరగొద్దని వికాస్‌కు లక్షసార్లు చెప్పాను. అయినా వినడు వాడు. వాళ్ళతో తిరుగుతూ తగాదా పడుతూ వుంటాడు. తమ పిల్లల్ని మీ అన్నయ్య కొట్టినా మీ నాన్నకు జడిసి ఊళ్ళోవాళ్ళు పట్టించుకోవడం లేదుగాని.. అదే వేరేవాళ్ళ అబ్బాయి అయితే చావగొట్టి చెవులు మూసేవాళ్ళు!" అంది అనసూయ.

"ఆ అబ్బాయి తప్పేమీ లేదమ్మా!"

"సర్లే! ఆ సోది ఆపి పోయి అన్నం తిను!" అందామె.

'వికాస్ అందరికంటే మిన్నగా వుండాలి. చదువులో, ఆటల్లో వాడే ఫస్ట్ రావాలి! వాడిని కలెక్టర్నో, డాక్టర్నో చేయడం తన కల. ఆ కలని సాకారం చేయాలంటే ఈ ఊళ్ళో వుంటే లాభం లేదు. పొన్నూరు నుంచి కాపురం విజయవాడకు మార్చాలి' ఆలోచిస్తూ వుండిపోయింది అనసూయ.

★ ★ ★

ఇంట్లో పని ముగించుకుని, స్నానంచేసి తల్లో మల్లెపూలు పెట్టుకొని కోటికోసం ఎదురుచూస్తూ కూర్చుంది సంపూర్ణ.

రోజూ రాత్రి తొమ్మిది దాటేక గానీ ఇంటికి చేరుకోడు.

"ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో నువ్వు నా భార్యవయ్యావు. ఇంటర్ దాకా చదివి మున్సిపల్ ఆఫీసులో టైపిస్ట్‌గా పనిచేస్తున్నావ్. నేనేమో పది తప్పి ఆటో నడుపుకుంటున్నాను. నన్ను పెళ్లి చేసుకోడానికి ఎందుకు ఒప్పుకున్నావ్? " అనేవాడు కోటి పెళ్లయిన కొత్తలో.

"చిన్నప్పటినుంచి నిన్ను చూస్తున్నాను. మగపిల్లలతో ఆడుకోవడంకంటే నాతో ఎక్కువ సమయం గడపడానికి ఇష్టపడేవాడివి. ఇంట్లో ఏ పిండివంట వండినా నాకు తెచ్చిపెట్టేవాడివి. దొడ్లో మల్లెపూలు, సన్నజాజులు కోసుకొచ్చి ఇస్తూ ఉండేవాడివి. ఎవరన్నా నన్ను అల్లరిపెట్టడానికి ప్రయత్నిస్తే వాడిని చితకబాదేవాడివి. మీ అమ్మ గారిక్కూడా నేనంటే ప్రాణం. సొంతకూతురిలా చూసేది.. మా అమ్మ నన్ను వేరే ఊరు తీసుకెళ్లినప్పుడు నిన్ను విడిచి నేను క్షణమైనా ఉండలేనన్పించేది. అందుకే నీతో జీవితం పంచుకోవాలని నిశ్చయించు

కుని నిన్ను చేసుకోడానికి ఇష్టపడ్డాను" మనసువిప్పి శోభనం రోజే చెప్పేసింది.

ఆమె మాట్లాడుతూంటే సినిమాల్లో సావిత్రి, కృష్ణకుమారి మాట్లాడినట్లు అన్పించేది. పాత సినిమాలంటే ఇష్టం అతనికి. ఆరాధనగా ఆమెవైపు చూస్తుండేవాడు. నోట్లోంచి మాటలు ఊడిపడేవి కావు, ఆమె ఎదురుగా ఉంటే. ఇంటర్‌లో స్టేట్ ర్యాంక్ వచ్చింది సంపూర్ణకు. మెడిసిన్ చదవాలని ఉండేది. తనకంటే తక్కువ మార్కులు వచ్చినవాళ్లు పై చదువులకు వెళ్లేరు. ఆమె చదువు ఇంటర్‌తోనే ఆగిపోయింది. మున్సిపాలిటీలో టైపిస్టుగా చేరింది. కంప్యూటర్ ఉపయోగించే కొద్దిపాటి నైపుణ్యం సంపాదించింది. డేటా ఎంట్రీ ఆపరేటర్‌గా మారిపోయింది. చిన్న ఉద్యోగం, తనను ప్రేమగా చూసుకునే భర్త, చెప్పినట్లు నడుచుకునే ఇద్దరు పిల్లలు- అంతకంటే తనకు కావాల్సింది ఏముంది?

కోటి వచ్చాడు. స్నానంచేసి హాల్లో కూర్చున్నాడు. హాలంటే పెద్దదేం కాదు. రెండు మంచాలు పట్టే స్థలం. అందులో టీవీ.. పక్కనున్న చిన్నగదిలో దరహాస్, లాలిత్య చదువుకోవడం, పడుకోవడం.

"పిల్లలేరి? " భోజనం చేస్తూ అడిగాడు.

"సినిమాకెళ్లారు. వచ్చేస్తూ ఉంటారు. దరహాస్‌కు పరీక్షలు అయిపోయాయిగా, చెల్లెల్ని తీసుకుని సినిమాకెళ్లాడు. వాడి పరీక్షల ఫలితాలు వచ్చేక కాలేజీలో చేర్పించాలి. నిడుదోలు పి.బి.యస్. కాలేజీలో చేర్పిద్దాం! నేను ఇంటర్ చదువుకుంది అందులోనేగా! ఆ కాలేజీ ప్రిన్సిపాల్ గారు నాకు తెలిసినవారే! మొన్న మా ఆఫీసుకు వస్తే దరహాస్ గురించి చెప్పాను.."

ఆమె మాటలకు అడ్డొస్తూ "చదువుల సంగతి నాకు తెలీదు. చెప్పినా నా బుర్రకు ఎక్కదు.." అన్నాడు ములక్కాయ ముక్క నములుతూ.

భర్తవైపు ఆప్యాయంగా చూసింది.

అతనికి ఏ దురలవాట్లూ లేవు. రోజుకు ఐదారుసార్లు కాఫీ మాత్రం తాగుతాడు. ఆటో తిప్పి సంపాదించినదంతా తెచ్చి సంపూర్ణకే ఇచ్చేస్తాడు. ఇంటి వ్యవహారాలు, పిల్లల చదువులు, అన్నీ ఆమే చూసుకుంటుందనే భరోసా అతనిది. ఆమె ఏది చెబితే అది చేసుకుపోవడమే! అందరూ మెచ్చుకునే తీరులో పిల్లల్ని ఆమె తీర్చిదిద్దుతుందని అతని నమ్మకం.

భోజనం చేసి ఇంటిముందున్న అరుగు మీద కూర్చున్నాడు.

సంపూర్ణ వచ్చి అతనిపక్కన నిలబడితే "భోజనం చేశావా? " అనడిగాడు.

"పిల్లల్ని రానివ్వండి" అందామె.

రోడ్డుకు అవతలి వైపున్న ఆర్చీ ఇంట్లోంచి పెద్దగా పాటలు విన్పిస్తున్నాయి. ఇంటికి రంగురంగుల దీపాలు అలంకరించి ఉన్నాయి. పిల్లల కేకలు, అరుపులతో అంతా సందడిగా ఉంది.

"ఏమిటి విశేషం? " అడిగాడు కోటి.

"వాళ్లబ్బాయి పుట్టినరోజట. ఊళ్లో పెద్దవాళ్లను, బంధువుల్ని పిలిచి పార్టీ ఇస్తున్నారు" చెప్పిందామె.

"మన పిల్లల్ని పిలవలేదా? "

సమాధానం చెప్పకుండా ఆర్చీ ఇంటివైపు చూస్తూ ఉండిపోయింది.

ఎన్నో సంవత్సరాలనుంచి ఎదురెదురు ఇళ్లలో ఉంటున్నా ఆ ఇంట్లోవాళ్లు పెద్దగా మాట్లాడరు. బాపయ్యగారే ఎప్పుడన్నా ఎదురుపడితే 'బాగున్నావా తల్లీ!' అంటూ పలకరిస్తాడు. లాలిత్య అప్పుడప్పుడూ ఆ ఇంటికెళ్లి ఆయన మనవరాలు అమృతతో ఆడుకుంటుంది. ఆ ఇంట్లో అందరూ ఖరీదైన దుస్తులు వేస్తారు. ముట్టుకుంటే మాసిపోయేట్లు ఉంటారు.

'అదృష్టవంతులు. వాళ్లకేం ఆర్థిక సమస్యల్లేవు. కార్లో దర్జాగా తిరుగుతుంటారు' అనుకుంది మనసులో.

దరహాస్, లాలిత్య సినిమా చూసి

ఇంటికి రావడంతో లోనికెళ్ళింది సంపూర్ణ వాళ్లకు భోజనం పెట్టడానికి.

ఆర్చీ ఇంటి వైపు చూస్తూ ఉండిపో యాడు కోటి.




"ఉదయం నుంచి సుగుణ కన్పించ లేదే?" అడిగాడు విఠల్.

విసుగ్గా భర్తవైపు చూసింది అనసూయ.

"ఎదురుగా నేను కూర్చునివుంటే మీకు కన్పించడం లేదు. ఎప్పుడూ సుగుణ ధ్యాసే మీకు" అందామె.

"అది కాదు. ఇంట్లో చలాకీగా అటూ ఇటూ తిరుగుతూ పనివాళ్లకు ఏదోక పని చెబుతూ ఉంటుంది కదా! ఈరోజు ఎక్కడా కన్పించకపోయేసరికి అడిగాను" అన్నాడతను.

"ఎప్పుడూ మీ ఎదురుగా నిలబడాలా?"

"అదేమిటే అలా మాట్లాడుతావ్? మన కంటే చిన్నది. పెళ్లయిన నెల రోజులకే భర్త చనిపోతే మనింటికి తీసుకొచ్చాం! పిల్లలకు పేరుకు కన్నతల్లివన్న మాటేగానీ నువ్వెప్పుడూ వాళ్లను పట్టించుకోలేదు. నీ చెల్లెలే వాళ్లని పెంచి పెద్ద జేసింది. నిన్న సుగుణను ఏదో అన్నావట. అన్నం తిన కుండా అలిగింది. సొంత చెల్లెలి మీద కస్సుబుస్సుమంటే ఎలా?"

"నిన్న భోజనం చెయ్యలేదన్న సంగతి మీకెలా తెలిసింది? అదే చెప్పిందా?" అడి గింది భర్తవైపు చురచుర చూస్తూ.

"నాన్నగారు చెప్పారు"

"మీ నాన్నగారికి, మీకు, మీ పిల్లలకు సుగుణంటేనే ఇష్టం! నేనే పరాయిదాన్న యాను" అంది ముక్కు చీదుతూ.

ఆమెను సముదాయించే ప్రయత్నంలో పడ్డాడు విఠల్.

చిన్న వయసులో భర్త చనిపోయాడన్న సానుభూతి తప్పితే సుగుణను ఎన్నడూ మరోభావంతో చూసేవాడు కాదు విఠల్.

ఆమెను బాగా చదివించి ఉద్యోగస్తురా లిని చెయ్యాలని ప్రయత్నించాడు గానీ ఆమెకి చదువు ఒంటబట్టలేదు. ఆమెకు మళ్లీ పెళ్లి చేయాలని నాలుగైదు సంబం ధాలు చూశాడు. రెండో పెళ్లి అనేసరికి ఎవరూ ముందుకు రాలేదు. స్కూలు మాస్టారొకాయన చేసుకుంటానని ముందు కొచ్చాడు. ముహూర్తం పెట్టుకున్నారు. అయితే రోడ్డు దాటుతూ లారీ వ చ్చి గుద్దే సరికి ఆ మాస్టారు చనిపోయాడు.

అతని బంధువులొచ్చి "నష్టజాతకురా లివి. నీతో ఎవడన్నా జీవితం పంచుకోవా లని వస్తే అల్పాయుష్కుడై పోతాడు. మళ్లీ ఎవరి దగ్గరా పెళ్లి ప్రస్తావన తేకు" అంటూ సుగుణను తిట్టిపోశారు.

వాళ్ల మాటలు సుగుణ మనసులో బలంగా నాటుకున్నాయి. మళ్లీ పెళ్లి చేసు కోలేదు. చాటుమాటుగా తన భర్తతో చెల్లెలు సరసాలాడుతుందేమోనని అను మానం అనసూయకు.

బెడ్‌రూములో విఠల్, అనసూయ మధ్య పోట్లాట ప్రారంభమయింది.

"ఇరవయ్యేళ్ల కిందట పెళ్లి చేసుకున్న కొత్తలో నేను మాట్లాడితే మధురంగా ఉంటుందనే దానివి. గంటలకొద్దీ కబుర్లు చెబితే నవ్వుతూ వినేదానివి. ఇప్పుడేమో నేను మాట్లాడితేనే చిరాకు. నేనేది చేసినా నీకు నచ్చదు" అన్నాడు.

"అప్పుడు మీ మాటలు మధురంగానే ఉండేవి. నిజమే! ఇప్పుడు మీ ధోరణి

మారిపోయింది. నేనేది చెప్పినా విన్పించుకోరు. తప్పులన్నీ మీరు చేస్తూ ఇతరుల్లో తప్పులు వెతుకుతున్నారు" అందామె.

"నువ్వేం చెప్పినా వింటున్నా. నువ్వేది కావాలన్నా తెచ్చి ఇంట్లో పడేస్తున్నాను. నేనేం తప్పు చేశానో చెప్పు!"

"మీకు తెలుసు మీరేం తప్పు చేశారో! అనవసరంగా రెచ్చగొట్టకండి. మనం ఈ ఊళ్లో ఉండొద్దు, వెళ్లిపోదామని మొత్తుకున్నాను. ఎదురింటి సంపూర్ణ కొడుకు పదో తరగతి ఫలితాల్లో టాప్ టెన్‌లో ఉన్నాడు. మీ అబ్బాయికి యాభై శాతం మార్కులొచ్చాయి. ఇంటర్ ఇక్కడే చదివిస్తే ఎందుకూ పనికిరాడు. వాడిని డాక్టర్నో, కలెక్టర్నో చెయ్యాలని నా పట్టుదల. మనమిక్కడినుంచి ఫ్యామిలీని హైదరాబాద్‌కో, విజయవాడకో షిఫ్ట్ చేద్దాం!"

"అదెలా కుదురుతుంది? ఆర్చీ ఇంటిని వదిలేసి వెళ్లిపోదామంటే మా నాన్న ఒప్పుకోడు. తరతరాలుగా ఈ ఇంట్లోనే ఉంటున్నాం! ఈ ఇల్లు వదిలేసి వెళ్లిపోవడమంటే జరిగేపని కాదు. అయినా పిల్లల్లో పట్టుదల ఉండాలి! జీవితంలో అనుకున్న దాన్ని సాధించాలనే ఆత్మవిశ్వాసం పై స్థాయిలో ఉండాలి. నేర్చుకోవాలన్న తపన ఉంటే ఎక్కడ చదివినా ఉన్నత స్థాయిని చేరుకోవచ్చు! పట్టణాలకు పరుగులు తీయాల్సిన పనేంలేదు" చెప్పుకుపోయాడు విఠల్.

"ఇక్కడుంటే చివరకు గుమస్తా ఉద్యోగం కూడా రాదు. తరువాత మీ ఇష్టం!" అనేసి మరోపక్కకు తిరిగి పడుకుందామె.

ఆమె అలిగిందంటే వారంరోజులు మాట్లాడదు. భోజనం చెయ్యదు. తనకు నరకం చూపిస్తుంది. అందుకే "ఏం చేద్దాం? విజయవాడ పోదామంటావా? " అడిగాడు ఆమె భుజంమీద చెయ్యివేసి.

కొంచెం మెత్తబడిందామె. అతనివైపు తిరిగి "ఇక్కడి పొలాలు కౌలుకిచ్చెయ్యండి. విజయవాడలో టాప్ కాలేజీలో వికాస్‌ను చేర్పిద్దాం! ట్యూషన్ పెట్టిద్దాం! మనం అనుకున్నట్లుగా వాడిని కలెక్టర్‌గా తీర్చిదిద్దవచ్చు! మీరూ అక్కడ వ్యాపారం మొదలు పెట్టండి. ఫైనాన్స్ కంపెనీ పెట్టండి. ఇతర వ్యాపారులకు అప్పులిచ్చి వడ్డీ వసూలు చేసుకోవచ్చు. చిట్స్ నిర్వహించినా కమీషన్ వస్తుంది. వీలుంటే సినిమాహాలు కొనెయ్యండి. అక్కడకు వెళ్లేక అవన్నీ ఆలోచిద్దాం!"

"మా నాన్న ఈ ఇల్లు వదిలి రాడే!"

"ఇక్కడే ఉండమనండి. బలవంతంగా తీసుకువెళ్లలేం గదా!"

"మరి ఆయనకు వండిపెట్టేదెవరు? "

"మా చెల్లెల్ని ఇక్కడే ఉండిపొమ్మని చెబుదాం! మావయ్యగారిని కనిపెట్టుకుని ఉంటుంది.."

మామగారిని, చెల్లెల్ని వదిలించుకోడానికి ప్లాన్ వేసిందని అర్థమయ్యింది. ఇక వికాసుక్కూడా నూరి పోస్తుంది. వాడూ "ఇక్కడ చదవను. మంచి కాలేజీ ల్లేవిక్కడ" అనడం మొదలెడ్తాడు.

భార్య మాట కాదనే స్థితిలో తను లేడు. అంతరాంతరాల్లో అతనిక్కూడా పట్నం వెళ్లి బాగా సంపాదించాలనే కోరిక ఉంది. ఇప్పుడా కోరిక తీరే మార్గం కన్పించడంతో "అలాగే చేద్దాంలే!" అన్నాడు.

మొండి పట్టుదలకు పోకుండా తను చెప్పినమాట విన్నాడన్న సంతోషం ఆమెలో చోటుచేసుకుంది. ప్రేమగా విఠల్ చెంపలు నిమిరింది.

★ ★ ★

దరహాస్‌కు మూర్తి మాష్టారు ఎదురవడంతో పాదాలకు వంగి నమస్కరించాడు.

పొంగిపోయిన ఆయన "ఈ కాలం కుర్రాళ్ళలో తల్లిదండ్రులమీద ప్రేమ, గురుభక్తి తగ్గిపోతున్నాయిరా! నువ్వెక్కడో తప్పు పుట్టావ్! మీ అమ్మానాన్నా కష్టపడి చదివిస్తున్నారు. నువ్వు ప్రయోజకుడివైతే

వాళ్లెంతో సంతోషిస్తారు. ఏ చదువులు ఆర్థికంగా ఉపయోగపడతాయో వాటివెంటే యువత పరుగులు తీస్తూవుంది! నువ్వూ పరిగెత్తు. కానీ ఆయాసపడుతూ 'నేను పరిగెత్తేది నలుగురికోసం, పేదవాళ్ల కన్నీళ్లు తుడవడానికి అనుకుంటూ ఉండు ఎప్పుడూ! ఏ కాలేజీలో చేరదామనుకుంటున్నావ్? " అడిగారు మూర్తి మాష్టారు.

"ఇక్కడే చదువుకుంటానండి. మన ఊళ్లోనే పొలాలమధ్య పి. బి. యస్. కాలేజీ ఉంది. ఇంటర్, డిగ్రీ పూర్తయ్యేవరకూ ఇక్కడే చదువుకోవచ్చు! వేరే ఊరు వెళ్లాల్సిన అవసరం లేదండి!"

"ఇక్కడే చదువుకో! కాలేజీలో పెద్ద లైబ్రరీ ఉంది. ఆడుకోడానికి విశాలమైన ఆటస్థలం ఉంది. పట్టణాల్లో చాలా కాలేజీల్లో లైబ్రరీలు ఉండవు, ఆడుకోడానికి స్థలం ఉండదు. 'రూట్స్ ఆఫ్ నాలెడ్జ్ ఆర్ బిట్టర్, బట్ ఫ్రూట్స్ ఆర్ స్వీట్' అనే సామెతుంది. ఇప్పుడు కష్టపడి మంచి స్థాయికి ఎదిగావంటే అప్పుడు తీరిగ్గా కూర్చుని తియ్యటి ఫలాలు తినొచ్చు!"

వజ్రాల్లాంటి మాటలు చెప్పారు మాష్టారు. ఆ మాష్టారెప్పుడు కన్పించినా తనకు స్ఫూర్తిని కలిగిస్తారు. ఆయనకూ సమస్యలున్నాయి. కానీ ఎవరికీ చెప్పుకోరు.

ఇద్దరు ఆడపిల్లలకు పెళ్ళిళ్లు చెయ్యాలి! ఒక్కడే కొడుకు. చదువుమీద శ్రద్ధ లేదు. డిగ్రీ తప్పాడు. స్నేహితులతో కలిసి సెంటర్‌లో నిలబడటం, రోడ్డుమీద వెళ్తున్న అమ్మాయిలను కామెంట్ చేయడం, బైక్‌మీద స్పీడుగా వెళ్లడం, సెల్ ఫోన్లలో గంటలకొద్దీ మాట్లాడటం అవే ఆ అబ్బాయికి వచ్చిన విద్యలు. అందరికీ చదువు చెప్పినట్లే వాడికీ మాష్టారు పాఠాలు చెప్పినా లాభం లేకపోయింది. మాష్టారి హితబోధ పుత్రుడి చెవిలో దూరలేదు. దారి తప్పినట్లే లెక్క.

"ఒరేయ్ బాబూ! నువ్వు ఎదుగుతున్నావ్. ఏదోక లక్ష్యాన్ని మనసులో ఏర్పరుచుకో! నేను పెద్ద ఇంజినీరవాలి, డాక్టరవాలని అందరిముందు 'టాం, టాం' కొట్టుకోనవసరం లేదు. నువ్వు చేరదల్చుకున్న లక్ష్యంవైపు ఏకాగ్రతతో సాగిపో! ఎన్నో ప్రాంతాల్లో, విభిన్న మనస్తత్వాలున్న మనుషులమధ్య సంచారిలా తిరుగుతూ ఉండు. జీవితం ఎన్నో అనుభవాలు, పాఠాలు నేర్పుతుంది. అదరక, బెదరక ముందుకు సాగిపోతూనే ఉండు!" అన్నారు మూర్తి మాష్టారు దరహాస్ భుజం నిమురుతూ.

## కొత్తగాలి...

**ధనం మదుపు**
**భావి సుఖాలకు నెలవు!**
**జలం పొదుపు**
**నీటి కష్టాలకు సెలవు!**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

ఆయనతోపాటు భావనారాయణస్వామి గుడి దాకా నడిచివెళ్లాడు. ఆలయ ప్రాంగణంలో కూర్చున్నారిద్దరూ.

"ఒక దేశాన్ని అర్థం చేసుకోవడానికి ఆ దేశానికి చెందిన మనిషితో మాట్లాడితే సరిపోతుందా? అని ఎవరన్నా అడిగితే 'ఆ మనిషి ఎవరు?' అనే దానిపైనే మన సమాధానం ఆధారపడి ఉంటుంది. మనం ఓ జూదరితో మాట్లాడినంత మాత్రాన ఆ దేశం 'జూదగాళ్ల నిలయం' అనే అవగాహనకు రాకూడదు! విభిన్న తరాలకు చెందిన వాళ్ళు, విభిన్న జీవితాలను గడిపినవాళ్లతో అనుబంధం ఏర్పర్చుకుంటే సరైన అవగాహన వస్తుంది జీవితంపట్ల"

ఆయన చెప్పే విషయాలన్నీ శ్రద్ధగా విన్నాడు దరహాస్.

చీకటి పడటంతో స్వామి దర్శనం చేసుకుని గుడి నుంచి బయటకు వచ్చారిద్దరూ. గుడిదగ్గర కంటే పక్కనున్న పోలీస్ స్టేషన్ దగ్గర జనం ఎక్కువ ఉన్నారు.

★ ★ ★

మధ్యాహ్నం రెండుగంటల సమయంలో ఇంటిముందు ఆటో ఆపాడు కోటి.

ఉదయం పదింటికి బాక్స్ నిండా అన్నం, కూర పెట్టుకుని వెళతాడు. మధ్యాహ్నం ఇంటికి రాడు. మరి, ఆ సమయంలో ఎందుకొచ్చాడా? అని ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది సంపూర్ణ గుమ్మం దగ్గర నిలబడి.

"వెంటనే ఆటో ఎక్కు? " అన్నాడతను.

"ఎక్కడికి? "

"చెబుతాగా..! ముందు ఆటో ఎక్కు"

ఇంట్లో ఉన్న దరహాస్‌కు చెప్పేసి వచ్చి ఆటోలో కూర్చుందామె. ఆటో వాసంతి ఇంటిముందు ఆగింది. ఇంటిముందు గుమిగూడిన జనాన్ని చూడగానే సంపూర్ణ కంగారుపడి "ఏం జరిగింది? " భర్తనడిగింది ఆటో దిగబోతూ.

"వాసంతి చనిపోయింది. మెదడులో రక్తనాళాలు తెగిపోయాయట. తెల్లవారుజామున చనిపోయింది. నేనే ఆసుపత్రి నుంచి ఆటోలో ఇంటికి తీసుకొచ్చాను" అన్నాడు కోటి.

ఇంటిముందు ఉంచారు శవాన్ని.

వచ్చినవాళ్లంతా చూసి వెళ్లిపోతున్నారు. శవందగ్గర మున్సిపాలిటీలో పనిచేసే స్వీపర్లు నలుగురైదుగురు కూర్చున్నారు. వాసంతి బంధువులు ఇద్దరుముగ్గురు కన్పించారు గానీ వాళ్లు దూరంగా నిలబడ్డారు. పూసుకుని తిరిగితే, అంత్యక్రియల ఖర్చు తమమీద ఎక్కడ పడుతుందోనని వాళ్ల భయం.

వాసంతి ఉంటున్నది అద్దె ఇల్లు. శవాన్ని ఎప్పుడు తీసుకువెళ్తారోనని ఎదురుచూస్తున్నాడు ఇంటి ఓనరు. ఇంట్లో ఉన్న కొద్దిపాటి సామాను బయటపడేసి, ఆ గది కడిగించి శుద్ధి కార్యక్రమం చేపట్టాలని ఆలోచిస్తున్నాడతను.

అప్పటివరకు పాపను ఎత్తుకుని ఆడిస్తున్న పక్కింటావిడ, సంపూర్ణను చూసి పాపనామె ఒడిలో పడుకోబెట్టి ఏదో పని ఉందంటూ వెళ్లిపోయింది. వాసంతి బంధువులు పాపవైపే చూడటంలేదు.

మున్సిపాలిటీలో పనిచేసే ఓ యాభైఏళ్ల ఆడమనిషి వాసంతిని గూర్చి అందరికీ వినబడేటట్లు "వాసంతి మా మున్సిపాలిటీలో రోజువారీ జీతంమీద పనిచేస్తూ ఉంది. మా పారిశుధ్య విభాగంలోనే రోడ్లు ఊడ్చే కార్మికులకు సహాయకురాలిగా ఉండేది. పిల్ల నిదానం. ఎవరే పని చెప్పినా గొణుక్కోకుండా చేసేది. పోన్నారు మున్సిపాలిటీకి మొన్న అక్టోబరులో స్వర్ణోత్సవాలు జరిగాయి. ఊళ్లో ప్రముఖులకు పురపాలక సంఘం వాళ్లు సన్మానం చేస్తే, సీనియర్ పారిశుధ్య కార్మికులకు సన్మానం చెయ్యాలని మున్సిపల్ కమిషనర్‌గారితో వాదించి నాకు సన్మానం చేయించింది. మంచి మనసున్న పిల్ల. అందరితో బాగా కలిసిపోయేది. ఆ అమ్మాయి ఉద్యోగం పర్మినెంటు చెయ్యాలని కమిషనరుగారు ప్రతిపాదనలు సిద్ధం చేస్తున్న సమయంలో చనిపోయింది!" చెప్పుకుపోయింది వాసంతి గురించి.

ఆమెతో తనకున్న అనుబంధం నెమరువేసుకుంది సంపూర్ణ.

వాళ్లిద్దరిదీ ఒకే ఊరు. పక్కపక్క ఇళ్లు. వయసులో పదేళ్లు చిన్నది. "లెక్కలు చెప్పు అక్కా!" అంటూ చిన్నప్పుడు తన పక్కన చేరేది. బాగా చదువుకోవాలని ఉబలాటపడేది. పదో తరగతిలోనే చదువు ఆగిపోయింది. వాసంతి తండ్రి చెరుకుపల్లిలో ఉన్న ప్రైవేటు హాస్పిటల్లో కాంపౌండర్‌గా పనిచేసేవాడు. ఆరుగురు పిల్లలు. సంసారం నెట్టుకురావడం కష్టంగా

ఉండేది. వాసంతికి పెళ్లిచేసి పంపించాడు.

భర్తతోపాటు పొన్నూరు వచ్చింది. ఆ అమ్మాయి బంధువులు పొన్నూరులో ఉన్నారుగాని ఎవరూ పట్టించుకోలేదు.

భర్త శివయ్య నిలకడ లేని మనిషి. ఏ పనీ కుదురుగా చేసేవాడు కాదు. కమిషన ర్‌తో మాట్లాడి వాసంతికి స్వీపర్‌గా తా



త్కాలిక ఉద్యోగం ఇప్పించింది. ఒకరోజు తన దగ్గరకు వచ్చి భోరున ఏడ్చేసింది. కంగారు పడిపోయింది. 'ఆమె భర్తకు ఏమన్నా అయిందా? చెరుకుపల్లిలో ఉండే ఆమె తల్లిదండ్రులకు ఏదన్నా ఆపద వచ్చిందా? భర్త చితకబాదాడా?' ఏవేవో ఆలోచనలు బుర్రలో తిరుగాడాయి.

"గర్భవతిని అయ్యాను" అంది వాసంతి కళ్లు తుడుచుకుని.

"సంతోషించాల్సింది పోయి ఏడుస్తావెందుకు? " అడిగింది.

"శివయ్య నన్ను వదిలిపెట్టి వెళ్లిపోయాడు. పుట్టబోయే బిడ్డను ఎలా పెంచాలి? "

"నీకు అండగా నేనుండగా ఎందుకు భయం? నేనేదో అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నానని కాదు. మాకు ఉన్నవాటినే నీతో పంచుకుంటాను. నీకే అవసరం వచ్చినా మొహమాటపడకుండా నన్నడుగు!" అంటూ ఓదార్చింది వాసంతిని.

డెలివరీ సమయంలో తోడుగా ఉండి ఆదుకుంది.

వాసంతికి అంతలోనే నూరేళ్లు నిండిపోతాయని కలలో కూడా అనుకోలేదు.

పాప ఏడవడం మొదలుపెట్టింది. ఆకలైనట్లుంది. కన్నతల్లి చనిపోయిందని ఆ పసిపాపకేం తెలుసు? వాసంతి బంధువులెవరూ పాపను ఎత్తుకుని సముదాయించలేదు. దూరంగా నిలబడి పాపవైపు చూస్తున్నారు.

వంటింట్లో పాలగిన్నె కోసం వెతికింది. ఖాళీ గిన్నెలు, డబ్బాలు కన్పించాయి. కోటిని పిలిచి హోటల్‌నుంచి పాలు తెప్పించి వేడిచేసి కొద్దిగా పంచదార కలిపి పాపకు పాలు పట్టింది.

బుజ్జి పొట్ట నిండగానే నవ్వు మొహం పెట్టింది పాప.

పాపకేం తెలుసు కన్నతల్లిని పాడెమీద చేర్చి శ్మశానానికి తీసుకు వెళ్తున్నారని?

అమ్మమ్మ చనిపోయినప్పుడు తనకు సంవత్సరం వయసట! నవ్వుకుంటూ అమ్మమ్మ శవం దగ్గర తిరిగిందట. అమ్మమ్మ చనిపోయినప్పుడు అమ్మ ఏడ్చింది. అమ్మ చనిపోయినప్పుడు తను ఏడ్చింది. ఎవరిమీద ఎవరికి ఎంత ప్రేమ వున్నా పైనుంచి పిలుపు వచ్చినప్పుడు వెళ్ళిపోవాల్సిందేగా!

ఒంటరిగానే రావడం.. ఒంటరిగానే పోవడం.. పైన ఆకాశం, కింద నేల.. మధ్యలో మన ఆట కొంత కాలం.. 'ఆట గదరా శివా!' ఎక్కడో దూరాన్నుంచి టివీలో వస్తున్న పాట శవాన్ని మోసుకెళ్తున్నవాళ్లకు విన్పించింది.

"పాపను మనింటికి తీసుకువెళ్దాం!" అంది సంపూర్ణ శ్మశానం నుంచి తిరిగొచ్చిన కోటితో.

తలూపేడు కోటి.

'మరీ ఇంత మంచి మనసున్నామెను నా భార్యగా చేశావేం తల్లీ! ఆమె మంచితనాన్ని భరించలేకపోతున్నాను' అనుకున్నాడు కోటి.. ఆటో తోటమ్మ గుడి పక్కగా వెళ్తున్నపుడు.

★ ★ ★

"పాప పేరు ఏంటమ్మా? " సంపూర్ణను అడిగింది లాలిత్య.

"హరిత.. వాళ్ళమ్మ పెట్టుకున్న పేరది"

"పచ్చదనం అంటే మురిసిపోతుందేమో! హరిత ఏడ్చేటప్పుడు పూలమొక్కల దగ్గరికి తీసుకువెళ్తే ఏడ్పు ఆపేస్తుందేమో! చెట్టు నీడలో నిద్రపుచ్చితే హాయిగా నిద్రపోతుందేమో! చక్కటి పేరమ్మా.. హరితను మనింట్లోనే పెంచుదాం! ఎవరికీ ఇవ్వొద్దు! వాళ్ళ నాన్నొచ్చి అడిగినా ఇవ్వొద్దు!" అన్నాడు దరహాస్.

"హరితను నేనే ఆడిస్తా!" అంది లాలిత్య తల్లి చేతుల్లోంచి పాపను తీసుకుంటూ.

"ఈ మురిపెం మూన్నాళ్ళ ముచ్చటగా వుండకూడదు. జీవితాంతం సొంత చెల్లె

ల్లాగే చూసుకోవాలి" అంది సంపూర్ణ.

"అలాగేనమ్మా!"

"నాకోసం మంచి మొగుడిని వెతుకుతు న్నారనుకోండి! చదువుకున్నవాడు, మంచి మనసున్నవాడు నన్ను పెళ్ళి చేసుకోవడానికి వస్తే మా చెల్లెలు హరితను చేసుకోండి! అని చెబుతా" అంది లాలిత్య.

ఆ మాటకు నవ్వొచ్చింది సంపూర్ణకు.

"మనింట్లోకి అదనంగా మరో పాప వచ్చింది. హరిత ఏడిస్తే మీ చదువులకు ఇబ్బంది కలగొచ్చు! మనకు వచ్చే కొద్ది ఆదాయంలో ఆ పిల్లక్కూడా బట్టలు కొనాలి, పాలు కొనాలి, ఆడుకునే వస్తువులు కొనాలి.. మీకు ఖర్చుపెట్టే డబ్బులో కొంత తగ్గించాల్సొస్తుంది.. మీతోపాటు సమానంగా ఆ పాపక్కూడా ఖర్చు పెడుతున్నామని ఈర్ష్య పడకూడదు" వాళ్లకు అర్థం అయ్యేటట్లు వివరంగా చెప్పింది.

"అలా ఎప్పుడూ ఈర్ష్యపడం! మనకే గనుక ఆర్ఫీ ఇల్లు లాంటి భవనం వుంటేనా? మరో పదిమందికి ఆశ్రయం కల్పిస్తాం! సొంత చెల్లెళ్ళు, తమ్ముళ్ళలాగే చూస్తాం" అన్నాడు దరహాస్.

హరితను ఎత్తుకుని బయటకు తీసుకువెళ్లింది లాలిత్య, తన స్నేహితురాళ్లకు చూపించడానికి.

కాలేజ్‌లో ఉదయం జరిగిన సంభాషణ గుర్తుకొచ్చింది దరహాస్‌కు.

"మొన్నీమధ్య జరిగిన జనాభా లెక్కల్లో వెయ్యిమంది అబ్బాయిలకు 914 మంది అమ్మాయిలే వున్నారని తేలింది.." అన్నాడు లెక్చరర్.

"ఒక్క గర్ల్‌ఫ్రెండు కోసం వెయ్యిమంది అబ్బాయిలు ప్రయత్నాలు చేసుకోవాల్సొస్తుందేమో సర్ మరో పదేళ్ళు పోయేక" అన్నాడో అల్లరి స్టూడెంట్.

"ఆడపిల్లల పుట్టుకలో ఇదే తరహా డౌన్ వార్డ్ ట్రెండు కొనసాగితే సైకిల్ ఆఫ్ లైఫ్ కొలాప్స్ అయిపోతుంది.. ఆడపిల్లే లేకపోతే ముందు ముందు సృష్టి ఆగిపోతుంది. ఆడపిల్లలు లేకపోతే పవిత్రమైన 'మాతృమూర్తి' కనుమరుగవుతుంది" చెప్పుకుపోయాడు లెక్చరర్ ఆవేశంగా.

పుట్టబోయే శిశువు ఆడపిల్ల అని స్కానింగ్‌లో తెలుసుకుని గర్భంలోనే విచ్ఛిన్నం చేసే భ్రూణహత్యల గురించి, పుట్టబోయే ఆడబిడ్డను తొలిగించుకోడానికి కోడలిమీద అత్తామామలు, భర్త చేసే గృహహింసల వరకూ వివరంగా చెప్పారాయన.

"ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి సార్? " అడిగాడు దరహాస్.

"తల్లిదండ్రులు వదిలేసిన దిక్కులేని పసిపిల్లలకు ముందు షెల్టర్ కల్పించాలి. తిండి గుడ్డ సమకూర్చాలి! సమాజంలోని అన్నివర్గాల పిల్లలతో సమానమైన విద్యావకాశాలు కల్పించాలి! హయ్యర్ స్టడీస్‌లో స్కాలర్‌షిప్పులు అందించాలి!"

"ఆర్థిక బాధలతో పిల్లల్ని పెంచలేనివారి సంగతేంటి? " ప్రశ్నించిందో విద్యార్థిని.

"వాళ్ల జీవనోపాధికి శిక్షణ ఇవ్వాలి! టైలరింగ్, ఫ్యాషన్ డిజైన్లు, ఆటవస్తువుల తయారీ లాంటివి. కుటీరపరిశ్రమలు పెట్టుకోడానికి ఆర్థిక సహాయం చేయాలి. 'ఇన్‌కమ్ జనరేటింగ్ స్కిల్స్' నేర్పించాలి! ఆర్థికంగా చితికిపోయిన వారిలో విశ్వాసాన్ని ప్రోది చెయ్యాలి!

మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే

## కొత్తగాలి...

**కార్మికుల**
**శక్తి**
**పెత్తందారులకు**
**భుక్తి!**

– దాశరెడ్డి చిరంజీవిరావు,
శ్రీకాకుళం

ఇటువంటి సామాజిక రుగ్మతలు తొలగిపోడానికి అవేర్‌నెస్ క్యాంప్‌లు నిర్వహించాలి! మీరు కూడా గ్రామాలకు వెళ్ళి అందరిలో చైతన్యం తీసుకురావొచ్చు! చట్టపరంగా మహిళలకు వున్న హక్కులను వాళ్ళకు అవేర్‌నెస్ క్యాంప్‌ల ద్వారా చెప్పొచ్చు!

ఈవ్‌టీజింగ్, ర్యాగింగ్ పేరుతో ఆడపిల్లలను ఏడిపించకూడదు! హేళన చెయ్యరాదు. ఆడవారిని గౌరవించాలి! 'కట్నం తీసుకోం' అని బయటకు చెప్పడం, ఉపన్యాసాలివ్వడం కాకుండా అందుకు మానసికంగా సిద్ధపడాలి. ఇవన్నీ చేస్తే లింగ వివక్ష వుండదు.

ఇప్పుడు నేను చెప్పిన విషయాలు మీ పాఠ్యాశంలో లేవు. కానీ ముందుగా ఈ విషయాలు మీరు తెలుసుకోవాలని చెబుతున్నాను" అన్నారు ఎకనామిక్స్ లెక్చరర్.

తను తెలుసుకున్న విషయాలు అమృతకు చెప్పాలనిపించింది. ఆర్చీ ఇంటివైపు వెళ్లాడు దరహాస్.

అక్కడికెళ్ళేసరికి ఎదురొచ్చిన అమృత "గుడికి వెళ్తున్నాను, వస్తావా? " అంది.

ఆమెతోపాటు నడుస్తూ 'ఎప్పుడూ ఈ అమ్మాయి పక్కన నిలబడి కబుర్లు చెప్పాలని ఎందుకు అన్పిస్తూ వుంటుంది? ' అని తనను తాను ప్రశ్నించుకున్నాడు దరహాస్.

★ ★ ★

వికాస్‌ను విజయవాడలోని కాలేజీలో ఇంటర్‌లో చేర్పించాడు విఠల్. హాస్టల్ లోనే వుంచాడు. సైన్స్‌గ్రూపు తీసుకున్నాడు వికాస్. ఫ్యామిలీ షిఫ్ట్ చేద్దామని అనసూయ గొడవ చేస్తున్నా విన్లేదు మొదట్లో.

ఇంటర్ మొదటి సంవత్సరం చివర్లో వికాస్‌కు జ్వరం తగిలింది. పరీక్షలు సరిగ్గా రాయలేకపోయాడు. మార్కులు తక్కువగా వచ్చాయి.

"హాస్టల్లో భోజనం పడటం లేదు. జైల్లో వున్నట్లుంది హాస్టల్‌లో వుంటే! ఇంటికి వచ్చేస్తా!" అన్నాడు వికాస్ తండ్రితో.

తల్లిదండ్రులిద్దరికీ గట్టి పట్టుదల వుంది, వాడిని బాగా చదివించాలని. విజయవాడ ఫ్యామిలీ షిఫ్ట్ చెయ్యక తప్పలేదు.

"మీరెళ్ళిపోతే ఒంటరిగా ఇక్కడ నేనెలా వుండేదిరా? " అడిగాడు బాపయ్య

"నువ్వు కూడా మాతో వచ్చెయ్యి"

"అది జరిగే పనికాదు కానీ మీరు వెళ్లండి! ఒక్కసారి పట్టణాలకు అలవాటు పడితే మళ్లీ ఆర్చీ ఇంటికి తిరిగిరారు"

" ఇదేదో తాజ్‌మహల్‌లా ఫీలవుతున్నావే? పాత బిల్డింగ్‌లో ఎలా ఉంటావ్? పెద్ద తుఫాన్ వస్తే కూలిపోతుంది. మాతో వచ్చేయ్!"

"గాలివానొచ్చినా పడిపోకుండా మరమ్మతులు చేయించి వెళ్ళు!"

"రిపేర్లు చేయించినా చాలా ఖర్చవుతుంది. ఇక్కడ అద్దెలు రావు. ఆ మరమ్మతులకు ఖర్చు పెట్టే డబ్బుతో విజయవాడలో స్థలం కొనుక్కోవచ్చు!"

"మీ తాత ముత్తాతలు ఇలా అనుకుంటే అంతపెద్ద భవనం కట్టేవాళ్ళు కాదు. చుట్టుపక్కల ప్రాంతాల్లో ఎక్కడా ఇటువంటి మండువా లోగిలి ఇల్లు, పెద్ద ఆర్చీ లేదు! అమెరికా వెళ్ళి వచ్చినవాళ్ళు కూడా 'మీ ఇల్లు అద్భుతంగా వుంటుంది. ఎటువంటి పరిస్థితుల్లోనూ ఈ ఇంటిని మార్చేసి ఆధునిక భవనంలా కట్టించకండి!' అంటూ వుంటారు. నాలుగేళ్ళకిందట సినిమావాళ్ళొచ్చి ఇక్కడ షూటింగ్ చేసిన సంగతి మర్చిపోయావా? " అన్నాడు బాపయ్య.

"నీతో వాదనలు ఎందుకుగానీ.. వస్తే మాతో రా! లేకపోతే ఇక్కడే వుండు. నీకు వండి పెట్టడానికి సుగుణ ఇక్కడే వుంటుంది. వారం, పదిరోజులకు ఒకసారి వచ్చి వెళ్తూ వుంటాను"

"మీరందరూ వెళ్ళిపోతే దిగులుగా వుంటుంది. కనీసం అమృతను ఇక్కడుండనీ. పదో తరగతి అయిపోయింది గదా! ఇక్కడే కాలేజీలో చేరి, మాకు తోడుగా

చమత్కారం

ఏడు కళ్లు.. నాలుగు కనుబొమ్మలు

# ఆహా! ఏమి అందం!

ఒక యువతి అందాన్ని వర్ణిస్తూ ఓకవి చమత్కారంగా చెప్పిన పద్యమిది.

**కన్యకు ఐదు జంఘలును కన్యకు నేడు విశాల నేత్రముల్**
**కన్యకు నాల్గు కనుబొమ్మలు కన్యకు నారు కుచద్వయంబులున్**
**కన్యకు ద్వాదశంబరయగా వరమధ్యము గల్గినట్టి యా**
**కన్యకు నీకున్ పదియు గావలె కస్తురి రంగనాయకా!**

కన్యకు ఐదు జంఘలు అంటే ఐదు కాలి పిక్కలట! ఆ కన్యకు ఏడు కళ్లున్నాయట! ఆ ఏడు కళ్లకు నాలుగు కనుబొమ్మలట! అంతేనా! కుచద్వయాలు ఆరు ఉన్నాయట! ఇంకా ఆ కన్య నడుము చూస్తే పన్నెండట! ఎంత సౌందర్యం! ఆహా! ఐదు కాలిపిక్కలు, ఏడు కళ్లు, నాలుగు కనుబొమలు, ఆరు స్తనద్వంద్వాలు, పన్నెండు నడుములు అలాంటి కన్యకు నీకు పదైతే బాగుం టుందని కస్తురి రంగనాయకునితో చెబుతున్నాడు. ఇక్కడ పదాలు అర్థాలు తెలుస్తున్నా ఆ కవి ఏం చెబుతున్నాడో? ఏమిటో? అర్థం కావడం లేదు. అయోమయంగా ఉంది కదూ!

జ్యోతిష్యశాస్త్రాన్ని అన్వయించుకుంటే ఇందులోని చిక్కు వీడిపోతుంది. రాశిచక్రంలో పన్నెండు రాశులున్నాయి కదా! మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం- ఇవీ ఆ పన్నెండు రాశులు. వీటిలో కన్యారాశి ఉంది కదా! అదే కన్య! అంటే కన్య దగ్గర నుంచి పద్యాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించాలి.



కన్యకు ఐదు అంటే కన్య నుంచి ఐదో రాశి- కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం... ఆమె జంఘలు (కాలి పిక్కలు) మొసలి రూపంలో సుందరంగా ఉన్నాయని భావం. అందమైన కాలి పిక్కలను మొసలితో పోలుస్తుంటారు కవులు. అలాగే తక్కినవీ చూద్దాం! కన్యకు ఏడు విశాల నేత్రముల్ - మళ్లీ కన్య నుంచి లెక్కించాలి. ఏడో రాశి మీనం. ఆమె నేత్రాలు చేపల్లా విశాలంగా ఉన్నాయని అర్థం. కన్యకు నాలుగు కనుబొమ్మలు. కన్య నుంచి నాలుగో రాశి ధనుస్సు. ఆమె కనుబొమ్మలు ధనుస్సులా అందంగా ఉన్నాయి. కన్యకు ఆరు కుచద్వయం బులు. కన్య నుంచి ఆరో రాశి కుంభం. అంటే కుంభాల్లా స్తనద్వయం ఉంది. కన్యకు ద్వాదశం బరయగా వరమధ్యము. పన్నెండో రాశి సింహం. అందమైన యువతి నడుమును సింహంతో పోల్చడం కవిసమయం. అంటే ఆమెది సన్నని నడుము అని అర్థం. ఇక 'ఆ కన్యకు నీకునున్ పదియు గావలె' పదో రాశి మిధునం. మీ ఇద్దరూ జంట కావాలి. అంటే పెళ్లి కావాలని ఆ కవిగారి భావం. జ్యోతిష్యశాస్త్ర సంప్రదాయాన్ని అన్వయించే సరికి చిక్కు తొలగిపోయి పద్యంలోని చమత్కారం శోభించింది. హృద్యంగా అలరించింది.

వుంటుంది. అమృతక్కూడా ఆర్బీ ఇంట్లోనే వుండటం ఇష్టం!" అన్నాడు బాపయ్య.

కొడుకు నుంచి ఏం సమాధానం వస్తుం దోనని ఆత్రుతగా చూశాడు.

'ఆడపిల్లదేముంది..! ఎక్కడ చదివినా ఒకటే!' అనుకున్న విఠల్ "సరే! మీ ఇ ష్టం!" అన్నాడు.

వాళ్ళిద్దరి సంభాషణ వింటున్న అమృత సంతోషపడింది, తండ్రి సమాధానం విని. ఆ ఊరొదిలి వెళ్లడం సుతరామూ ఇష్టం లేదా అమ్మాయికి.




**లం**చ్ సమయంలో చెట్టుకింద ఒంట రిగా కూర్చుని తను తెచ్చుకున్న టిఫిన్ బాక్సు మూత తీసి పచ్చడన్నం తినడం మొదలుపెట్టాడు దరహాస్.

పచ్చటి పొలాల మధ్య విశాలమైన ఆవ రణలో వుంది బుచ్చినాయుడు కాలేజీ. గ్రామీణ ప్రాంతంలో వున్న యువతకు ఉపయుక్తంగా వుంటుందని ఎప్పుడో అర వయ్యేళ్ళ కిందటే కట్టించారు ఆ కాలేజీని నిడుబ్రోలులో.

అక్కడికొచ్చింది అమృత. ఆమె కాలే జీలో చేరి అప్పటికి రెండేళ్ళయ్యింది. ఇంటర్ నుంచి డిగ్రీకి వచ్చింది.

దరహాస్ డిగ్రీ ఫైనలియర్‌కు వచ్చాడు.

రెండేళ్ళలో కాలేజీ ఆవరణలో ఏ సమ యంలో అతనెక్కడుంటాడో ఆమెకు తెలుసు. అతను లైబ్రరీ, ప్లేగ్రౌండ్ - ఇలా ఎక్కడుంటే అక్కడికి చేరుకుంటుందామె.

ప్లేగ్రౌండ్ దగ్గరున్న చెట్లనీడలో కూర్చున్న దరహాస్ కన్పించడంతో "నువ్వు బాక్స్‌లో ఏం తెచ్చుకున్నావో అందరికీ తెలి సిపోతుందని దూరంగా వచ్చి చెట్టుకింద కూర్చుని తింటున్నావ్" అందామె తన టిఫిన్‌బాక్స్ ఓపెన్ చేస్తూ.

"మీ అమ్మ, నాన్న, అన్నయ్యలు విజయ వాడలో వుండి సిటీలైఫ్ ఎంజాయ్ చేస్తుంటే నువ్వెందుకు ఇక్కడే వుండిపో యావ్? " అడిగాడతను.

తను తెచ్చుకున్న క్యాబేజీ, పెసరపప్పు ఫ్రై సగంతీసి అతనికి పెట్టింది. అతను ఒద్దంటున్నా విన్లేదు.

"ఈరోజు ఏం ఆలోచిస్తున్నావో? " అడి గిందామె నవ్వుతూ.

"అదేం ప్రశ్న? "

"రోజూ ఏదో టాపిక్ నీ మెదడుపొరల్లో మెదులుతూనే వుంటుంది కదా!"

"ఉదయం మీ తాతగారు కన్పించి 'చదు వుకున్నాక పట్నంలో స్థిరపడతావా? పల్లె లోనే వుంటావా? ' అనడిగా"

చదువుకుని పట్నం వెళ్తేనేగదా ఉద్యో గం వచ్చేది' అనుకున్నాడు తను. ఆయన ఎన్నో విషయాలు చెప్పాడు పల్లెల గురిం చి. పల్లెల గుండెచప్పుడు విన్పించింది. ఆయన మాటల్లో! యువతరమంతా పల్లె లొదిలి పట్టణాలకు తరలి పోతున్నారు. ముసలివాళ్ళను పల్లెల్లోనే వదిలేస్తున్నారు. పట్టణాల్లో గౌరవప్రదంగా బతకొచ్చని, మెరుగైన ఉద్యోగాలు లభిస్తాయనే వెళ్తు న్నారు. వందమంది పట్టణాలకు వలస వెళ్తే ఇరవైమందికే మంచి ఉద్యోగాలు దొరుకుతున్నాయి. చిన్నాచితకా ఉద్యో గాలు చేస్తూ చిన్నచిన్న గదుల్లో వుంటూ పట్టణాలొదిలి రాలేకపోతున్నారు. పల్లె ప్రాంతాల్లో వుండే గవర్నమెంటు స్కూళ్ళు మూతబడుతున్నాయి. పిల్లల్ని ఆటోల్లోనో, వ్యానుల్లోనో కార్పొరేట్ స్కూళ్ళకు పంపు

తున్నారు. వెనుక పల్లెలకు ఆర్.టి.సి. బస్సులు ఎక్కువగా నడిపేవాళ్ళు. ప్రయాణికులు లేరని బస్సులు తగ్గించేస్తున్నారు. ఒకప్పుడు రైతులు ఆహారధాన్యాలే పండించేవాళ్ళు! ఇప్పుడేమో 'ఫార్మింగ్ ఫర్ ఫుడ్' పోయి 'ఫార్మింగ్ ఫర్ క్యాష్' స్థితిలోకి రైతుల్ని నెట్టేస్తున్నారు. ఆహారధాన్యాలు పండిస్తే రైతుకు గిట్టుబాటు ధరరాదు. దేశంలో యాభైశాతం పైగా ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడినా, ప్రభుత్వాలు ఐదుశాతమైనా వాళ్ళకోసం ఖర్చుపెట్టడం లేదు. పట్టణాలకు వెళ్ళి ఆర్థికంగా స్థిరపడినవాళ్ళు పల్లెలవైపు కన్నెత్తి చూడటంలేదు- చెప్పుకుపోయాడాయన.

అవన్నీ అమృతకు చెప్పాడు దరహాస్.

"నువ్వేం చేస్తావో చెప్పు? ! బాగా చదువుకుని పట్నంలో ఉద్యోగం చేస్తావా? "

"లేదు లేదు.. పల్లె ప్రాంతాల్లో పనిచేసే ఉద్యోగమే కోరుకుంటాను"

అమృతకు ఫోన్లో వికాస్ మాటలు గుర్తుకొచ్చాయి.

"మా అన్నయ్య ఫోన్ చేశాడు" అంది.

"ఇక్కడకు వస్తున్నాడా? "

"ఇక్కడకు ఎందుకొస్తాడు? మా నాన్నకు చాలా ప్లాన్స్ వున్నాయి. అన్నయ్య ఇప్పుడు బి.టెక్. చదువుతున్నాడుగదా! ఇంకో రెండు సెమిస్టర్స్ పూర్తయితే హైద్రాబాద్‌లో సివిల్స్ కోచింగ్‌కు పంపుతాడట! తర్వాత ఢిల్లీ పంపించి అక్కడ ఫైనల్ కోచింగ్ ఇప్పిస్తాడట. ఐ.ఎ.యస్. ఆఫీసర్ని చేయాలని నాన్న పట్టుదల" అందామె.

"పట్టుదల వుంటే ఏదైనా సాధించవచ్చు! అబ్దుల్ కలామ్‌గారి 'వింగ్స్ ఆఫ్ ఫైర్' చదివావా? చదవకపోతే ఆ పుస్తకం ఇస్తాను తప్పకుండా చదువు. ప్రతి వ్యక్తికి అంతర్గతంగా ఎన్నో శక్తియుక్తులు వుంటాయి. వాటిని వెలికితీసే ప్రయత్నం చేస్తే అనుకున్నదాన్ని సాధించవచ్చు. డాక్టర్ కలామ్ గారు ఎప్పుడూ అనేవారు- 'అందరూ డివైన్ ఫైర్‌తోనే పుడతారు. మనం చేయవలసిందల్లా ఆ ఫైర్‌కు రెక్కలు ఇవ్వడమే! నిప్పులు చిమ్ముకుంటూ ఎగిరి ప్రపంచమంతా మానవతా వెలుగులతో నింపేయాలి!' అని. రామేశ్వరం మసీదు రోడ్డులో తిరిగేవాడాయన. తెల్లవారకముందే ఇసుకపర్రలో స్టేషన్ రోడ్డువరకూ నడుచుకుంటూ వెళ్ళి న్యూస్‌పేపర్ల కట్ట తెచ్చి అందరి ఇళ్ళలో పంచేవాడు. ఆ తరువాత స్కూలుకెళ్ళేవాడు. సాయంత్రంపూట సోదరుడితో కలిసి గుడి ఎదుటవున్న షాపులో కూర్చుని తన హస్త కళాకృతులు, బొమ్మలు అమ్మేవాడు. తల్లిదండ్రుల దీవెనతో పెద్ద సైంటిస్టు కాగలిగాడు. దేశానికే రాష్ట్రపతి అయ్యాడు" టిఫిన్‌బాక్సులో అన్నం తినడం మర్చిపోయి ఉత్సాహంతో ఆ విషయాలన్నీ చెప్పాడు అమృతకు.

అతనేం మాట్లాడినా వినాలనిపిస్తూ వుంటుందామెకు. పనికిరాని విషయాలు మాట్లాడటం అతనికి అలవాటు లేదు.

"మా అన్నయ్య పెద్దహోదా వున్న ఆఫీసర్ కావాలని కలలు కంటూవుంటాడు. ఆ కలల్ని సాకారం చేసుకోవడానికి కష్టపడడు. కష్టపడని విద్యార్థికి గొప్ప గురువు దొరికినా ప్రయోజనం వుండదు. జీవితంలో అనుకున్నది సాధించాలనే పట్టుదలవున్న విద్యార్థి గురువునుంచి జ్ఞానాన్ని పొందుతాడు" అంది అమృత.

"మీ అన్నయ్య ఫోన్‌చేసి ఏదో అన్నాడని అన్నావ్.. ఏమిటది? " అడిగాడు.

"కాలేజీ ఆవరణలో నీతో కలిసి తిరగకూడదట. స్టేటస్ తక్కువ వున్నవాళ్ళతో తిరిగితే పరువుపోతుందట. డిగ్నిఫైడ్‌గా వుండాలని సెల్‌లో లెక్చర్ దంచాడు" అందామె.

మౌనంగా వుండిపోయాడతను. తన పరిధిలో తనుండటం మంచిది. కాలేజీ క్యాంపస్‌లో గుసగుసలు మొదలయ్యాయన్నమాట! వికాస్ స్నేహితులు ఎవరో అత



నికి అమృత తనతో క్లోజ్‌గా తిరుగు తోందని చెప్పివుంటారు.

అతని మొహంలో కదలాడుతున్న భావాలను గమనించి, "మనం చిన్నప్పటి నుంచీ కలిసిమెలిసి వుంటున్నాం. అన్నయ్య మాటలు పట్టించుకోవాల్సిన అవసరంలేదు. మా అమ్మానాన్నల్లాగే నోటికొచ్చినట్లు మాట్లాడేస్తుంటాడు. మా తాతపోలిక ఒక్కటీ రాలేదు" అంది అమృత, తన బాక్స్‌లోని కర్రీ అతనికి వేస్తూ.

"నీ మీద నిందలు పడటం నాకు ఇష్టం లేదు. మనిద్దరం అందరూ వున్నప్పుడే మాట్లాడుకుందాం. ఓ పక్కన సెపరేట్‌గా కూర్చుని లంచ్ చెయ్యడం మానేద్దాం!"

"బీ బ్రేవ్! చిన్నచిన్న విషయాలను బుర్రలోకి ఎక్కించుకుని మనసును చెదర నివ్వకూడదు. రేపు పెద్ద అధికారివైతే ఎన్నో ప్రాబ్లమ్స్‌ను సాల్వ్ చెయ్యాలి! పిడుగుపడినా చలించకూడదు"

"నన్ను అధికారిగా చూడాలనా?"

"నువ్వు తప్పకుండా ఐ.ఎ.యస్. అధికారి అవుతావు. నాకు విశ్వాసం వుంది" అంది అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ.

అతని హృదయం ఉప్పొంగిపోయింది, ఆమె ప్రోత్సాహంగా మాట్లాడేసరికి.

★ ★ ★



చూసి తన్మయత్వం చెందుతాడు.

చొక్కా తడిసి ఛాతీ దగ్గర చల్లగా తగిలింది. "బంగారుతల్లీ! తాతకు మర్యాద చేశావా!" అన్నాడు బాపయ్య నవ్వుకుంటూ.

అప్పుడే కారుదిగి ఆర్చీ దాటి వరండా మెట్ల దగ్గరికొచ్చిన విఠల్, అనసూయ బాపయ్య చేతుల్లోవున్న పాపను చూశారు.

ముద్దుగా వున్న బుగ్గలు నొక్కి "ఎవరీ పాప? " అడిగింది అనసూయ. బాపయ్య చొక్కా తడిసిపోయి వుండటం కూడా గమనించింది.

"సంపూర్ణావాళ్ళ అమ్మాయి" అన్నాడు బాపయ్య

"సంపూర్ణ పిల్లలకు పెళ్ళిళ్ళు కాలేదు గదా! మళ్ళీ కూతుర్ని కన్నదేమిటి నలభయ్యేళ్ళు దాటేకా? " అడిగింది అనసూయ.

"స్నేహితురాలు చనిపోతే ఆమె కూతుర్ని తీసుకొచ్చి పెంచుకుంటోంది"

"తాను దూరడానికి కంతలేదు, మెడకో డోలు" అందామె.

భార్యకు వత్తాసు పలుకుతున్నట్లు మరో సామెత జోడించాలనిపించి "మింగమెతుకు లేదు మీసాలకు సంపెంగనూనె" అన్నాడు విఠల్.

హరిత బుగ్గలు నొక్కిన చేతిని చీదరగా

ఆర్చీ ఇంటి ముందు అరుగుమీద పాపను వదిలి అమృత వున్న గదిలోకి వెళ్ళింది లాలిత్య.

ఇంట్లోంచి బయటకొచ్చిన బాపయ్య, అరుగుమీద ఆడుకుంటున్న పాపను చూసి ముచ్చటపడి హరితను ఎత్తుకున్నాడు.

ఎర్రటి మందారాన్ని చూసి నవ్వుకుంటున్న పాపను చూసి పులకించిపోయాడు. దేవుడిని చూసినంత సంబరం కలిగింది.

విరిసేపూలలో, పిల్లల నవ్వులో, ఆకుపచ్చని ప్రకృతిలో దేవుడు కన్పిస్తాడు! దేవుడున్నాడని నమ్ముతాడుగానీ దేవాలయాల చుట్టూ తిరిగే అలవాటు బాపయ్యకు లేదు. సూర్యాస్తమయం, సూర్యోదయం

చీరకొంగుతో తుడుచుకుంది అనసూయ.

'వీళ్ళేం మనుషులురా బాబూ! వీళ్ళకు ఆస్తిని ఇచ్చాడు గానీ సంస్కారాన్ని నూరి పోయలేదేమో తను' అనుకున్నాడు బాపయ్య.

'మాది ఆర్చీ ఇల్లు! అందరికంటే మేం ఓ మెట్టు పైన ఉన్నాం! అంటూ అందరికీ చెబుతారు. అలగాజనం పిల్లల్ని ఎత్తుకుని తిరగడం ఏమిటి? ఛీ.. ఛీ.. పరువు తక్కువ పని' గొణుక్కుంటూ ఇంట్లోకి వెళ్ళాడు విఠల్.

ఆ మాటలు విన్పించాయి బాపయ్యకు.

"రాతియుగం మనుషులు.. వీళ్ళు మారరు.. అందుకే మిమ్మల్ని ఇక్కడి నుంచి పట్నం తీసుకువెళ్ళింది" అంది అనసూయ, భర్తతో.

కోడలి మాటలూ చెవిలో దూరేయి.

'ప్రాచీన రాతియుగంలో కులాలు, వెనుకబడిన జాతులు వున్నాయా? ఆ రోజుల్లో అందరిదీ ఒకటే కులం, మతం.. అందరూ కలిసికట్టుగా వుండేవాళ్ళు. వేటకు వెళ్ళి దొరికినది తెచ్చుకుని అందరూ సమానంగా పంచుకుని తినేవాళ్ళు! రోజులు మారేయి. ఈర్ష్యలు, కుళ్ళు కుతంత్రాలు మనుషుల్లో చోటుచేసుకున్నాయి. వెనుకటి రోజుల్లో వ్యక్తి గుణగణాలను బట్టి విలువ ఇచ్చేవాళ్ళు! మరి ఇప్పుడు అక్రమ మార్గాల్లో సంపాదించుకున్నవాళ్ళు కూడా నీతీ నిజాయితీలపై ఉపన్యాసాలు దంచేస్తున్నారు' అనుకున్నాడు పెద్దాయన.

"బాగున్నావా అక్కా? ఇప్పుడేనా రావటం? విజయవాడలో అంతా సౌకర్యంగానే వుందా? " అక్కను పలకరించింది సుగుణ.

"ఒళ్ళంతా చిరాగ్గా వుంది, బాత్‌రూములో వేడినీళ్ళుపెట్టు. స్నానం చెయ్యాలి" అంది అనసూయ చెల్లెలితో.

సుగుణ బాత్‌రూము వైపు వెళ్ళింది.

"మీ చెల్లెలు ఆప్యాయంగా పలకరిస్తే మొహం చిట్లించుకుని మాట్లాడతావెందుకు? విజయవాడలో స్నానం చేసి బయలుదేరాం? మనం వచ్చింది ఏసీ కారులో. గంటన్నర ప్రయాణానికే అలసిపోయావా? " భార్యను అడిగాడు విఠల్.

"మా చెల్లెల్ని చూడగానే మీరు పరవశించిపోయి ప్రయాణ బడలిక మర్చిపోతారు. తినేసేటట్లు ఏమిటా చూపులు? " అందామె గొంతుపెంచి.

బిక్కచచ్చిపోయాడు విఠల్. భార్య మాటలు ఎవరన్నా విన్నారేమోనని అటూ ఇటూ చూశాడు. 'అనుమానపు పిశాచి' మనసులో తిట్టుకున్నాడు. ఆ మాటలకు సమాధానం ఇస్తే మరింత రెచ్చిపోతుంది, నోరు మూసుకోవడం మంచిదని అక్కడి నుంచి కదిలాడు.

★ ★ ★

అక్క విసుక్కున్నా ఎప్పుడూ పట్టించుకోదు సుగుణ.

ఎవరన్నా అక్కను తక్కువచేసి మాట్లాడినా ఊరుకోదు.

అనసూయలోని లోపాలను సహించడం నేర్చుకుంది. తనను ఎన్ని మాటలన్నా పట్టించుకోకుండా అక్కమీద ప్రేమ కురిపిస్తూనే వుంటుందామె.

సుగుణ మీద అనసూయ కోపం పెంచుకోడానిక్కూడా కొన్ని కారణాలున్నాయి.

వేమూరుకు దగ్గర్లో ఉన్న వరహాపురం వాళ్ళది. అమరయ్యకు ఇద్దరూ ఆడపిల్లలే. అనసూయ కంటే ఒక సంవత్సరం చిన్నది సుగుణ. అమరయ్యకు నలభై ఎకరాల మాగాణి వుంది. మోతుబరి రైతు. కూతుళ్ళకి పెళ్ళీడు రావడంతో సంబంధాలు చూడడం మొదలుపెట్టాడు.

రెండు సంబంధాలు వచ్చాయి.

పొన్నూరు నుంచి వచ్చిన బాపయ్యగారిది జమీందారీ వంశం. ఒకప్పుడు చుట్టుపక్కల గ్రామాల్లోని వందలాది ఎకరాలు వాళ్ళవే! ఇప్పుడు పెద్దగా ఆస్తిపాస్తులేమీ

లేవు. పెద్ద ఆర్సీ ఇల్లు, పదెకరాల పొలం మాత్రమే బాపయ్యగారి హయాం వచ్చేసరికి మిగిలింది. వాళ్ళబ్బాయి విఠల్ డిగ్రీ చదివాడు. వ్యాపారాలు వున్నాయి.

ఆ కుటుంబం పేరుప్రతిష్ఠలు విని పెద్ద కూతుర్ని బాపయ్యగారి కొడుక్కు ఇవ్వడానికి ఇష్టపడ్డాడు.

పెళ్ళిచూపులకు బాపయ్యగారి కుటుంబ సభ్యులు, నలుగురైదుగురు బంధువులు వరహాపురం వచ్చారు. అనసూయను అలంకరించి విఠల్ ముందు కూర్చోబెట్టారు. అనసూయ పక్కన కూర్చున్న సుగుణ మీద అతని దృష్టి పడింది. అనసూయ చామనచాయ కాగా సుగుణ పసిడిచాయలో మెరిసిపోతూవుంది.

విఠల్, మనసులో మెదిలిన కోరికను తండ్రికి చెప్పాడు.

"మనం చూడటానికి వచ్చింది పెద్దమ్మాయి అనసూయను. ఆమెని కాదు. చెల్లెల్ని చేసుకుంటామంటే బాగుండదు. ఊళ్ళోవాళ్ళు మనల్ని తప్పుపడతారు" అన్నాడు బాపయ్య.

"ఒకసారి అమరయ్యగారిని అడిగి చూడు నాన్నా! వారు కాదంటే పెద్దమ్మాయినే చేసుకుంటాను" అన్నాడు విఠల్.

కొడుకు మాట కాదనలేక అమరయ్యతో మాట్లాడేడు.

"సాయంత్రం మా చిన్నమ్మాయిని చూడటానికి తెనాలినుంచి వస్తున్నారు. వాళ్ళు మా పెద్దమ్మాయిని చేసుకోడానికి ఇష్టపడితే చిన్నమ్మాయినే కోడలిగా చేసుకోండి. ఇద్దరమ్మాయిల పెళ్ళిళ్ళు శుభప్రదంగా జరిగిపోవడమే నేను కోరుకునేది" అన్నాడు ఆడపిల్లల తండ్రి.

అనసూయ పొన్నూరు సంబంధం తప్పిపోవడం తనమంచికే జరిగిందనుకుంది. 'తెనాలినుంచి వచ్చే అబ్బాయి డాక్టరు, ఆస్తిపరులు. రెండు సినిమాహాళ్లు కూడా వున్నాయి వాళ్ళకి. డాక్టరుగారి భార్య అయితే తన హోదా బాగా వుంటుంద'నుకుంది.

## మే - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **జి.వి. వసుధ**
   - శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా
2. **ఎన్. లీలా ప్రసూనాదేవి**
   - వెస్ట్ వెంకటాపురం, సికింద్రాబాద్
3. **యు.యు.యు.**
   - ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా
4. **కూనపరెడ్డి సత్యనారాయణ**
   - పెనుగొండ, ప.గో. జిల్లా
5. **ఎ. రిశిత**
   - సఫిల్‌గూడ, హైదరాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. సి. రాధాకృష్ణన్ | 6. కుంభ |
| 2. మూసా | 7. పనికుర్రాడిని |
| 3. కూతురి కోసం | 8. ద్వివేదుల విశాలాక్షి |
| 4. కతీజా, ఆయేషా | 9. యశోద |
| 5. సులేమాన్ | 10. మేరీక్యూరీ |

సాయంత్రం ఆనందరావు కుటుంబసభ్యులు వచ్చారు పెళ్ళిచూపులకు. ఆనందరావు మెరిసిపోతూ కన్పించాడు. అందంగా వున్న డాక్టరు తనకు భర్త అవబోతున్నాడని సంబరపడిపోయింది అనసూయ. ఆ ఆనందం రెండు నిముషాలు కూడా నిలవలేదు.

"అదేమిటి? మీ అమ్మాయి చూడచక్కనిది. సినిమాస్టార్‌లా వుంటుందని పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పాడు. మీరు మాకు పంపిం

చిన ఫొటోలో అమ్మాయి కాదు ఈమె.." అన్నాడు డాక్టర్ ఆనందరావు.

అప్పుడే హాల్లోకొచ్చింది సుగుణ కాఫీ కప్పులువున్న ట్రే పట్టుకుని.

"నాకు పంపించిన ఫొటోలో అమ్మాయి ఈ పిల్లే!" అన్నాడతను.

జరిగింది చెప్పాడు అమరయ్య.

"ఈ విషయం మీరు నాకు ముందు చెప్పాల్సింది. రెండో అమ్మాయికి బదులు పెద్దమ్మాయిని ఎరుదుగా కూర్చోబెడితే ఎలా? " కస్సుమన్నాడు డాక్టరు.

"సరే! మీ ఇష్టం మా రెండో అమ్మాయినే చేసుకోండి! జరిగిన పొరపాటుకు నన్ను మన్నించండి!" అన్నాడు అమరయ్య

సుగుణ అందం అతడిని వివశుడ్ని చేసింది. పెళ్ళికి ఒప్పుకున్నాడు.

లోలోపల సుగుణ మీద ద్వేషం పెంచుకుంది అనసూయ. తను డాక్టరుగారి భార్య అయ్యే అవకాశాన్ని చెల్లెలు చెడగొట్టింది. అందగత్తెనని దానికి గర్వం.

పొన్నూరు వెళ్ళి పెద్దమ్మాయి అనసూయను కోడలిగా చేసుకోండని బాపయ్యను బతిమాలేడు అమరయ్య.

"మనం అనుకున్నది పెద్దమ్మాయిని చేసుకోవాలనే! అమరయ్యది మంచి కుటుంబం. మనతో బాగా కలిసిపోతారు. అందానికి అంత ప్రాముఖ్యం ఇవ్వాల్సిన అవసరం లేదు, మనసే మాయని సొగసు. అనసూయను పెళ్ళిచేసుకో!" అన్నాడు బాపయ్య కొడుకుతో.

తను చేసే వ్యాపారాలకు పెట్టుబడి అవసరం. అడిగినంత డబ్బివ్వడానికి కాబోయే మామగారు ఒప్పుకున్నాడు. అనసూయను పెళ్ళిచేసుకోడానికి అంగీకరించాడు విఠల్.

ఇద్దరమ్మాయిల పెళ్ళిళ్ళు వైభవంగా జరిపించాడు అమరయ్య.

అత్తగారిళ్ళకి వెళ్ళారిద్దరూ.

డాక్టర్ని పెళ్ళి చేసుకోలేకపోయాననికొంత అసంతృప్తి వున్నా, భర్త తనమాట జవదాటకపోవడం, ఇంటిపెత్తనమంతా తనచేతిలోకి రావడంతో సంబరపడిపోయింది అనసూయ.

ఇద్దరు పిల్లలు పుట్టారు.

ఆనందంగానే జీవితం సాగిపోతోందనుకుంది. ఆమెకు నచ్చనిది పల్లెటూరి వాతావరణం. అక్కడి నుంచి మకాం మార్చి పట్టణం చేరుకోవాలి! విలాసవంతమైన జీవితం గడపాలి!

అదే ఆమె కోరిక.

ఇంట్లోవాళ్ళంతా తన చెప్పుచేతల్లో వున్నా, అనసూయ మనసులో ఓ అసంతృప్తి చోటుచేసుకుంది. తన భర్త విఠల్ కంటే చెల్లెలి భర్త అందంగా వుంటాడు. పట్నంలో డాక్టరుగా రెండుచేతులా సంపాదిస్తున్నాడు. చెల్లెలు తనకంటే ఎక్కువ సుఖపడుతోంది. ఈ అసంతృప్తికి మూల హేతువు ఈర్ష్య.

సంవత్సరం గడిచేసరికి ఆమె హృదయంలో చోటుచేసుకున్న ఈర్ష్య మటుమాయమైంది.

కారణం సుగుణ భర్తపేరు ఆనందరావు. సంపన్న కుటుంబం. ఒక్కడే కొడుకు. మంచి ప్రాక్టీస్ వున్న డాక్టరు.

తన సంసారం ఆనందంగా సాగిపోతోందని సంబరపడింది.

భర్త ఎంతో ప్రేమగా చూసుకుంటాడు. హాస్పిటల్ రోగులతో కిటకిటలాడుతున్నా ఆదివారం హాస్పిటల్‌కు వెళ్ళడు. ఎమర్జెన్సీ కేసు వచ్చినా మరో డాక్టర్ని హాస్పిటల్‌లో వ్యవహారాలు చూసుకోమంటాడే గాని అతను వెళ్ళడు. ఆ రోజంతా సుగుణతోనే గడుపుతాడు. చుట్టుపక్కల ప్రాంతాలకు షికారుకు వెళ్ళడమో, సినిమాకు వెళ్ళడమో చేస్తుంటాడు.

అత్తమామలు సుగుణను సొంత కూతురిలా అపురూపంగా చూసుకునేవారు.

ఊహించని మలుపు తిరిగింది సుగుణ జీవితం.

ఆనందరావుకు ఏ దురలవాట్లూ లేవు. తాగడు. సిగరెట్టు కూడా ముట్టుకోడు. పోషక విలువలు, విటమిన్స్ వున్న ఆహారమే తీసుకునే అతను ఒకసారి పదిరోజులు తీవ్రమైన జ్వరంతో ఇంట్లోనే వుండిపోయాడు. యాంటీబయాటిక్స్ వాడినా జ్వరం తగ్గలేదు. పొట్టమీదవున్న పుట్టుమచ్చ సైజు పెరగడం, ఆ ప్రాంతంలో రక్తం స్రవించడంతో స్వయంగా డాక్టర్ కనుక, తనకు క్యాన్సర్ సోకిందేమోనని అనుమానం వచ్చింది.

పుట్టుమచ్చ వున్నచోట చిన్న చర్మం ముక్కను పరీక్షకు పంపాడు. లింఫ్‌నోడ్స్‌లో మెలోనోమా వున్నట్లు నిర్ధారించారు.

యమ్ఆర్ఐ స్కాన్‌లో లంగ్ కాన్సర్ అని తేలింది. కీమోథెరపీ మొదలయింది. కృశించిపోయాడు. పట్టుకుంటే మాసిపోయేటట్టు వుండే మనిషి ఎముకలగూడు మీద నల్లటి చర్మం కప్పినట్లుగా కన్పించేడు.

క్యాన్సర్ కణాలు శరీరంలోని ఆరోగ్యకరమైన శరీరభాగాలను ధ్వంసం చేస్తాయి. ఇన్‌ఫెక్షన్స్ వచ్చేస్తాయి. క్యాన్సర్ కంటే ఆ ఇన్‌ఫెక్షన్ల మూలంగానే మనిషి తొందరగా చనిపోతాడు. వేరే రోగికి క్యాన్సరొస్తే అతన్ని ధైర్యపర్చడానికి 'కొత్తకొత్త మందులొస్తున్నాయి.. క్యాన్సర్ బారినుండి బయటపడతావ్.. ధైర్యంగా వుండు!' అని చెప్పేవాడు ఆనందరావు.

ఇప్పుడు తన ఆరోగ్య పరిస్థితి ఏమిటో తనకి తెలుసు.

సుగుణ తన పక్కన కూర్చున్నప్పుడు "వెన్నెల కిరణంలా నా జీవితంలోకి వచ్చావని సంతోషపడ్డాను. సంవత్సరంపాటు పున్నమి రాత్రుల్లాగే గడిపాం. చీకటి ముంచుకొస్తోంది. నెలరోజులకంటే బతకను. సంపాదించినదంతా నీపేరు మీదే రాసేశాను. అమ్మనాన్నల పేరుమీద వున్న ఆస్తి కూడా వాళ్ళ తదనంతరం నీకే చెందేటట్టు చేయమని నాన్నగారికి చెప్పాను. నేను చనిపోయేక మళ్ళీ పెళ్ళి చేసుకో!" అన్నాడు ఆనందరావు.

భర్త మంచి మనసుకు, ఔన్నత్యానికి పొంగిపోయింది సుగుణ.

ఆనందరావు చనిపోయాడు.

అతను బతికివున్నప్పుడు ఎంతో అనురాగంతో చూసుకున్న అత్తమామల్లో పెద్ద మార్పు వచ్చింది. ఆమె అందం ఆమెకి శత్రువవుతుందనుకోలేదు. అందరికళ్ళూ ఆమెమీదే వుండేవి. బెల్లంచుట్టూ మూగే ఈగల్లా పనివున్నా లేకపోయినా ఏదోక మిషతో ఇంటికొచ్చేవాళ్ళు చుట్టుపక్కల మగవాళ్ళు. భర్త లేకపోవడంతో మరింత అలుసయ్యింది.

ఆమెను గదిలోంచి బయటకు రాకుండా కట్టడిచేయడం మొదలుపెట్టారు అత్తమామలు. ఇంటికి వచ్చేవాళ్ళను ఏమీ అనలేక సుగుణను తిట్టేవాళ్ళు. పాలుపోసేవాడితో మాట్లాడకూడదు. కరెంట్ రీడింగ్ తీసుకునే అబ్బాయి వస్తే అతని దరిదాపుల్లో నిలబడకూడదు.

సినిమా పిచ్చి వుండేది సుగుణకు. భర్త వున్నప్పుడు ప్రతి ఆదివారం సినిమాకు వెళ్ళేది. అతను పోయాక బయటకు వెళ్ళనివ్వకపోవడంతో సినిమాహాల్ ఏవైపు వుందో కూడా మర్చిపోయింది. ఇంట్లో టీవీ కేబుల్ కనెక్షన్ తీయించేశారు. చూస్తే దూరదర్శన్ ప్రోగ్రాములు

## కొత్తగాలి...

మా ఊరి వీధిలోకి
నది వచ్చింది
నీరు లేదు
ఇసుకే ఇసుక!

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

చూడాల్సిందే.

అత్తమామల ఆంక్షలకు తట్టుకోలేకపో యింది సుగుణ.

ఓసారి అనసూయ వస్తే ఆమె ముందు తనగోడు వెళ్ళబోసుకుంది.

సుగుణను ఓదార్చి, "ఎలాగోలా కొన్నాళ్ళు సర్దుకుపోవే! బోలెడంత ఆస్తివుం ది. అత్తమామలు పెద్దవాళ్ళైపోయారు. ఏదోకరోజు గుటుక్కుమంటారు. అప్పుడు నువ్వు మహారాణివి. నచ్చినవాడిని పెళ్ళి చేసుకుందువుగాని. ఇప్పుడు ఇంట్లోంచి బయటకు వచ్చేస్తే వాళ్ళపేరు మీద వున్న ఆస్తి నీకు ఇవ్వరు" అంది అనసూయ.

మళ్ళీ పెళ్ళి చేసుకోవాలన్న ఆలోచన ఆమెకి లేదు. చనిపోయిన భర్త ప్రతీక్షణం గుర్తుకొచ్చేవాడు. అతనితో పంచుకున్న జీవితం సంవత్సరమే అయినా ఆ జ్ఞాపకా లతో వందేళ్ళయినా నెట్టుకురావచ్చను కుంది. పున్నమి వెన్నెల వుండేది ఒక్కరో జే అయినా నెలంతా ఆ పున్నమిని తల్చు కుంటూ వుండాలనుకుంది. పెద్దవాళ్ళయిన అత్తమామల్ని వదిలిరావడం మంచిదికా దని తల్లిదండ్రులు కూడా చెప్పారు.

ఓరోజు అత్తమామలు బంధువుల ఇంటికి వెళ్తున్నామని చెప్పారు. "తిరిగొచ్చే సరికి బాగా పొద్దుపోతుందేమో.. తలుపు లేసుకుని పడుకో.. బయటకు రావొద్దు" అని చెప్పి వెళ్ళారు.

సినిమాకు వెళ్ళాలనిపించింది సుగు ణకు. ఇంటికి తాళాలు వేసి మాట్నీకి వెళ్ళింది. అత్తమామలకు తెలిసినవాళ్ళు తన వెనుక సీట్లో వుండటం చూసి గతు క్కుమంది. వాళ్ళెటూ అత్తగారికి చెబు తారు. మరో ఇబ్బంది కూడా ఎదురైంది. ఇంటికి తిరిగొచ్చేసరికి ఇంటి ముందు జనం మూగివున్నారు.

ఇంట్లో దొంగలు పడి బంగారం, నగదు దోచుకుని వెళ్ళారు.

ఆ రోజు నుంచీ అత్తమామల కోపం తారస్థాయికి చేరుకుంది. బయటకు వెళ్ళని వ్వలేదు. వాళ్ళు బయటకు వెళ్ళినా సుగు ణను ఇంట్లో వుంచి తాళాలు వేసుకు వెళ్ళే వారు. అలా నాలుగేళ్ళు నెట్టుకొచ్చింది.

ఇంతలో సుగుణ తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు.

"మీ అత్తమామలు గుటుక్కుమంటారని ఎదురుచూస్తూ వుంటే మన అమ్మానా న్నలు ముందే చనిపోయారేమిటే? " అంది అనసూయ చెల్లెలితో.

బావదగ్గర తన గోడు వెళ్ళబోసుకుంటే సుగుణను తన ఇంటికి తీసుకొచ్చేశాడు విఠల్. తనకు చెప్పకుండా సుగుణను తీసుకొచ్చాడని భర్తను వీలు దొరికినప్పు డల్లా సాధిస్తూనే వుండేది అనసూయ.

★ ★ ★

కాలేజీనుంచి వచ్చీరావడంతోనే బ్యాగ్ ఓ పక్కన పడేసి పిన్ని దగ్గర చేరి ఆమె ఒడిలో తలపెట్టుకుని పడుకుంది అమృత.

"మీ అమ్మానాన్నలు విజయవాడలో వుంటే వాళ్ళదగ్గర వుండక నాదగ్గరెం దుకే? " అంది అమృత నుదుటిమీది వెంట్రుకలు సర్దుతూ సుగుణ .

"చిన్నప్పటినుంచీ నీ దగ్గరే పెరిగాను. అమ్మదగ్గర కంటే నీ దగ్గరే ఎక్కువ చను వు. నువ్వంటేనే పంచప్రాణాలు. నిన్నొదిలి ఉండలేను" అంది పిన్నిని వాటేసుకుని.

"రేపు పెళ్ళయ్యేక మీ అత్తగారింటికి వె ళ్ళాలి కదా? "

"ఈ ఊరి అబ్బాయినే పెళ్ళి చేసుకుం టాను" అంది అమృత.

"మన ఎదురింటివాళ్ళ అబ్బాయి దరహా స్ను పెళ్ళి చేసుకోవే! ఈడూజోడూ బా గుంటారు" అనేసింది సుగుణ మనసులో మెదిలిన ఆలోచనను దాచుకోకుండా.

ఆ మాట అన్నాక నోరు కరుచుకుంది. ఎవరన్నా విన్నారేమోనని అటూఇటూ చూసింది. హాల్లో వాళ్ళిద్దరూ తప్పితే ఎవరూ లేకపోవడంతో స్థిమితపడింది.

"నువ్వు ఉత్త బోళా మనిషివి పిన్నీ! నీ మనసుకు ఏది తోస్తే అది మాట్లాడేస్తావ్! ఈ మాట అమ్మానాన్నలకు తెలిస్తే ప్రళయం సృష్టిస్తారు. దరహాస్ వాళ్ళ కుటుంబాన్ని ఊరి నుంచి తరిమేసే ప్రయత్నం చేస్తారు. నన్ను మరొకరికిచ్చి పెళ్ళి చేస్తారు. నా చదువు మాన్పించేస్తారు. ముందు మా ఇద్దరి చదువులూ పూర్తికావాలి. జీవితంలో స్థిరపడాలి! ఆ తర్వాతే పెళ్ళి ఆలోచన" అంది అమృత.

"దరహాస్ అంటే నాకూ ఇష్టమేనే!" అంది సుగుణ అమృత తల నిమిరి.




**జి**ల్లా పరిషత్ స్కూల్లో హెడ్ మాస్టర్‌గా పనిచేసి రిటైరయ్యారు మూర్తిగారు. ఊళ్ళో అందరికీ ఆయనంటే గౌరవభావం వుంది. ఆయన దగ్గర చదువుకున్నవాళ్ళు డాక్టర్లు, ఇంజనీర్లు అయ్యారు. కొంతమంది అమెరికా, ఆస్ట్రేలియా వెళ్ళారు. వాళ్ళెప్పుడైనా కన్పించి "మా ఉన్నతస్థితికి పునాదులు వేసింది మీరే మాస్టారూ" అంటే పొంగిపోతారు. ఎవరినుంచీ ఏదీ ఆశించరు.

ఇంట్లోంచి బయటకు వెళ్ళబోతుంటే "జేబులో సెల్‌ఫోన్ వేసుకుని వెళ్తున్నారా? " అడిగింది మూర్తిగారి అమ్మాయి.

"ఎందుకమ్మా? "

"ఇంటికి రావడం ఆలస్యమయితే ఎక్కడున్నారో తెలుసుకోవచ్చు గదా మీకు ఫోన్‌చేసి" అంది రేవతి.

సెల్‌ఫోన్ తీసుకోకుండానే వచ్చేశాడు.

ఎన్ని మార్పులొచ్చాయి? !

సెల్‌ఫోన్ లేకుండా బయటకు నడవలేని పరిస్థితి. ఫోన్ జేబులో లేకపోతే ఆదుర్దా పడిపోయే జనం.

తన చిన్నతనంలో ఊళ్ళో కరెంట్ కూడా లేదు. రేడియో అంటే ఏమిటో తెలియదు. పెద్దపెద్ద పోస్టాఫీసుల్లో తప్పితే టెలిఫోన్ ఎవరింట్లోనూ కన్పించేది కాదు.

మరిప్పుడో చేతిలో ఫోన్ లేకుండా రోడ్డుమీద ఎవరూ కన్పించరు. సెల్లో మాట్లాడుతూ ఎవరి ప్రపంచంలో వారుంటారు.

'మన్ను తిన్నావా నాయనా? ఏదీ నోరు తెరవమని' యశోద కృష్ణుడిని అడిగితే నోరు తెరిచాడట! ప్రపంచం కన్పించిందట చిన్ని కృష్ణుడి నోట్లో!

ఇప్పుడరచేతిలో ప్రపంచం ఉంటుంది, సెల్‌ఫోన్ చేతిలో వుంటే! ప్రపంచాన్నంతా వీక్షించేయొచ్చు సద్వినియోగమైతే ఉపయోగమే! కాలేజీలో చదివే కుర్రాళ్ళు గూగుల్ సెర్చ్ చేసి తెలియని విషయాలు తెలుసుకుంటే ఉపయోగం. డిక్షనరీలో తెలియని ఇంగ్లీషు పదాలకు అర్థం వెతుక్కుంటే ఫరవాలేదు.

రెండ్రోజుల క్రితం బస్సులో గుంటూరు వెళ్తున్నప్పుడు జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. బస్సు డోర్ దగ్గర పద్దెనిమిదేళ్ళ కుర్రాడు నిలబడి సెల్‌ఫోన్‌లో స్నేహితుడితో మాట్లాడుతున్నాడు. బస్సు కదిలింది. రన్నింగ్ బస్ ఎక్కాడు ఒకచేతిలో ఫోన్, మరో చేత్తో డోర్ పట్టుకుని ఎక్కే ప్రయత్నం చేస్తూ సర్కస్ ఫీట్ చేస్తున్నట్లే ఎక్కాడు. కిందపడిపోయేవాడే! వాడి అదృష్టం బాగుంది ఆ రోజు.

తన పక్కనే కూర్చున్నాడు.

ఫోన్‌లో మాట్లాడుతూనే వున్నాడు.

"చందూ! మర్చిపోయానురా నీకో ముఖ్యమైన సంగతి చెప్పడం! నీ రూములో

## కొత్తగాలి...

**మొక్కుబడిగా**
**మొక్కలు నాటుతున్నారు**
**వడివడిగా**
**చెట్లను నరుకుతున్నారు**

– అమ్మిన వెంకట అమ్మిరాజు,
పేరూరు, ఖమ్మం జిల్లా

నా సీడీ మర్చిపోయా. దాన్ని మా ఇంట్లో ఇచ్చేయి! ఇల్లెక్కడో తెలియదా? పాతపొన్నూరు ఆంజనేయస్వామి గుడి వెనుక. ఎల్లో కలర్ పెయింట్ వేసి వుంటుంది. ఇంట్లో కుక్క వుందిరోయ్! గేటు తీసుకుని డైరెక్ట్‌గా లోపలికి వెళ్ళకు! కాలింగ్‌బెల్ నొక్కు! ఇంట్లోంచి ఎవరోకరు బయటకొస్తారు.

ఆ కుర్రాడు ఓ పక్కకి తిరిగి కూర్చున్నాడు. అటూ ఇటూ కదులుతూ వున్నాడు. సీటులో ఎక్కువ స్థలం అతనే ఆక్రమించుకోవడంతో ఇబ్బందిగా అన్పించి, "సరిగ్గా కూర్చో బాబూ!" అన్నాడు తను.

"మీకు ఇబ్బంది అన్పిస్తే టాక్సీలో వెళ్ళాల్సింది" అన్నాడు, ఫోన్‌లో మాట్లాడటం కొనసాగిస్తూ.

వాళ్ళ నాన్నకు ఫోన్‌చేసి ఇంటికొచ్చే కుర్రాడి వివరాలు చెప్పేడు. ఆయన విసుక్కున్నాడో? కోప్పడ్డాడో? మళ్ళీ చందూకు ఫోన్ చేసి, "మా నాన్నకు చెప్పకులే! మా అమ్మ గేటుదగ్గరకు వస్తుంది. ఆమెకు ఆ సీడీ ఇచ్చేయి!" అన్నాడు.

బస్సు నారాకోడూరు చేరుకునేదాకా మాట్లాడుతూనే వున్నాడు.

"ఏం సీడీ బాబూ? ఏదన్నా సైన్సు, టెక్నాలజీ సీడీనా?" అడిగాడు తను.

'ముసలోళ్ల పక్కనుంటే ఇదే ఇబ్బంది! ఏదోక నస' అని గొణిగి, "ప్రైవేట్ సాంగ్స్ ఆల్బమ్" అన్నాడా కుర్రాడు.

'అదేదో డిగ్రీ సర్టిఫికెట్టో, ఇంపార్టెంట్ డాక్యుమెంట్సో మర్చిపోయినట్లు అంతసేపు ఫోన్లో మాట్లాడేడు' అనుకున్నాడు తను.

కుర్రాడు నారాకోడూరు దగ్గర నిద్రలోకి జారుకున్నాడు. సెల్‌ఫోన్ జేబులోంచి జారి సీటు వెనుకవైపు పడింది. అదేమీ గమనించకుండా గుంటూరులో బ్రహ్మానందరెడ్డి స్టేడియం దగ్గర దిగబోయాడు.

అతన్ని వెనక్కు పిలిచి సెల్‌ఫోన్ ఇస్తే తీసుకుని హడావుడిగా బస్సు దిగాడు. ఎక్కేటప్పుడూ హడావుడే! దిగేటప్పుడూ అంతే! ప్రయాణంలో ఫోనులో కబుర్లు. చక్కగా బస్సులో అటూఇటూ కన్పించే పచ్చటి పొలాలు, చెట్లు చూడొచ్చు గదా! మనసుకు ఎంత ఆనందంగా ఉంటుంది!

రోడ్డు మీద నడుస్తూంటే స్కూటర్‌మీద వెళ్తున్న యాభైయేళ్ల పెద్దమనిషి మూర్తిగారిని ఢీకొట్టబోయాడు. భుజం, చెవికి మధ్య సెల్‌ఫోన్ పెట్టుకుని తల పక్కకు వాల్చేసి స్కూటర్ నడుపుతూ ఎదురుగా వస్తున్న మూర్తిగారిని చూడ్లేదు.

'సారీ!' అంటూ స్కూటర్ మరోపక్కకు పోనిచ్చాడు.

అతని 'సారీ' ఏమోగానీ కింద పడి వుంటే కాలో, చెయ్యో విరిగేది.

సుబ్బయ్య ఎదురొచ్చి, "మాష్టారూ బాగున్నారా? చాలా రోజులయింది కన్పించి!" పలకరించాడు. రిటైరయినా అందరూ మాష్టారనే పిలుస్తారు.

"అమ్మాయికింకా పెళ్లి సంబంధాలు చూడటం లేదా? ఇరవయ్యేళ్లు దాటినట్లున్నాయి! వెనుక పదకొండు, పన్నెండేళ్ళకే పెళ్లిళ్లు చేసేవారు"

సమాధానం చెప్పబోయారు మాష్టారు. విన్పించుకోకుండానే వెళ్లాడు సుబ్బయ్య.

అవును. ఇద్దరాడపిల్లల పెళ్లిళ్లు చేయాలి! కొడుకు కంటే ఆడపిల్లల్ని అపురూపంగా పెంచాడు. చదువుల తల్లుల్లా తీర్చి

దిద్దాడు. ఓ అమ్మాయి బ్యాంకులో, మరో అమ్మాయి లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. వాళ్లకు నచ్చినవాళ్లు దొరికితే పెళ్లి చేసుకుంటారు. లేదా తన దృష్టికి మంచి సంబంధం వస్తే పెళ్లి చేసేస్తాడు.

అదో పెద్ద సమస్యగా భావించలేదు. అందరి దృష్టిలో అది సమస్యే కావొచ్చు!

తనతో మాట్లాడే వాళ్లందరితో పదేపదే చెప్పేది రెండే రెండు విషయాలు!

ఆడపిల్లల్ని కంటికి రెప్పలా చూడాలి! పచ్చని చెట్లను సంరక్షించుకోవాలి!

దరహాస్ కన్పించాడు మూర్తిగారికి సుబ్బరాయ పిక్చర్ ప్యాలెస్ రోడ్డులో.

"మాష్టారూ మీకో విషయం తెలుసా?" అడిగాడు.

"ఏమిట్రా?"

"మీ అన్నయ్యగారికి ఈ మధ్య ఒంట్లో బాగుండటంలేదు గదా! ఉదయం పడిపోయారట. ఎవరూ గమనించలేదు. పదింటికి పక్కింటాయన వరండాలోకి వెళ్లి చూస్తే కట్టెలా బిగుసుకుపోయి గోడదగ్గర ఒరిగిపోయి కన్పించారట. అప్పటికే ప్రాణాలు పోయాయి. మీ ఇంటికి కబురెళ్లింది. మీరింట్లో లేరు. మిమ్మల్ని వెతుక్కుంటూ మీ వాడు, నేనూ తిరుగుతున్నాం!" అన్నాడు దరహాస్.

గట్టిగా నిట్టూర్పు విడిచి, "రాత్రి వెళ్లి పలకరించాను. బాగానే మాట్లాడేడు. ఎప్పుడూ చావు గురించి మాట్లాడనివాడు తాళాలగుత్తి బియ్యండబ్బాలో ఉంది. తీసుకో! అన్నాడు. 'నాకెందుకు?' అంటే, 'ప్రాణాలు ముందుగా చెప్పిపోవు. నేను పోయేక అన్నీ చూసుకోవాల్సింది నువ్వేగా!' అన్నాడు. ఎప్పుడూ అలా మాట్లాడేవాడు కాదు" అన్నారు మూర్తి.

దరహాస్ భుజంమీద చెయ్యివేసి లక్ష్మయ్య ఇంటివైపు నడుస్తూ అన్నగారి గురించి చెప్పడం మొదలుపెట్టారాయన.

"చిన్నప్పటి అన్నయ్య తరహా వేరు. పొన్నూరు తిరణాలకు తండ్రి ఇద్దరికీ

## 'చతుర'లో రెండో నవల



### అలపర్తి రామకృష్ణ

'జీవనలిపి' 'చతుర'లో నా రెండో నవల. రచనావ్యాసంగం తీరని దాహం లాంటిది నాకు. ఇప్పటివరకూ మొత్తం ఇరవై నవలలు, 300 కథలు వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. కొన్ని కథలకు, నవలలకు బహుమతులు వచ్చాయి.

స్వగ్రామం పొన్నూరు. చిన్నతనంలో ఇంటిముందు పెద్ద ఆర్చీ ఉండేది. గాలివానకు పడిపోయింది. ఆర్చీ ఇల్లు నేపథ్యంతో యువ, ఈనాడు ఆదివారం తదితర పత్రికల్లో కథలు, నవలలు రాశాను. 'జీవనలిపి' నవల మరో అల్లిక.

2014లో పొన్నూరు పురపాలక సంఘం 'స్వర్ణపురి స్వర్ణోత్సవాలు' ఘనంగా నిర్వహించారు. ఆ సభలో ఇతర ప్రముఖులతో పాటు నన్నూ సన్మానించడం అదృష్టం. ఉమ్మడి సచివాలయంలో సుదీర్ఘకాలం పని చేసి సహాయ కార్యదర్శిగా పదవీ విరమణ చేశాను.

జీవితం అర్థవంతంగా, విజయవంతంగా సాగిపోవడానికి చక్కటి 'జీవనలిపి'ని ఏర్పాటు చేసుకోవాలన్నదే ఈ నవల సారాంశం.

**చిరునామా:**
**అలపర్తి రామకృష్ణ**
ఇంటి నెం. ఎస్1-బి-346
సచివాలయ నగర్
వనస్థలిపురం, హైదరాబాద్-70

## కొత్తగాలి...

**విశ్వవిద్యాలయాల్లో వివాదాలు**
**విద్యార్థుల భవితకు ఆటంకాలు**
**జాతిసమగ్రతకు ప్రతిబంధకాలు**
**దేశ సార్వభౌమతకి ప్రమాదాలు!**

– అంబటి వెంకట శివారెడ్డి,
యర్రగుంట్ల, కడప జిల్లా

సమంగా డబ్బులిస్తే, తన డబ్బులు దాచుకునేవాడు. నా పక్కన చేరి నేనేది కొనుక్కున్నా సగం తనకు పెట్టమనేవాడు. పప్పుచెక్క, జీడీలు, ముంతకింద పప్పు-ఏది కొనుక్కున్నా అన్నకు పెట్టాల్సిందే! పై తరగతులకు వెళ్లినప్పుడు నా పాత పుస్తకాలను కింది తరగతుల పిల్లలకు ఉచితంగా ఇచ్చేవాడిని. అన్న మాత్రం తన పుస్తకాలను రూపాయో, రెండో తీసుకోకుండా ఇచ్చేవాడు కాదు.

రైతుల దగ్గర ధాన్యం కొని, మిల్లు యజమానులకు అమ్మేవాడు. బాగానే సంపాదించాడు. రూపాయి ఖర్చుపెట్టడం ఇష్టం ఉండేది కాదు. పెళ్లి అయ్యేక కూడా అదే తరహా! కూరగాయలు కొనేవాడు కాదు. ఎప్పుడూ పచ్చళ్లే! ఆ పచ్చళ్లు కూడా ఇంట్లో పట్టినవి కాదు. మా వదినగారు పుట్టింటి నుంచి తేవాల్సిందే!

ఇంట్లో ఇనుపబీరువాకే కాదు, అన్ని గదులకు.. ఆఖరికి బియ్యండబ్బాక్కూడా తాళం వేసేవాడు. భర్త పక్కనున్నప్పుడే డబ్బాలోని బియ్యం తీసుకోవాలి మా వదిన. రైతులు కూరగాయలు పండించేవాళ్లు. అక్కడికెళ్లి కూరగాయలు తెచ్చుకొనేవాడు. "ఇదిగో! ఈ పూటకి ఈ రెండు వంకాయలు పులుసులో వెయ్యి! బీరకాయలు మూడ్రోజులు రావాలి! నూనె వృథా చెయ్యకు!" అంటూ వదినకు చెప్పేవాడు. 'చాదస్తపు మొగుడు చెబితే వినడు, తనకు తోచదు!' అంటూ ఉండేది అన్నయ్య ఎదురుగా ఉన్నప్పుడే. వదిన మాటలేం పట్టించుకునేవాడు కాదు" లక్ష్మయ్య ఇంటి దగ్గరకు చేరుకున్నారు వాళ్లిద్దరూ.

లక్ష్మయ్య ఇంటిదగ్గర నలుగురు తప్పితే ఎవరూ లేరు. వాళ్లు కూడా గోత్రీకులు. తప్పదన్నట్లు వచ్చారు.

ఆయన భార్య చనిపోయి పదేళ్లవుతోంది. పిల్లలు లేరు. భార్య తరపువాళ్లని గానీ, మూర్తి మాష్టారు పిల్లల్ని గానీ ఎవరినీ దగ్గరకు తీయలేదు. వంద రూపాయల పని చేయించుకుని పది రూపాయలు చేతిలో పెట్టేవాడవడంతో ఆయన దగ్గర పనిచేసినవాళ్లు కూడా శవాన్ని చూసి అక్కడి నుంచి జారుకుంటున్నారు.

"తెల్లవారుజామున ఐదింటికే నిద్రలేస్తాడు. ఇంటిచుట్టూ తిరుగుతూ ఉంటాడు. ఆరింటికి కాఫీ పెట్టుకుని తాగేసి మా ఇంటి అరుగుల మీద చేరి పేపరు చదువుతాడు. మేం పేపరు తెప్పించుకునేది ఆయన కోసమే అన్నట్లుగా ఉండేది. ముందు ఆయనే పేపరు చదవాలి! అది కూడా అక్షరం వదిలిపెట్టకుండా చదివేస్తాడు. 'అమ్మాయి కాఫీ ఏమన్నా పెట్టావా?' అంటూ మా ఆవిడను అడుగుతాడు. ఆయనకు ఏ అలవాటూ లేదు గానీ, కాఫీ మాత్రం ఏడు కప్పులు తాగాల్సిందే! ఒక్క కప్పే ఇంట్లో ఉదయంపూట తాగేది. మిగతా ఆరు కప్పులు ఊర్లోవాళ్లు ఇప్పించాల్సిందే! ఈరోజు ఉదయం పేపరు చదవడానికి రాలేదు. వెళ్లి చూస్తే వరండాలో కూలబడిపోయి ఉన్నాడు. తాగిన కాఫీ గ్లాసు పక్కనే ఉంది" చెప్పుకుపోయాడు మూర్తిగారికి.

లక్ష్మయ్య జేబులో తాళాల గుత్తి ఉంది. తీసి మూర్తిగారికిచ్చాడు పక్కింటాయన.

బాగా వాడటంవల్ల అరిగిపోయి నున్నగా మెరుస్తున్నాయి ఇనుప తాళం

చెవులు. వాటి మధ్యలో ఒకటో రెండో ఇత్తడి తాళంచెవులున్నాయి.

అన్న శవం ఇంటి ముందు ఉండగా గదులు, ఇనప్పెట్టె వెతకడం మంచిది కాద నుకున్నారు మూర్తి. తన డబ్బుతోనే అంత్యక్రియలు జరిపించాడు. తన కొడుకు చేతే లక్ష్మయ్యకు తలకొరివి పెట్టించారు.

మరుసటిరోజు దరహాస్‌ను వెంటబెట్టు కుని లక్ష్మయ్య ఇంటికొచ్చారు. ఇంట్లో గదులన్నీ పరీక్షగా చూడటం అప్పుడే. అంతకుముందు ఎప్పుడొచ్చినా హాల్లోనే అన్నతో మాట్లాడి వెళ్లిపోయేవారు.

గదుల్లో పాత సామాను తప్పితే పనికొ చ్చేవి ఏమీలేవు. పనివాళ్లను పట్టుకుపొమ్మ న్నారు.

ఇనప్పెట్టె తీసి చూశాడు. నోట్ల కట్టలు కన్పించేయి. అవన్నీ దరహాస్ చేత లెక్క పెట్టించారు. ఇల్లు, పొలానికి సంబంధిం చిన దస్తావేజు కాగితాలున్నాయి.

పై అరలో కన్పించిన కాగితం మడత విప్పి మాష్టారు, దరహాస్‌కు వినబడేట ట్లుగా మూర్తి చదివారు.

"ప్రియమైన తమ్ముడు మూర్తికి!

ఏదోకరోజు ఈ ఇనప్పెట్టె నువ్వే తెరు స్తావని తెలుసు. నా ఆస్తికి వారసుడివి నువ్వేగా! నిజానికి బతికున్న రోజుల్లోనే పొలం, ఇల్లు, ఇనప్పెట్టెలో ఉన్న డబ్బు, అన్నీ నీకప్పగించాలి. కానీ అలా చెయ్యడా నికి మనసొప్పుకోలేదు. నావి అనుకున్నవి ఎవరికీ.. చివరకు సొంత తమ్ముడికి కూడా ఇవ్వడానికి సుతరామూ ఇష్టంలేదు. వాటన్నిట్నీ వెంటబెట్టుకుని వెళ్లే వీలులేదు. చనిపోయేక.. వీలుంటే నాతోపాటే తీసుకు వెళ్లేవాడిని! ఎవరిమీదా మమతానురాగాలు పెంచుకోలేదు.

ఆఖరికి నా మీద కూడా నాకు ప్రేమ లేదు. కారణం తెలుసా? !

నువ్వు ఎర్రగా బొద్దుగా ఉండేవాడివి. నేనేమో నల్లగా, ఎత్తుపళ్లతో అందవిహీ నంగా కన్పించేవాడిని. అందరూ నిన్ను ముద్దు చేసేవాళ్లు. ఎత్తుకుని తిప్పేవాళ్లు! చిన్నతనంలో నా ఒంటినిండా పుళ్లు ఉండేవి. చీదరించుకునేవాళ్లు! చదువులో కూడా నువ్వే మెరుగు. గంతకు తగ్గ బొంతన్నట్లు నాకు తగ్గ అమ్మాయిని పె ళ్లాంగా చేశాడు నాన్న! నీకు ముగ్గురు పిల్లలు పుడితే నాకు పిల్లల్లేరు. నీ పిల్లల్లో ఎవరోకరిని దత్తత తీసుకుని పెంచుకొ మ్మని చెప్పేవాళ్లు ఊళ్లోవాళ్లు. ఇతరుల సలహాలు పాటించడం నాకిష్టం లేదు. నా ఆలోచనలు నీతో పంచుకునేవాడ్ని కాదు.

భార్య చనిపోయాక వండుకోవడం.. తినడం.. స్వయంపాకపు మనిషిని!. మీ ఇంటికొచ్చి ఉండమని ఎన్నోసార్లు చెప్పా వు. కనీసం భోజనం చేసి వెళ్లు! చేతులు కాల్చుకోవద్దు అనేవాడివి. నా దారి నాది. అందరికీ అది ముళ్లదారిలా కన్పించేది..

ఇప్పుడు నా నాటకం చివరి అంకానికి వచ్చేసింది. అందుకే ఈ తుది పలుకులు.

ఇట్లు

లక్ష్మయ్య"

సోదరుడు రాసిన ఉత్తరం చదివి కాగితం జేబులో పెట్టుకున్నారు మూర్తి.

"మా అన్న డబ్బు నేను ఖర్చు పెట్టు కున్నా, ఆస్తి నేను అనుభవించినా మా అన్న వైతరణి నదిని దాటలేడు. ఈ ఇంట్లో అనాథాశ్రమం పెడతాను. పొలం మీద వచ్చే కౌలుడబ్బు, ఇనప్పెట్టెలో ఉన్న డబ్బు కూడా అనాథాశ్రమం నిర్వహణకు ఉపయోగిస్తాను. కనీసం ఈ పుణ్యకార్యం తోనైనా మా అన్నకు సద్గతి లభిస్తుంది" అన్నారు మూర్తి మాష్టారు.

మాష్టారి నిర్ణయం దరహాస్‌ను అబ్బుర పర్చింది. 'మాష్టారు అన్నీ పోగొట్టుకోడాని కైనా సిద్ధపడతారు గానీ, మంచితనం, మానవత్వాలను మాత్రం వదులుకోరు' అన్పించింది దరహాస్‌కు.

★ ★ ★

కుప్పుస్వామి తైలవర్ణచిత్రం దగ్గర నిలబడ్డాడు బాపయ్య.

అక్కడ నిలబడితే ఎంతో బాగుంటుంది. గుండెధైర్యం ఎక్కువవుతుంది.

చేతిలో పొన్నుకర్ర పట్టుకుని విలాసంగా నవ్వుతున్నట్లు కన్పించాడు. ఆ తైలవర్ణచిత్రానికి రెండువైపులా పెద్దపెద్ద లాంతర్లు గోడకు అమర్చివున్నాయి. వాటికి రంగురంగుల గ్లాసులు అమర్చివున్నాయి. ఆ లాంతర్లు కలకత్తాలో కొన్నవి.

అమృత అటువైపు రాగా, "కుప్పుస్వామి గారి చేతిలో పొన్నుకర్ర చూశావా ఎప్పుడన్నా? " అనడిగాడు మనవరాలిని.

"నేనెలా చూస్తాను? అప్పటికి నేను పుట్టలేదు గదా!"

"చూపిస్తా.. రా!" అని దేవుడిగదిలోకి తీసికెళ్ళాడు. ఆ గదిలో ఓ పక్కన పాత భోషాణం వుంది. లోపల కూర్చుంటే పది మంది పడతారు. భోషాణంచుట్టూ ఇత్తడి రేకులతో గట్టి బిగింపువుంది. ఇద్దరూ కలిసి భోషాణం మూత తీశారు. లోపల రాగిపాత్రలు, ఇత్తడి సామాను వున్నాయి.

"ఇవన్నీ ఇప్పుడు వాడటం లేదుగా! అమ్మేయొచ్చుగదా!" అంది అమృత.

"ఈ వస్తువులిప్పుడు మార్కెట్లో కావాలన్నా దొరకవు. ముందుతరంవాళ్ళకి పూర్వం ఈ వస్తువులు వాడేవాళ్ళని చెప్పొచ్చు! మన ఇల్లే చిన్న మ్యూజియం లాంటిది"

చెక్కతో చేసిన చెప్పులు చూసి "వెనుకటి రోజుల్లో చెక్క చెప్పులు వాడేవారా? " అనడిగింది.

"వీటిని 'పావుకోళ్ళు' అంటారు. పెళ్ళిలో పెళ్ళికొడుకు పావుకోళ్లమీద మెల్లగా నడుస్తూ పెళ్ళిమండపం దగ్గరికెళ్తాడు" అని పావుకోళ్ళ గురించి చెప్పాడు.

గంధపుచెక్కతో చేసిన వ్యాసపీఠం చూపించి "మా తాత ఈ వ్యాసపీఠం మీద మహాభారత గ్రంథం వుంచి ఊళ్ళోవాళ్ళకు పద్యాలు రాగయుక్తంగా చదువుతూ, అందరికీ అర్థమయ్యేట్లు తాత్పర్యం చెప్పేవాడు. . ఆ రోజుల్లో వేరే ఊరికి వెళ్ళాలంటే మా తాతముత్తాతలు పల్లకీలో తిరిగేవాళ్ళు.. ఆడవాళ్ళు మేనాల్లో వెళ్ళేవాళ్ళు. పల్లకీలు, మేనాలు మోసే బోయీలు 'ఓ హోమ్.. ఓ హోమ్..!' అంటూ వెళ్ళేవాళ్ళు! ఇదంతా బస్సులు, కార్లు లేని రోజులనాటి ముచ్చట" అంటూ చెప్పాడు.

అడుగునున్న పొడుగాటి చెక్కపెట్టె లోంచి పొన్నుకర్ర బయటకు తీశాడు.

కర్రచుట్టూ వెండిరేకులతో తాపడం, కర్ర చివర్లో బంగారపు పొన్ను చూపి, "ఈ పొన్నుకర్ర కుప్పుస్వామిగారికి మద్రాసు గవర్నరు బహుమతిగా ఇచ్చారు. మా ముత్తాత జిల్లాబోర్డు అధ్యక్షుడిగా కూడా పనిచేశారు. ఆ సమయంలో ఎన్నో పాఠశాలలు కట్టించాడు. పాడుబడుతున్న దేవాలయాలను బాగుచేయించి నిత్య దీపారాధన, అర్చన ఏర్పాట్లు చేశాడు. గవర్నమెంటు డబ్బుతో కాదు, సొంత డబ్బుతో అవన్నీ చేశాడు. అందుకే బ్రిటిష్ అధికార్లు కుప్పుస్వామిగారిని మెచ్చుకునేవాళ్ళు! అలాగని బ్రిటిష్ ప్రభుత్వాన్ని పొగిడేవాడు కాదు. కలకత్తా నుంచి మద్రాసు వెళ్ళే రైలుమార్గం ఆ రోజుల్లో వేసింది. నిడుబ్రోలు రైల్వేస్టేషను, చింతలపూడి రోడ్డులో వున్న ఆసుపత్రి తెల్లవాళ్ళకాలం నాటివే! 'ఎన్నాళ్ళీ దొరల పాలన? ' అనేవాడు. దేశభక్తి వున్న వాళ్ళు ఊళ్ళో మీటింగు పెట్టారు. ఆ మీటింగు ఖర్చు ముత్తాతే పెట్టుకున్నాడు. ప్రముఖులకు ఆర్చీ ఇంట్లో భోజనం ఏర్పాటుచేశాడు. అది తెలుసుకుని ఊళ్ళోవున్న తెల్లవాళ్ళు మద్రాసు గవర్నరుకు, జిల్లా కలెక్టరుకు ఫిర్యాదు చేశారు. వారం రోజులు పోలీస్‌స్టేషన్లో వుంచారు. మద్రాసు గవర్నరు కుప్పుస్వామిగారి జోలికి పోవద్దని పోలీసు అధికారులకు చెప్పడంతో వదిలేశారు. బ్రిటీష్‌వాళ్ళు,

నిజాంప్రభువులు హాస్పిటల్ కట్టించారని, చెరువు తవ్వించారని వారిని పొగడం కదా! మొత్తంగా వాళ్ళపాలనే! ప్రజల్ని దోచుకునే నిరంకుశపాలన!" ఆర్చీ ఇంటి గత ప్రాభవం గురించి చెప్పాడు బాపయ్య మనవరాలికి.

ఐదునిముషాలాగి ఆసక్తికరమైన ప్రేమ కథ కూడా చెప్పాడు.

"ఇవన్నీ మీ నాన్నకు చెప్పాను. ఆ చెవితో విని ఈ చెవితో వదిలేశాడు. డబ్బు విషయం తప్పితే పాతవిషయాలేవీ మీ నాన్న గుర్తుంచుకోడు! నీకెందుకు చెబుతున్నానంటే నువ్వీ విషయాలు ఓ పుస్తకంలోనో, కంప్యూటర్‌లోనో నిక్షిప్తం చేయాలి. ముందు తరాలవారికి ఈ పాత కబుర్లు తెలియాలి. మరో విషయం.. మా ముత్తాతగారి ప్రేమకథ కూడా చెబుతాను. మా తాత మా నాన్నకు, మా నాన్న నాకూ చెప్పాడు. నేన్నీకు చెబుతున్నాను.. కుప్పుస్వామిగారు నాగపూరులో వ్యాపారం చేశారని అక్కడే బాగా సంపాదించాడని చెప్పాను గదా! బట్టలు, ఆహారపదార్థాలు, యుద్ధసామగ్రి మొదలైనవాటిని సైనిక శిబిరాలకు చేర్చేవాడు.

నాగపూరులో ఓ అధికారి కూతురు పరిచమయింది. లెక్కకు మించిన సంపద, పెద్దపెద్దవాళ్ళతో పరిచయాలున్న కుప్పుస్వామిగారిని ఓ అమ్మాయి ప్రేమించడంలో ఆశ్చర్యమేంలేదు. పైగా వయసులో వున్నాడు. మనిషిది రాచపుటక! ఎర్రగా బుర్రగా ఠీవిగా వుండేవాడట. అలా ఒంటరిగావున్న ఆయనకి మాధురి దగ్గరయింది. వాళ్ళది రాజస్థాన్. నాగపూర్‌లోనే స్థిరపడిన మాధురీవాళ్ళది ఉమ్మడి కుటుంబం. పెద్ద భవంతిలో వుండేవారు. ఆమెను పెళ్ళి చేసుకోవాలన్న ఆలోచన మనసులో మెదిలింది. ఆమె ఎటువంటి అభ్యంతరం చెప్పక, తల్లిదండ్రులను సంప్రదించమంది. అడగ్గా వాళ్ళూ పెళ్ళికొప్పుకున్నారు. 'ప్రపంచంలో తనంత అదృష్టవంతుడు మరొకడు లేడు' అనుకున్నాడు.

"పొన్నూరులో మా తల్లిదండ్రులున్నారు. వాళ్ళను పిలిపిస్తాను తాంబూలాలు ఇచ్చిపుచ్చుకోడానికి" అన్నాడు కుప్పుస్వామి.

"నువ్వు మాలాగే వ్యాపారస్తుడివి కాబట్టి నచ్చావ్! పెళ్ళయ్యేక నువ్వు, నీ భార్య మాతోనే వుండాలి! అమ్మాయిని వదిలి వుండలేం!" అన్నాడు మాధురి తండ్రి.

అదేలా కుదురుతుంది? అయినవాళ్ళంతా పొన్నూరులో, బంధువులంతా చుట్టుపక్కల గ్రామాల్లో వున్నారు. వాళ్ళందర్నీ వదిలి నాగపూర్‌లో ఎలా వుంటాడు తను! పొన్నూరు తిరిగొచ్చేశాడు. అయితే ఆలోచనలన్నీ ఆమె చుట్టూనే తిరుగుతున్నాయి. మాధురికి తనుండే పెద్ద భవంతి అంటే ఇష్టం. ఇంటిముందు పూలతోట, ఇంటిచుట్టూ పెద్ద ప్రహరీగోడ.. లోపలికొచ్చే ప్రధానద్వారం దగ్గర పెద్ద ఆర్చీ. ఆర్చీ మీద మురళి వాయించే కృష్ణుడు.. ఇవన్నీ ఎంతో ఇష్టమని చెబుతుండేది.

వాళ్ళ ఆర్చీ ఇంటిలాగే తనూ పెద్ద భవంతి కట్టిస్తే! ఇంటి ముందు తోట, ఆ పరిసరాలు ఏర్పాటుచేస్తే మాధురి సంతోషపడుతుంది. ఇల్లు కట్టడం పూర్తయ్యేక మాధురిని తీసుకొచ్చి ఇల్లు చూపిస్తే ఆనందపడిపోదూ! తనతోపాటే వుండిపోతుంది.! ఇల్లు కట్టించడానికి డబ్బుకేం ఇబ్బందిలేదు.

పాత పెంకుటిల్లు పడగొట్టించేశాడు. నాగపూర్‌నుంచి తాపీ మేస్త్రీలను పిలిచి మాధురీవాళ్ళ ఆర్చీ ఇంటిలాగే తీర్చిదిద్దాలని చెప్పాడు. సంవత్సరం తిరిగేసరికి ఆర్చీ ఇల్లు ఎంతో సుందరంగా తయారయింది. కుప్పుస్వామి మాధురిని తీసుకురావడానికి ప్రయాణయ్యాడు.

"మేమెప్పుడూ ఆ ప్రాంతాలు చూడలేదు. మమ్మల్ని కూడా తీసుకెళ్ళరా! నీకు తోడుగా వస్తాం!" అన్నాడు మేనమామ.

అక్షరం

పశువును మానవుడిగా
మానవుణ్ణి మాధవుడిగా
మార్చేదే నిజమైన మతం

– స్వామి వివేకానంద



ఆయనతోపాటు ఆయన కూతురు అన్నపూర్ణ కూడా బయల్దేరింది. తీరా నాగపూర్ వెళ్ళేసరికి అంతా తల్లకిందులయింది"

రెండు క్షణాలాగాడు చెప్పడం ఆపి.

"ఏమయింది? మాధురి చనిపోయిందా? " ఆతృతగా అడిగింది.

"అదేంకాదు. మాధురి తీరిక లేకుండా వుంది. మరొకరి ప్రేమలో పడింది. పెళ్ళి ఏర్పాట్లు కూడా జరిగిపోతున్నాయి"

"ఆర్చి ఇంటి ఫొటోలు చూపించలేదా? ఆమె మనసు మార్చే ప్రయత్నం చేయలేదా? " అడిగింది అమృత తాతగారిని.

"అప్పట్లో ఫొటోలు ఎక్కడున్నాయి? కుప్పుస్వామిగారి ఆత్మాభిమానం దెబ్బతింది. తనకు చెప్పకుండా ఆమె మరొకరితో పెళ్ళికి సిద్ధపడటం కోపం తెప్పించింది. తను మళ్ళీ నాగపూర్ వచ్చింది, ఆమెను ప్రాధేయపడటానికి కాదని చెప్పాలనుకున్నాడు.

"మేనత్త కూతుర్ని మాధురికి చూపించి 'ఈమె పేరు అన్నపూర్ణ! నా మనసుకు నచ్చిన పిల్ల.. నా మనసును దోచుకుంది. అన్నపూర్ణను పెళ్ళి చేసుకోబోతున్నాను! నీకు చూపించాలనే ఈ అమ్మాయిని ఇంత దూరం తీసుకొచ్చాను" అన్నాడు కుప్పుస్వామి గుండె దిటవు చేసుకుని.

రైల్లో నాగపూర్ నుంచి తిరిగొచ్చేటప్పుడు తన పక్కన కూర్చున్న అన్నపూర్ణ మంచులో తడిసిన ముద్దమందారంలా కన్పించింది.

"నేనంటే నీకిష్టమేనా? " అనడిగాడు కుప్పుస్వామి.

మల్లెపూలు వెదజల్లినట్లు నవ్విందామె.

తన కూతురికి ఆర్చీ ఇంట్లో వుండే అదృష్టం దక్కినందుకు పొంగిపోయింది అన్నపూర్ణ తల్లి. వెంటనే ముహూర్తం పెట్టించేసి అన్నపూర్ణను పెళ్ళి చేసుకున్నాడు.. అదీ మా ముత్తాతగారి ప్రేమ కథ!"

బాపయ్య చెప్పాక "అంతా చూసినట్లుగా ఎప్పుడో జరిగిన కథ ఎలా చెప్పగలిగావ్ తాతా? " అడిగింది మనవరాలు.

"నా చిన్నప్పుడు మా అమ్మమ్మ ఏడుగురు రాజకుమార్తెల కథ ఏడురోజులు చేప్పేది! ఆ రాజకుమార్తెలు ఉద్యానవనంలో విహరిస్తూ వుంటారు. సేనాధిపతి తాను రాజు కావాలన్న దుర్బుద్ధితో రాజకుమార్తెలను బంధించి అడవిలో పాడుబడిన దేవాలయంలో వుంచడం.. కిరాతకులు రాజకుమార్తెలను తీసుకువెళ్ళి కాళికాదేవికి బలివ్వాలనుకోవడం, మాంత్రికుడు వాళ్ళను మాయచేసి తన గుహలో బంధించడం.. తనను పెళ్ళిచేసుకోమని ఒత్తిడి తీసుకురావడం, ఒక ముని వచ్చి రాజకుమార్తెలను రక్షించడం, మాంత్రికుడు మునిని రాయిగా మార్చెయ్యడం చివరికో రాజకుమారుడు మాంత్రికుడ్ని చంపేసి రాజకుమార్తెలను రాజుగారికి అప్పగించడం, కుట్రచేసిన సేనాధిపతి తల తీసేయడం.. రాజకుమార్తెలను రక్షించిన మరోదేశానికి చెందిన రాజకుమారుడే పెళ్ళి చేసుకోవడం - అలా సాగిపోయేది కథ. మధ్యలో పిట్టకథలూ చేప్పేది! అమ్మమ్మ చెప్పిన కథలు వినీవినీ నాక్కూడా ఏ విష

యాన్నయినా కథలా చెప్పడం అలవాట యింది!" అన్నాడు బాపయ్య.

★ ★ ★

పి.బి.యన్. కాలేజీలో డిగ్రీ తర్వాత గుంటూరులో పి.జి. చదివాడు దరహాస్. హాస్టల్‌లో ఉంటే ఖర్చు ఎక్కువ అవుతుం దని రోజూ బస్సులో పొన్నూరు నుంచి గుంటూరెళ్లేవాడు. పి.జి.లో ఇంగ్లీషు లిట రేచర్ చదివాడు.

ఆంగ్లసాహిత్యంలోని వివిధ వాదాలు, విశ్లేషణలు చదివాక అతనికి సమన్వయ దృష్టి ఏర్పడింది. సౌందర్య దృష్టి, రసభా వనలు హృదయంలో చోటుచేసుకున్నాయి. థామస్ హార్డీ 'డెన్' చదివాడు. ఆ నవల లోని సంఘటనలన్నీ వాస్తవికతను తల పించాయి. ప్రకృతి ఆరాధన, గత స్మృ తుల చింతన, ఊహాత్మకత అంశాలున్న నవలలు నచ్చేవతనికి.

డి.హెచ్.లారెన్స్ రచనల్లో మార్మిక వాదం, స్వీయ వ్యక్తిగత తత్త్వం కన్పిం చేవి. సిగ్మండ్ ఫ్రాయిడ్ మనో విశ్లేషణా త్మక రచనలు నచ్చేవి. ఫ్రెంచి తత్త్వవేత్త సార్త్రే రచనలూ చదివాడు. ఆల్బర్టో మొరా లియో రచనలు జీవితంలో మరో కోణాన్ని చూపించాయి. మనిషికి ప్రేమ, సెక్స్ రెండూ అవసరమే! ప్రేమ లేని సెక్స్, సెక్స్ లేకుండా ఉండే ప్రేమలో జీవం ఉండదు. కొన్ని కథలను తెలుగులో కూడా అనువాదం చేశాడు దరహాస్.

సామాజిక రుగ్మతలను ఖండిస్తూ, మానవ సంబంధాలను అత్యద్భుతంగా చిత్రించిన టాల్‌స్టాయ్ రచనలు దరహా స్‌ను ఆకట్టుకున్నాయి. సోమర్‌సెట్ మామ్ రాసిన 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' నవల బాగా నచ్చింది. ఎన్నోసార్లు ఆ నవ లను చదివాడు. కీట్స్, వర్డ్స్‌వర్త్ పొయెట్రీ కూడా బాగా నచ్చేవి.

"పి.జి. అయిపోయింది కదా! ఏం చేద్దా మనుకుంటున్నావ్?" అడిగింది అమృత.

అతనికో ధ్యేయం ఉంది. మనసులోని కోరిక బయటకు చెబితే అమృత నవ్వుతుం దేమోనని బిడియం కూడా ఉంది.

"సివిల్స్ రాద్దామనుకుంటున్నాను" అన్నాడు మెల్లగా.

"సివిల్స్ రాద్దామనుకున్నవాడికి బెరుకు ఉండకూడదు. స్పష్టత ఉండాలి! ఆశావహ దృక్పథం ఉండాలి! అనుకున్నది సాధించ గలననే కాన్ఫిడెన్స్ ఉండాలి!" అందామె.

'నీకెందుకు సివిల్స్? ఏదోక గుమస్తా ఉద్యోగం చూసుకోక!' అంటుందేమో అను కున్నాడు. కానీ తనలో ఎక్కడో ఉన్న పిరి కితనాన్ని పోగొట్టడానికి ఆమె ధైర్యం నూరిపోస్తున్నట్లు అన్పించింది.

"సాధించగలననే నమ్మకం ఉంది" అన్నాడతను.

"గో ఎహెడ్! ఈ క్షణం నుంచి నీ ఆలో చనలన్నీ సివిల్స్‌మీదే ఉండనివ్వు! ప్రతి విషయాన్ని విశ్లేషిస్తూ మాట్లాడు.. టైమ్ వేస్ట్ చేసుకోవద్దు!" అందామె.

"చెలిమికి చిరునామాలాగా మీ ఆర్పీ ఇంట్లో వ్యక్తులు కన్పిస్తారు. బాధలు, సంతోషాలు పంచుకోడానికి మనసుకు నచ్చినవాళ్లు కనీసం ఒకరన్నా ఉండాలి! ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో నీ స్నేహం లభించింది.. మీ తాతగారు, పిన్నిగారు కూడా ఎంతో ఆత్మీయంగా మాట్లాడతారు" అన్నాడు దరహాస్.

అమృత కళ్లు ఆనందంతో మెరిశాయి.

"కోచింగ్‌కు ఎక్కడికి వెళ్తున్నారు?" అడి గిందామె.

"హైద్రాబాద్ వెళ్తాను"

"మా ఫ్యామిలీ ఇప్పుడు హైద్రాబాద్ లోనే వుంది. మా అన్నయ్య వికాస్ కూడా సివిల్స్ కోచింగ్ తీసుకుంటున్నాడు. నువ్వు మా ఇంటికెళ్లు.. మీరిద్దరూ కంబైన్డ్ స్టడీస్ చెయ్యొచ్చు!"

"వద్దొద్దు.. మా స్నేహితుడు సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నాడు. అమీర్‌పేటలో

# అగ్ని పర్వతాలు

చతుర సమాచారం

ప్రకృతి వైపరీత్యాల్లో అగ్ని పర్వతాల పాత్ర చాలా ఉంది. ఆ విశేషాలు కొన్ని..

★ ప్రపంచంలో ప్రతిరోజూ పది నుంచి ఇరవై అగ్ని పర్వతాలు బద్దలవుతుంటాయి.

★ రోమన్ అగ్ని దేవత వల్కాన్ పేరిట 'వల్కనో' అనే ఆంగ్ల పదం పుట్టింది. దానర్థం అగ్ని పర్వతం.



★ అంటార్కిటికాలోని ఓ అగ్నిపర్వతం సదా రగులుతూ, ముందు క్రిస్టల్స్‌ని వెదజల్లుతూ ఉంటుంది. ఇది అమెరికన్ రీసెర్చ్ సెంటర్‌కి దగ్గరలో ఉంది.

★ ఇండోనేషియాలోని ఓ అగ్నిపర్వతం నీలి మంటలని వెదజల్లుతూ ఉంటుంది!

★ ఏప్రిల్ 1, 1974న అలస్కాలోని మౌంట్ ఎడ్జ్‌కుంబే నుంచి నల్లటి పొగ వెలువడుతూ ఉండడం గమనించి కోస్ట్ గార్డు పైలెట్ పరిశీలించడానికి విమానంలో వెళ్లినపుడు కాలే 70 టైర్లు, 'ఏప్రిల్ ఫూల్' అన్న అక్షరాలు కనిపించాయి.

★ జపాన్ అధికారులు మౌంట్ మిహారా అనే అగ్నిపర్వతం చుట్టూ పెద్ద కంచెని కట్టారు. కారణం అప్పటికే రెండు వేలమంది అందులోకి దూకి ఆత్మహత్య చేసుకోవడం!

★ నార్వే నేపథ్యంలో ఎడ్వర్డ్ మంచ్ గీసిన 'ది స్క్రీమ్' అనే చిత్రంలో ఆకాశం ఎర్రగా ఉండడానికి కారణం ఇండోనేషియాలో క్రకటాల్ అనే అగ్నిపర్వతం ఆ సమయంలో బద్దలవడం.

★ 1943లో మెక్సికోలోని ఓ మొక్కజొన్న పొలంలో 50 అడుగుల మేర ఓ అగ్ని పర్వతం ఏర్పడి సంవత్సరంలో 1100 అడుగుల ఎత్తుకి ఎదిగింది!

ఉంటున్నాడు. వాడి రూములో ఉంటాను" అన్నాడతను.

"మీకు అన్నీ మొహమాటమే!" అందామె.

"డిగ్రీ అయిపోయింది గదా! మీరేం చేద్దామనుకుంటున్నారు? " అడిగాడతను.

"గుంటూరులో బి.ఇడి. చేద్దామనుకుంటున్నాను. గ్రామీణ ప్రాంతాల్లో పిల్లలకు పాఠాలు చెప్పడం ఇష్టం! కేవలం టీచరే కాదు వాలంటీరుగా కూడా పనిచేయాలని ఉంది. రకరకాల కారణాలవల్ల చదువు మానేసిన అమ్మాయిల్ని గుర్తించి వాళ్లను మళ్లీ బడిదారి పట్టేలా చేస్తాను. ఆడపిల్లలకు ఆరోగ్యం, పరిశుభ్రత గురించి చెబుతాను. అమ్మాయిల్లో ఆత్మవిశ్వాసం పెరిగేట్లు కృషి చెయ్యాలి! చాలా ఉన్నాయి నా లక్ష్యాలు" అంది అమృత నవ్వుతూ.

ఆ అమ్మాయి దృఢ సంకల్పం, లక్ష్యం వైపు పరుగులుతీసే మనస్తత్వాన్ని వెల్లడించే సంఘటన అతని దృష్టికి వచ్చింది.

రోజూ బస్సులో గుంటూరెళ్లి బి.ఇడి. చదువుతూనే మూర్తి మాష్టారు నడుపుతున్న అనాథాశ్రమానికి వెళ్తూ ఉంది. అక్కడి పిల్లలకు సైన్సు, లెక్కలు చెబుతోంది. తీరిక దొరికినప్పుడు పిల్లలకు కథలు చెప్పడం, ఆడించడం చేస్తోంది.

ఓసారి ఇంటికొచ్చిన విఠల్ దృష్టిలో

## కొత్తగాలి...

**తొలకరి**
**మట్టివాసనల పరిమళాలు**
**తొలిబిడ్డ**
**కేరింతల పరవశాలు!**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

పడింది, కూతురు అనాథాశ్రమం చుట్టూ తిరగడం.

"మన వంశం ఏమిటి? నువ్వు చేస్తున్న పనులేమిటి? నాకు తిక్కరేగిందంటే చదువు మాన్పించి పెళ్లి చేసి అత్తగారింటికి పంపించేస్తాను. అత్తగారింట్లో అంట్లు తోమితేగాని నీకు బుద్ధిరాదు! దిక్కూమొక్కూ ల్లేని పిల్లల్ని ఉద్ధరించాలని కంకణం కట్టుకున్నావా? పిచ్చివేషాలు వేయకుండా బుద్ధిగా ఉండు!" అంటూ ఎగిరిపడ్డాడు అమృత మీద.

సుగుణకు నచ్చలేదు విఠల్ మాటలు. పిచ్చివాగుడులా అన్పించిందామెకు.

"అమృత ఏం తప్పు చేస్తున్నది? పేదపిల్లలకు నాలుగక్షరాలు నేర్పడం తప్పా? కొడుకును చదివించడానికి విజయవాడ నుంచి హైద్రాబాద్ మకాం మార్చావ్! లక్షలు ఖర్చుపెట్టి ఇంజినీరింగ్ చదివించి ఆడపిల్లను ఇక్కడ వదిలేశావ్. అదేదో కష్టపడి చదువుకుంటూ నలుగురికి ఉపయోగపడే పనులు చేస్తుంటే దాన్ని కోప్పడతావెందుకు? నువ్వేం చదివించనవసరం లేదు. మావారి ఆస్తి నాకు వచ్చింది. ఎంతవరకు చదువుకుంటే అంతవరకూ నా డబ్బుతో చదివిస్తా! అమృత సంగతి నువ్వు, మీ ఆవిడ మర్చిపోండి! ఈరోజు నుంచి అమృత నా కూతురు!" విఠల్ మీద విరుచుకుపడింది సుగుణ.

సుగుణ అతనికి ఎదురుతిరగడం అదే మొదటిసారి.

బాపయ్య కూడా కొడుకును కోప్పడ్డాడు. దాంతో విఠల్ తగ్గిపోయి 'మీ గొడవలు నాకెందుకు?' అనుకుంటూ తిరిగి వెళ్లిపోయాడు పొన్నూరు నుంచి హైద్రాబాద్.

అమృత బాధ్యతలు సుగుణ మీద వేసుకోవడం విఠల్‌కు ఓ పక్క సంతోషంగానే ఉంది. కూతురి పెళ్లి చేయాలి! మెట్టినింట అడుగుపెట్టేవరకూ కట్నం అని, కానుకలనీ డబ్బు ఖర్చు పెట్టాల్సి ఉంటుంది. పెట్టుపోతలకే తన ఆస్తి కరిగిపోతుంది. ఇక కొడుక్కి ఏం మిగులుతుంది?! కొడుక్కు ఇప్పుడెంత ఖర్చుపెట్టినా ముందుముందు వృద్ధాప్యం మీదపడ్డాక వాడు తనను కంటికి రెప్పలా చూస్తాడు!

పొన్నూరులో జరిగిన సంఘటన భార్యకి చెప్పాడు. అదివరకు ఇద్దరూ కలిసి పొన్నూరు వెళ్లేవారు. ఈమధ్య మంత్రుల భార్యలు, అధికారుల సతీమణులతో అనసూయకు పరిచయాలు ఏర్పడ్డాయి. మహిళా మండలికి సెక్రెటరీ అయింది. క్షణం తీరిక ఉండటం లేదామెకు.

"మా చెల్లెలు చెప్పిన ప్రతిదానికీ తల ఊపేస్తావ్? నువ్వు దానికి మొగుడివో? నాకు మొగుడివో? అర్థం కావడం లేదు" అంది అనసూయ అరుస్తూ.

అటూఇటూ చూశాడు భార్య మాటలు ఎవరన్నా వింటున్నారేమోనని.. హాల్లో ఎవరూ లేరు. "మెల్లగా మాట్లాడొచ్చు గదా!" అన్నాడు.

సుగుణను తోబుట్టువులా భావిస్తానని ఎన్నిసార్లు చెప్పినా అనసూయ అర్థం చేసుకోదు. అనుమానమనే పెనుభూతం బుర్రలో దూరేక ఎవరెన్ని చెప్పినా నమ్మదు. ఆ పిచ్చిధోరణి పోదు!

"మీ అమ్మాయి మీ మాట వినదు! మీ నాన్నగారు మీ మాట పట్టించుకోరు! మీరు మాత్రం సుగుణ మాటలు వినేసి వచ్చే

స్తారు" అంటూ సాధిస్తూనే ఉంది భర్తను.

"పొన్నూరులో జరిగిన విషయాలు భార్యకు చెప్పడం తనదే బుద్ధితక్కువ" అనుకున్నాడు.

"ఆర్చీ ఇల్లు, పొలం అమ్మేయమని చెప్పాను. ఆ విషయం మీ నాన్నగారితో మాట్లాడేరా? "

"నాన్నకు చెప్పాను. 'తరతరాలుగా ఆ ఇంట్లో ఉంటున్నాం! కావాలంటే పొలం అమ్ముకుని డబ్బు తీసుకుపో' అన్నాడు నాన్న కటువుగా. పొలం, ఇల్లు అమ్మడం ఎవరికీ ఇష్టంలేదు. నాన్న ఉన్నంతకాలం వాటిజోలికి పోలేం! ఊళ్లోవాళ్ల దగ్గర ఆ ప్రస్తావన తెచ్చినా నన్నే కోప్పడ్డారు. అందరిముందూ పలచనైపోయాను"

"ఇక్కడా మీ పరిస్థితి అలాగే ఉందిగా! ఫైనాన్స్ బిజినెస్ దెబ్బతింది. విజయవాడలో లారీలు, సినిమాహాలు కొన్నారు. అవి నడపలేక నష్టానికి తిరిగి వాటిని అమ్మేశారు. హైద్రాబాద్ వచ్చాం! ఇక్కడందరికీ అప్పులిచ్చారు. అవి తిరిగి రాబట్టుకునే పరిస్థితి లేదు. నాలుగైదు స్థలాలు కొన్నారు రేటు ఎక్కువ పెట్టి.. వాటికిప్పుడు డిమాండ్ లేదు. సంపాదన లేదు, ఖర్చులు మాత్రం పెరిగిపోతున్నాయి" అందామె చిరాకుపడిపోతూ.

"ఒక సంవత్సరం ఆగవే! మనవాడు ఐ. ఎ.ఎస్. అయిపోతాడు. పదికోట్ల కట్నం వస్తుంది వాడికి. మంత్రిగారి కూతురినో, కాంట్రాక్టర్ కూతురినో పెళ్లి చేసుకుంటాడు! దాంతో మన స్టేటస్ పెరిగిపోతుంది"

విఠల్ మాటలు ఆమెను మైకంలో ముంచెత్తాయి.

"మనబ్బాయి కలెక్టర్ అయితే మీ వాళ్లంతా మనదగ్గరికే పరుగెత్తుకుంటూ వస్తారు. అప్పుడు మీ మాటక్కూడా విలువ పెరుగుతుంది. మీరు పొలం, ఇల్లు అమ్మేయమంటే అమ్మేసి వచ్చేస్తారు మన దగ్గరకు. చిన్నచిన్న టౌన్లలో ఉండాలంటే నాకు తలనొప్పి!" అందామె.

"వికాస్ ఏడి? "

"స్నేహితులతో కలిసి పబ్‌కు వెళ్లాడు"

"వాడికి డబ్బెవరు ఇచ్చారు? "

"నేనే.. నా ఏటీయమ్ కార్డు ఇచ్చాను"

'ఓ లక్ష్యం లేకుండా తిరుగుతూ ఉంటే వాడు కలెక్టరేం అవుతాడు? ' అని గొణుక్కున్నాడు భార్యను ఏమనలేక.




**కూ**రగాయలు తరుగుతూ కూర్చుం ది సంపూర్ణ సాయంత్రంపూట.

ఉదయం బీరకాయకూర, గోంగూరపచ్చడి చేద్దామనుకుంది.. వీలుపడలేదు. అన్నం ఒక్కటే వండింది. బాక్సులో పండుమిరపకాయ పచ్చడి వేసుకు వెళ్ళాడు కోటి.

"కాలేజీలో అన్నంలో ఎర్రటి మిరపకాయ పచ్చడి కలుపుకు తింటే నవ్వుతా రమ్మా! ఒకపూట తినకపోతే ఏం కాదులే!" అంటూ లాలిత్య బాక్సు పట్టుకెళ్ళకుండానే వెళ్ళిపోయింది.

హరితకు పెరుగన్నం పెట్టి స్కూలుదగ్గర వదిలిపెట్టివచ్చింది.

రాత్రికైనా కూర చేయకపోతే అందరూ పచ్చడన్నమే తినాల్సి వస్తుందనుకుంది.

హరిత స్కూలు నుంచి వచ్చేక, సంపూర్ణ దగ్గర చేరింది. స్కూల్లో తను నోట్‌బుక్ మీద రాసిన తెలుగు పదాలను సంపూర్ణకు చూపించి పెద్దగా చదవడం మొదలుపెట్టింది. ఆ పాప చదివేది ఒకటో తరగతి.

"అమ్మ, ఆవు, ఇల్లు, ఈల, ఊరు.." హరిత మాటలు ముద్దొచ్చి దగ్గరకు తీసుకుని బుగ్గమీద ముద్దుపెట్టుకుంది.

ఏదో గుర్తుకువచ్చి "స్కూల్లో నా పక్కన కూర్చునే లలిత 'మీ అమ్మ చనిపోయింది' అంది. నేను 'అబద్ధం.. మా అమ్మ ఇంటి దగ్గర ఉంది అన్నాను. లలిత చెప్పింది అబద్ధం కదూ!" అనడిగింది హరిత.

"నేనేనమ్మా మీ అమ్మను. నువ్వు బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చేసేదాకా బతికేవుంటాను" అంది సంపూర్ణ.

"నేను అమెరికాలో ఉద్యోగం చేస్తానమ్మా! నిన్ను అక్కడికి తీసుకువెళ్తాను" అంది హరిత కళ్ళు చక్రాల్లా తిప్పుతూ.

నవ్వుకుంది పాప మాటలకు.

"మీ ఆటో నాన్నను తీసుకువెళ్ళవా?"

"ఇద్దర్నీ తీసుకువెళ్తాను. లాలిత్య అక్క వద్దులే!"

"ఎందుకే? దాన్ని మాత్రం ఎందుకు తీసుకువెళ్ళవు?"

"అక్కకు పెళ్ళి అవుతుంది గదా! మొగుడిని వదిలిపెట్టి ఒక్కతే ఎలా వస్తుంది?"

అప్పుడే కాలేజీనుంచి వచ్చిన లాలిత్య, హరిత ముద్దుమాటలు విన్నది.

"నా మొగుడి సంగతి నీకెందుకే? ఉత్త అల్లరిపిల్ల!" అంటూ హరితను ఎత్తుకుని ముద్దుపెట్టుకుంది.

"నీకు పోస్టు వచ్చిందక్కా!" అని మ్యాగజైన్ తెచ్చి లాలిత్యకు ఇచ్చింది.

ఆ మ్యాగజైన్‌లో లాలిత్య రాసిన కథ ప్రచురితమైంది.

బ్యాగ్‌లోంచి చాక్‌లెట్ తీసి హరితకిచ్చింది. సామాజిక విలువలు, జీవిత సత్యాలు, అనుబంధాలు, వ్యక్తి నిస్సహాయత, పరిస్థితుల ప్రభావం తదితర అంశాలపై కథలు రాస్తుంది. కోట్లు సంపాదించినా కొంతమందికి గుర్తింపురాదు. కానీ రచనద్వారా తనకు గుర్తింపు వస్తున్నది.. అదే లాలిత్య ఆనందం.

"మధ్యాహ్నం అన్న ఫోన్ చేశాడమ్మా!"

"బాగున్నాడా? బాగా చదువుకుంటున్నాడా?" అడిగింది సంపూర్ణ.

"చెప్పలేక చెప్పాడు. కొద్దిగా డబ్బు అవసరం అట! అప్పటికీ చిన్నపిల్లలకు ట్యూషన్ చెబుతూ కొద్దిగా సంపాదిస్తున్నాడట. కానీ చాలడంలేదట. ఉదయంపూట న్యూస్ పేపర్లు ఇళ్ళలో వేయడం, పాలప్యాకెట్లు సరఫరా చెయ్యడం లాంటి చిన్నచిన్న పనులు చేస్తున్నాడట చేతి ఖర్చులకోసం"

"వాడు అక్కడికెళ్ళింది చదువుకోసం.. ఇలా ఉద్యోగాలు చేస్తూవుంటే చదువు బుర్రకెలా ఎక్కుతుంది?" అంది తల్లి.

"అది నిజమేగాని, నాన్నమీద పూర్తిగా భారం వెయ్యడం అన్నయ్యకు ఇష్టంలేదు. అన్నయ్య న్యూస్‌పేపర్లు పంచేది ప్రశాసన్ నగర్‌లో.. ఆ కాలనీలో అంతా ఐ.ఎ.యస్. అధికారులు వుంటారట! వాళ్ళతో అన్ని విషయాలూ చర్చిస్తాడట! ఆ చర్చలు తనకు ఉపయోగపడతాయట!" అంటూ దరహాస్ గూర్చి తల్లికి చెప్పింది.

"మీ నాన్న రాత్రి తొమ్మిది దాటేక ఆటో నడిపేవాడు కాదు. ఇప్పుడు రాత్రి పది, పదకొండు దాటితేగానీ ఇంటికి రావడం లేదు. పిల్లలకోసం ఆయనెంతో కష్టపడుతున్నాడు! మీ అన్నయ్యకు ఉద్యోగం వస్తేగానీ మనం ఒడ్డునపడం. ఇంతకీ డబ్బెంత పంపమన్నాడు?" కూతుర్ని అడిగింది.

"పదివేలు కావాలట"

"ఎక్కడినుంచి తెస్తాం? అమ్ముకోవడానికి ఇంట్లో చిన్న బంగారపు నగ కూడా లేదు. నువ్వు రోల్డ్‌గోల్డ్ గొలుసు వేసుకుని కాలేజీకి వెళ్తున్నావు. సర్లే! ఎక్కడో చోట అప్పుచేసి అన్నయ్యకు పంపుదాం!" అంది సంపూర్ణ.

ఉదయం జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. ఆరుగంటలప్పుడు ఇంటిముందు ఊడ్చి ముగ్గువేస్తున్నది. ఎవరో ఇద్దరు మోటర్ బైక్ మీద వచ్చి 'పాండ్రపాడు

వెళ్ళే దారి ఏది?' అనడిగారు. వాళ్ళకు ఎటువెళ్ళాలో చెబుతుండగా బైక్ వెనుక కూర్చున్నవాడు మెళ్ళో గొలుసు లాక్కున్నాడు. తను పెద్దగా అరిచేలోపే బైక్ స్టార్ట్ చేసి అక్కడినుంచి జారుకున్నారు.

ఆ గొలుసు బంగారువుది కాదని తెలుసుకుని తిట్టుకుని వుంటారనుకుంది సంపూర్ణ.

★ ★ ★

ఫేస్‌బుక్‌లో అమృతతో చాటింగ్ మొదలుపెట్టాడు దరహాస్.

"హాయ్! హౌ ఆర్ యూ? లైఫ్ ఇన్ సిటీ ఈజ్ లైక్ ది సీ.. సముద్రంలో ఉన్నట్టుగా ఉంటుంది. ఎటు చూసినా ఉవ్వెత్తున లేచే కెరటాలు కన్పిస్తాయి. పల్లెటూళ్ళో జీవితం చెరువులా ఉంటుంది. నిశ్చలంగా ఉండే నీళ్ళు.. ఆటుపోట్లు ఉండవు. ఇక్కడికొచ్చిన కొత్తలో స్నేహితుడి గదిలో వుండేవాడిని. వాడికి బెంగళూరులో ఉద్యోగం రావడంతో వెళ్ళిపోయాడు. ఆ రూం రెంట్ ఎక్కువని మరో చిన్నగదిలో అడ్జెస్టవుతున్నాను. ఇంటి ఓనరుగారి కంప్యూటర్‌లోంచి చాట్ చేస్తున్నాను. ఎలా ఉన్నారు?"

"ఎలా ఉన్నారు.. మీరు.. లాంటి గౌరవవాచకాలు అవసరం లేదు" అని సమాధానమిచ్చింది అమృత.

అతను కీ బోర్డు మీద టైప్ చేశాడు..

"సారీ.. అమృతా!"

"సారీలు అవసరం లేదు. నువ్వు సివిల్స్‌లో సెలెక్ట్ అయితే నాకు మంచి శారీ కొనిపెట్టాలి!" చకచకా టైపు చేసింది.

"తప్పకుండా..! నీకు శారీ కొనిపెట్టాలన్న కోరికతోనన్నా గట్టిగా ప్రిపేర్ అయ్యి సివిల్స్ గట్టెక్కుతా!"

"పదివేలు కావాలని లాలిత్యకు ఫోన్ చేశావట. అక్కడ బ్యాంక్ ఎకౌంట్ ఓపెన్ చెయ్యి! నీకు డబ్బెప్పుడు అవసరమైతే అప్పుడు మనీ ట్రాన్స్‌ఫర్ చేస్తాను"

"నీ డబ్బు నాకెందుకు?"

**కొత్తగాలి...**

**వృథా చేసే**
**ప్రతి నీటిబొట్టు**
**భావి తరాలకు**
**గొడ్డలిపెట్టు!**

– యన్. వేణుగోపాల్,
హైదరాబాద్

"మళ్ళీ వడ్డీతో సహా ఇచ్చేద్దువుగానిలే! నా డబ్బుకాదు. మా పిన్ని నీ సంగతులు తెలుసుకుని అవసరమైన డబ్బు పంపమని చెప్పింది. ఆమె ఎకౌంట్ నుంచి నీ ఎకౌంట్‌కు ట్రాన్స్‌ఫర్ చేస్తాను"

"ఆర్చీ ఇంట్లో మంచి మనసున్నవాళ్ళున్నారు. చెలిమికి చిరునామాలా కన్పిస్తుంది మీ ఇల్లు"

"మీ చెల్లెలంటే మా తాతగారికెంతో అభిమానం. ఎప్పుడూ పక్కన కూర్చోబెట్టుకుని ఆర్చీ ఇంటి సంగతులు, ఊరి సంగతులు చెబుతూ ఉంటాడు. మేమిద్దరం ప్రతిమల్లా ఆయనెదుట కూర్చుని ఆయన చెప్పే కబుర్లు వింటూ వుంటాం!"

"గుడ్.."

"బై! నీ టైమ్ చాటింగ్‌తో వేస్ట్ చేయడం నాకిష్టంలేదు"

★ ★ ★

మూర్తి మాస్టారు చనిపోయారు.

ఊళ్ళో అందరూ బాధపడ్డారు. తలలో నాలుకలా ఉండేవారు. ఏది మంచో? ఏది చెడో? మొహమాటం లేకుండా చెప్పేవారు. వాళ్ళ అన్న లక్ష్మయ్యతో కూడా 'ఈ జన్మలో దానం చేయకపోతే వచ్చే జన్మలో దరిద్రంతో బతకాల్సివస్తుంది' అనేవారు. కానీ లక్ష్మయ్య తమ్ముని మాట ఎప్పుడూ విన్లేదు.

లక్ష్మయ్య పోలికలు మూర్తిగారి కొడుక్కు వచ్చాయి. కిషోర్‌కు పైసా ఖర్చు పెట్టడం ఇష్టంలేదు. స్నేహితులతో సిని మాలకు, హోటళ్ళకు తిరిగేవాడేగానీ జేబు లోంచి ఒక్క రూపాయి బయటకు తీసే వాడు కాదు. అతని ముగ్గురు అక్కయ్య లకు పెళ్ళిళ్ళయ్యాయి. ఉద్యోగాలు కూడా చేస్తున్నారు. ఆడపిల్లలకు పెట్టాల్సింది పోయి వాళ్ళనుంచి ఏదో సాకుతో డబ్బు గుంజి వడ్డీలకు తిప్పేవాడు.

మూర్తిగారి పెద్ద కర్మ ఘనంగా చెయ్యా లన్నారు ఆయన కూతుళ్ళు! అనవసర ఖర్చు ఎందుకంటూ కిషోర్ మౌనంగా ఉండిపోయాడు. కూతుళ్ళు బ్రాహ్మణుడ్ని పిలిపించి పూజ చేయించి, పొత్తర్లలో బియ్యం, కూరగాయలు మొదలైనవి పెట్టిం చారు. బ్రాహ్మడికి కిషోర్‌చేత ఘనంగా దక్షిణ ఇప్పించారు. తండ్రికి ఇష్టమైన వంటకాలు చేయించి ఊళ్ళోవాళ్ళకి భోజ నాలు పెట్టారు.

పెద్దకర్మ అయ్యేక మరుసటిరోజు అనా థాశ్రమం దగ్గరికొచ్చాడు కిషోర్. ఆ సమ యంలో అమృత పిల్లలకు పాఠాలు చెబు తోంది.

"ఈ ఇల్లు మాది! వారంరోజుల్లో అందరూ ఖాళీ చెయ్యండి! ఇల్లు బాగు చేయించాలి!" అన్నాడు మూర్తిగారి కొడుకు.

"బాగుచేయించేక అనాథాశ్రమం ఇక్కడే నడుపుకోవచ్చా" అడిగింది అమృత.

"ఇల్లు మా పెదనాన్నది. ఆస్తి మా నాన్నగారి పరమైంది. ఆయన చనిపోయా డు కాబట్టి ఆస్తి అంతా నాదే! దీన్ని బాగు చేయించి అద్దెకిస్తాను" అన్నాడు కిషోర్

"ఇప్పటికిప్పుడు ఖాళీ చెయ్యమంటే ఎ లా? పిల్లలందరూ ఎక్కడికెళ్తారు? ఇం దులో అనాథాశ్రమం నడుపుకోడానికి డిస్ట్రి క్ట్ ఉమన్ అండ్ ఛైల్డ్ డెవలప్‌మెంట్ అ ధికారి నుంచి పర్మిషన్ తీసుకున్నాం!"

"ఈ ఇల్లు అనాథాశ్రమం పేరిట రిజి స్టర్ కాలేదు. ఇంటిపై పూర్తి హక్కులు నావే? " అన్నాడతను గొంతు పెంచి.

మూర్తిగారు చనిపోకముందు ఆ ఇంటిని అనాథాశ్రమం పేరిట రిజిస్టర్ చేయించేందుకు ప్రయత్నించాడు. ఆస్తి అన్నగారి పేరు మీద వుంది. ఆయన తమ్ముడి పేర వీలునామా రాయలేదు. లీగల్ హెయిర్‌గా సర్టిఫికెట్ తెచ్చుకోవా ల్సొచ్చింది. ఎమ్మార్వోకు లంచమిస్తే చట్ట రీత్యా వారసత్వం తొందరగానే వచ్చేది. లంచం ఇవ్వనందున ఆ సర్టిఫికెట్ రావ డానికి సంవత్సరం పట్టింది. లక్ష్మయ్య ఆస్తి అంతా మూర్తిగారి పేరు మీదికి బదిలీ అయ్యింది. దాన్ని అనాథాశ్రమానికి రాసే ప్రయత్నంలో వుండగానే ఆయన చనిపోయారు. ఈ లొసుగును కనిపెట్టి పెదనాన్న ఇల్లు తనదేనని దబాయించాడు కిషోర్ అమృత ముందు.

"నెల రోజులన్నా సమయం ఇవ్వండి! పిల్లలు ఉండటానికి ఇబ్బందిలేని ఇల్లు చూసుకోవాలి గదా? " అందామె.

"సరే!" అన్నాడు కిషోర్.

అనాథాశ్రమంనుంచి ఇంటికొచ్చిన అమృ తకు ఏం చేయాలో పాలుపోలేదు. అశాం తిగా తిరుగుతుంటే "ఏమయ్యిందే? అలా వున్నావ్? " అనడిగింది సుగుణ.

"మూర్తిగారి అబ్బాయి అనాథాశ్రమాన్ని ఖాళీ చేయమంటున్నాడు. ఇల్లు అతనిదే నట! లక్ష్మయ్యగారి పొలం మీద వచ్చే అయివేజుతో ఇన్నాళ్ళూ మూర్తిగారు నడి పారు. ఇప్పుడెలా నడపాలో? కిషోర్‌కన్నీ వాళ్ళ పెదనాన్న బుద్ధులే. ఉత్త పీనాసి!"

సుగుణ ఆలోచిస్తూ వుండిపోయింది. కొద్దిసేపయ్యాక "మా అత్తమామలు కూడా పీనాసివాళ్ళే! బతికున్న రోజుల్లో పైసాకు పైసా ముడివేసి ఆస్తి పదింతలు చేశారు. నన్ను ఇబ్బంది పెట్టినా చనిపోయేముందు ఆస్తి అంతా నాపేరుమీద రాశారుగదా!

అ
క్ష
రం

నీ జీవిత సౌఖ్యం
నీ ఆలోచనల ప్రామాణికతపై ఆధారపడి ఉంటుంది
కనుక వాటిని తదనుగుణంగా మలుచుకో

– మార్కస్ ఆంటోనియస్



ఒకట్రెండు ఎకరాలమ్మేసి ఆ డబ్బుతో ఇల్లు కొని అనాథాశ్రమానికి దానంగా ఇచ్చేస్తాను. మావారి పేరు పెడదాం ఆశ్రమానికి. అలానయినా మావారి ఆస్తి సద్వినియోగం అవుతుంది" అంది.

ఆనందంతో పొంగిపోయింది అమృత.

ఇంటిని అనాథాశ్రమం పేరిట రిజిస్టర్ చేయడానికి కిషోర్ ఒప్పుకున్నాడు. డబ్బొచ్చి పడుతుంటే అతనికి అభ్యంతరం ఏముంటుంది?

ఆ విషయాలన్నీ దరహాస్‌కు చాటింగ్‌లో చెప్పింది. అతనెంతో సంతోషపడ్డాడు. అమృతది 'అమృత హృదయం' అని అతడు మెచ్చుకోగా 'ఆ అమృతమూర్తి మా పిన్ని' అని బదులిచ్చిందామె.

★ ★ ★

నిడుబ్రోలు రైల్వేస్టేషన్ దగ్గర ఎనభై యేళ్ళ పెద్దాయన ఆటో ఎక్కి, "పాతపొన్నూరు శివాలయం దగ్గర దిగుతాను.. ఎంతిమ్మంటావ్? " అనడిగాడు.

"మీ ఇష్టం! ఎంతోకొంత ఇద్దురుగాని లెండి.. ముందు స్థిమితంగా కూర్చోండి! మీ సామానంతా ఆటోలో పెట్టుకున్నారో? లేదో? చూసుకోండి!" అన్నాడు కోటి.

"పళ్ళబుట్ట, సూట్‌కేస్, చిన్నబ్యాగు.. మొత్తం మూడు శాల్తీలు.. అన్నీ ఉన్నాయిలే పోనివ్వు!" అన్నాడాయన.

కోటి ఆటో స్టార్ట్ చేశాడు.

"మా మనవరాలికి ఓణీలిస్తున్నారు. ఇప్పుడు దానికి పదకొండో సంవత్సరం. నూతన వస్త్రబహూకరణ ఫంక్షన్ చెయ్యాలని మా అమ్మాయి, అల్లుడు పట్టుబడుతున్నారు. ఖర్చు ఐదులక్షలవుతుందయ్యా! ఖర్చంతా అమ్మమ్మావాళ్ళు పెట్టుకోవాలట! కొత్తకొత్త పద్ధతులొచ్చాయయ్యా! వెనుకటి రోజుల్లో ఇటువంటి ఫంక్షన్లుండేవి కావు. పెద్దమనిషి అయితే ఓ వందమందికి బంతిభోజనాలు పెట్టేవాళ్ళు. తరువాత పెళ్ళి! పెళ్ళిఖర్చు లక్షకు మించేదికాదు. ఇప్పుడు ఓణీల ఫంక్షన్‌కే ఐదారు లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఎందుకంత ఖర్చంటే వినరయ్యా బాబూ!" అన్నాడు పెద్దాయన.

"అంత ఖర్చు అవుతుందాండీ? " ఆశ్చర్యపోతూ అడిగాడు కోటి.

"నగలే రెండుమూడు లక్షలు.. డ్రెస్సులు లక్షపైనే.. భోజనాలు, పెద్ద ఫంక్షన్‌హాలు.. పెళ్ళికంటే ఆర్భాటంగా చేస్తున్నారు. ఈ రోజుల్లో ఇంటికొకరు అమెరికానో, ఇంగ్లండో వెళ్తున్నారు, సంపాదిస్తున్నారు, ఖర్చుపెడ్తున్నారు. ఈ బ్యాగ్‌లో వున్న బంగారు గొలుసులు తెనాలిలో కొన్నాం! మా అమ్మాయి తెనాలిలో వుండిపోయింది. అత్తగారిది ఆ వూరేలే! నగలు, బట్టలు పట్టుకెళ్ళమన్నారు.. ఇక్కడి ఫంక్షన్ ఫోటోలు, వీడియోలు అమెరికా తీసుకెళ్ళి అక్కడ ఫ్రెండ్స్‌కి చూపిస్తారు గొప్పగా! ఆ రోజుల్లో నా పెళ్ళికి మానాన్నేం చేశాడో తెలుసా! నాకు పిల్లను చూస్తానని గొడుగు చంకలో పెట్టుకొని అమృతలూరు వెళ్ళాడు. అక్కడో అమ్మాయి నచ్చిందాయనకు. నాలుగు తమలపాకులు, రెండు అరటిపండ్లు, రెండు వక్కలు వుంచి తాంబూలం ఇచ్చి పుచ్చుకున్నారు. పెళ్ళి తేది ఖాయం చేసు

కుని తిరిగొచ్చే శాడు. ఓ ఇరవై మంది ఎడ్ల బండ్లు కట్టుకుని ఆ ఊరెళ్ళాం! రాత్రిపూట పె ట్రోమాక్సులైట్ల వెలుగులో పెళ్ళ యిపోయింది. మా ఆవిడను తీసుకుని తెల్లవా రేసరికి పొ న్నూరు వచ్చేశాం! మా నాన్నకి పెళ్ళి ఖర్చు వందరూ పాయిలు కూడా కాలేదు. మా అత్తగారికి రెండు వేలు ఖర్చయ్యుం టుంది" చెప్పుకు పోతూనే వు న్నాడు.



సెంటర్ దాటి పాత పొన్నూరు వైపు మళ్ళింది ఆటో. మూర్తిమ హల్ దాటు తుంటే, "ఒకప్పుడు ఆ సినిమాహాలు ప్రేక్ష కులతో కళకళలాడేది. కుటుంబ వివాదా లతో మూతబడిపోయింది. సంవత్సరాలు గడుస్తున్నా, హాలు శిథిలమైపోతున్నా కోర్టులో వివాదం పరిష్కారం కావడం లేదు. రామాయణం చదివితే మనకు అర్థ మయ్యే నీతి ఒకటే! అన్నదమ్ములమధ్య సఖ్యత వుంది కాబట్టి రామరాజ్యం సుభిక్షంగా వుంది. వాలి సుగ్రీవులు తన్ను కున్నారు కనుక ఇక్కట్ల పాలయ్యారు. సీతారాములమధ్య ఎన్ని అవాంతరాలొ చ్చినా అనురాగం, ఆప్యాయతలు వెల్లివిరి శాయి. పరస్త్రీవ్యామోహంతో రావణుడు హతమయ్యాడు. విభీషణుడి మాట వినక రావణాసురుడు చనిపోయాడు. పెద్దల మాట వినాలని రామాయణం చెబు తుంది. తండ్రికి ఎదురుచెప్పకుండా రాము డు అడవులకు వెళ్ళాడు కనుకనే రాక్షస సంహారం జరిగింది.." అంటూ చెప్పాడు పెద్దాయన.

ఆటో పాతపొన్నూరు చేరింది. పెద్దా యిన ఇంటిముందు ఆటో ఆపి, "హడా




వుడి పడకుండా నిదానంగా దిగండి తాత గారూ!" అన్నాడు కోటి.

కోటి చేతిలో వందరూపాయల నోటుంచి పసుపురంగు మేడవైపు నడిచాడు పెద్దాయన.

ఆటో వెనక్కు తిప్పి మూర్తిమహల్ దాకా వచ్చాడు. ఏదో పడినట్లన్పించి తల వెనక్కు తిప్పాడు. వెనుకసీటు మీద ఓ బ్యాగ్ మర్చిపోయాడా పెద్దాయన. ఆటో కుదుపుకు బ్యాగ్ సీటుమీంచి జారి కాళ్ళు పెట్టుకునే చోటులో పడింది. 'పెద్దాయన రామాయణంగూర్చి చెప్తూ ఆ పారవశ్యంలో బ్యాగ్ మర్చిపోయినట్టున్నాడు' అనుకుని ఆటో వెనక్కు తిప్పి, పసుపు రంగు మేడవైపు పోనిచ్చాడు. మేడముందు ఆ పెద్దాయన బంధువులు కన్పించారు.

"బ్యాగులో బంగారం, నగదు వున్నప్పుడు ఎంత జాగ్రత్తగా వుండాలి! ఆ ముసలాయనకు ఖరీదైన నగలున్న బ్యాగ్ ఇవ్వడం ఆయన కొడుకుదే తప్పు!" అన్నాడో బంధువు.

"మనవడు తోడు వస్తానంటే తాతే వద్ద

న్నాడట. ఈ పెద్దాయన ఎవరి మాటా వినడు. తనకు తోచిందే చేస్తాడు. అందరూ గాభరాపడ్తున్నా ఆ ముసలా యన నిమ్మకు నీరెత్తినట్లు అరుగుమీద ఎలా కూర్చున్నాడో చూడు!" అన్నాడు మరొకాయన.

బ్యాగ్ ఎలా పోయిందో చెబుతున్న పెద్దాయనకు బ్యాగ్ తీసుకుని ఇంటివైపొ స్తున్న కోటి శ్రీరామచంద్రుడిలాగే కన్పిం చాడు. "రక్షించావ్ స్వామీ! మనుషుల్లో నీతీనిజాయితీలు చెక్కుచెదరకుండానే వున్నాయి" అన్నాడు పెద్దగా.

కోటికి కృతజ్ఞతలు చెప్పి, వెయ్యిరూపా యిల నోటు ఇవ్వబోయాడు.

కోటి తీసుకోకుండా "మీరు పెద్దవారు.. మీ ఆశీస్సులుంటే చాలు!" అనేసి ఆటోవైపు నడిచాడు.

ఆటో స్టార్ట్‌చేసి ముందుకు పోనిచ్చాడు. పోలీస్‌స్టేషన్ రోడ్‌వైపు పోనిచ్చాడు. రోడ్డు మలుపులో పెద్ద లారీ వస్తున్నది వేగంగా. లారీ బ్రేకులు ఫెయిలవడంతో ఆటోను గుద్దేసింది. కోటి ఎగిరిపడి మురుక్కాల వలో పడ్డాడు.

ఆ సంఘటన పోలీస్‌స్టేషన్ దగ్గర్లోనే జరగడంతో కోటిని ఆసుపత్రిలో చేర్పిం చారు. లారీడ్రైవర్ పారిపోయాడు. యాక్సి డెంట్ ఎలా జరిగిందో గమనించేక తుక్కు తుక్కయిన ఆటోను, రోడ్డుకు అడ్డంగా తిరి గిన లారీని ఫొటోలు తీయించారు. ట్రాఫిక్ క్లియర్ చేసేందుకు ఆటోను, లారీని రోడ్డుపక్కకు చేర్చారు

★ ★ ★

హాస్పిటల్‌కు పరుగెత్తుకుంటూ వచ్చింది సంపూర్ణ. ఒంటినిండా కట్లతో అచేతనంగా మంచంమీదున్న కోటిని చూడగానే కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"పెద్ద ప్రమాదమేం లేదు. కాళ్ళు, చేతుల ఎముకలు విరిగాయి. ఆపరేషన్ చేసి కట్లు కట్టాం. మత్తు ఇంజెక్షన్లు ఇచ్చాం గదా రెండుమూడు గంటలు మగ తగా వుటుంది. తరువాత మాట్లాడొచ్చు! రెండుమూడు నెలల్లో మామూలుగా తిరగ గ్లుతాడు. కంగారుపడాల్సిన అవసరంలే దు" అన్నాడు డాక్టర్ చిట్టిబాబు.

బెడ్ పక్కనున్న స్టూలుమీద కూర్చుంది సంపూర్ణ. పెద్ద ప్రమాదంలేదని ఓపక్క సంతోషంగా వున్నా, మామూలు మనిషి కావడానికి కొన్ని నెలలు పడతాయనగానే గతుక్కుమంది. ఆమెలో అలజడి మొద లైంది. సంసారం ఎలా నెట్టుకురావాలి? తనదేమో చిన్న ఉద్యోగం. భర్త పరిస్థితి ఇలా ఉంటే హైద్రాబాద్‌లో దరహాస్ చదు వుమీద శ్రద్ధ చూపగల్గుతాడా? కుటుంబ పరిస్థితులు బాగా లేవని తెలిసి ఏదోక చిన్న ఉద్యోగం కోసం ప్రయత్నిస్తాడేమో! అది భర్తకూ, తనకూ ఇష్టంలేదు.. వాడను కున్నది సాధించాలి! ఆ చదువులేమిటో, పరీక్షల్లో నెగ్గితే ఏ ఉద్యోగం వస్తుందో కూడా తనకు తెలీదు.

తెలిసిందల్లా ఒకటే! పెద్ద ఉద్యోగం సంపాదించి పేదవాళ్ళను ఆదుకోవాలి! కష్టాలు కలకాలం వుండవు, చలికాలం తరువాత వసంతం ఒస్తుంది!

మనిషి దృఢంగా రాయిలా వుండేవాడు. అతని కాళ్ళూచేతులకు కట్లు చూసేసరికి ఆమె హృదయం ద్రవించింది. భర్త తల నిమిరింది. మగతగా నిద్రపోతున్నాడు. కొద్దిగా మెలకువ వచ్చినప్పుడు ఒంటినొ ప్పులతో మూలుగుతున్నాడు.

అప్పుడప్పుడు దుఃఖం పొర్లుకువస్తూ వుంది. సాయంత్రం కళ్లు తెరిచాడు. ఎదు రుగా కూర్చున్న సంపూర్ణవైపు చూశాడు. ఆమెను చూడగానే అతనికి కొండంత ధైర్యం వచ్చింది. అతని కళ్లు మెరిశాయి. దగ్గరగా జరిగి కూర్చోమని ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"నేను చనిపోలేదన్నమాట! బతికే వున్నాను. సంతోషంగా వుంది" అన్నాడు.

"మీకేం కాలేదని డాక్టరుగారు చెప్పారు. రెండునెలల్లో మళ్లీ ఆటో నడపొచ్చు!"

"దరహాస్‌ను కంగారుపడి రావొద్దని చెప్పు! అనవసరంగా ఛార్జీలు దండగ! చదువు పాడైపోతుంది!" అన్నాడు కొడుకు గుర్తుకువచ్చి.

హరితను తీసుకొని లాలిత్య వచ్చింది గదిలోకి. హరిత బుగ్గలు నిమిరాడు. పదేళ్లు నిండాయి ఆ అమ్మాయికి.

దొడ్లో పూసిన ఎర్రగులాబీ కోసుకొచ్చిన హరిత, ఆ పువ్వును కోటికి ఇచ్చింది.

"పూలమొక్కలకి రోజూ నేనే నీళ్లు పోస్తున్నాను నాన్నా! రేపు స్కూల్లో రిపబ్లిక్‌డే ఫంక్షన్ చేస్తున్నారు. నేను స్పీచ్ ఇస్తా!" అంది ఆరో తరగతి చదువుతున్న హరిత.

"చిన్నపిల్లవి నువ్వేం మాట్లాడతావే? !" అంది లాలిత్య.

"నీకంటే బాగా మాట్లాడతా! మా టీచరు రాసిచ్చింది.. అంతా నోటికి వచ్చేసింది. చెప్పమంటావా? " అంది హరిత.

"ఇక్కడొద్దు! ఇంటికెళ్లాక చెబుదువుగాని"

"నువ్వు చెప్పు! నేను వింటాను" అన్నాడు కోటి ఓపిక తెచ్చుకొని. గడగడా తనకు వచ్చిన వాక్యాలు ఇంగ్లీషులో చెప్పేసింది హరిత. అవేం అర్థంగాకపోయినా చిన్నపిల్ల ఇంగ్లీషులో మాట్లాడటం, చేతులు కట్టుకుని నిలబడటం చూసి నవ్వొచ్చింది అంత బాధలోనూ.

"రోజూ తీసుకొస్తాలే హాస్పిటల్‌కు హరితను" అంది లాలిత్య.

"వద్దొద్దు.. చిన్నపిల్లల్ని ఆసుపత్రిచుట్టూ రోజూ తిప్పడం ఎందుగ్గానీ మీ నాన్నే పది రోజులు పోయేక ఇంటికొచ్చేస్తాడు. అప్పుడు రోజూ ఆయన దగ్గర చేరి కబుర్లు చెప్పొచ్చు!" అని సంపూర్ణ లేచి నిలబడింది, భర్తకు కాఫీ తీసుకురావాలని"

★ ★ ★

సిటీబస్సు దిగి తను వుంటున్న ఇంటి వైపు నడుస్తున్నాడు దరహాస్.

తనముందు ఓ పెద్దామె రెండుచేతుల్లో రెండు సంచులు పట్టుకుని నడుస్తూ వుంది. ఆమెకి యాభైయ్యేళ్లుంటాయి. ఓ సంచి నిండా కూరగాయలు, మరో సంచిలో మినపప్పు, కందిపప్పు పొట్లాలు న్నాయి. బరువున్న సంచులు మోయలేక ఆగి, ఆగి నడుస్తోంది.

ఆమె దగ్గరకు వెళ్ళి "సంచులు బరువుగా వున్నట్లున్నాయి.. నాకివ్వండి మీ ఇంటిదాకా మోసుకొస్తా" అన్నాడు దరహాస్.

ఆమె తటపటాయించింది. 'సంచులు తీసుకుని ఉడాయిస్తే తనేం చేయగలను' అనుకుని ఎగాదిగా చూసింది.

"మీ అబ్బాయిలాంటివాడిని.. ఇవ్వండి!" అంటూనే ఆమె చేతుల్లోని సంచులు తీసుకున్నాడు. ఆ పెద్దావిడ ఇంటిదాకా మోసుకెళ్లి సంచులు గుమ్మందగ్గర పెట్టి తిరిగెళ్లబోయాడు.

"లోపలికి రా బాబూ! కాఫీ తాగివెళ్దువుగాని" అందావిడ.

"వద్దండీ" అంటూ అతను వెళ్లిపోబోతే చెయ్యిపట్టుకుని సోఫా దగ్గరికి తీసికెళ్లి కూర్చోబెట్టింది.

స్నానంచేసి హాల్లోకొచ్చిన గిరిబాబును చూసి లేచి నిలబడి నమస్కరించాడు. గిరిబాబు కూడా దరహాస్‌ను గుర్తుపట్టాడు.

## కొత్తగాలి...

**నాన్నంటే**
**నడిపించే వేలు**
**నాన్నంటే**
**వెంట నడిచే వేలుపు!**

– శ్రీదాస్యం లక్ష్మయ్య,
హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా

## కొత్తగాలి...

**యుగానికో గాంధీ పుట్టడంలేదు గానీ క్షణానికో రాక్షసుడు పుడుతున్నాడు!**

– వి. శ్రీలక్ష్మి,
హైదరాబాద్

సివిల్స్ కోచింగ్ సెంటరులో గిరిబాబు ఫ్యాకల్టీ. అనర్గళంగా ఏ విషయమైనా మాట్లాడతాడు. సమగ్రమైన అవగాహనతో చెప్పవలసిన విషయాన్ని సాధికారంగా చెబుతాడు. అంత మంచి ఫ్యాకల్టీ దొరికినందుకు దరహాస్ పొంగిపోయేవాడు క్లాస్ రూములో.

"నువ్వటోయ్..! కూర్చో!" అన్నాడు గిరిబాబు దరహాస్ భుజంతట్టి.

గిరిబాబు తల్లి ఆ అబ్బాయి సంచులు ఇంటికి మోసుకొచ్చిన సంగతి చెప్పగా, "గుడ్! చూశావా? మా అమ్మ ఎవరో నీకు తెలియదు. ఓ పెద్దావిడ కష్టపడుతున్నదని మరో ఆలోచన లేకుండా సహాయం చేశావ్. 'కనికరము కలవాళ్లు ధన్యులు..' నీ ఎకౌంట్‌లో భగవంతుడు ఓ ప్లస్ వేశాడు. భవిష్యత్తులో ఆ ప్లస్ నీకు ఉపయోగపడుతుంది. ఎప్పుడైనా డ్రా చేసుకునే సౌకర్యం భగవంతుడు కల్పిస్తాడు" అన్నాడు గిరిబాబు నవ్వుతూ.

గిరిబాబు తల్లి ఇద్దరికీ కాఫీ కప్పులు తెచ్చిచ్చింది.

"ఈ రోజుల్లో యువత చెడిపోతున్నది అంటూ వుంటారుగానీ అది నిజం కాదయ్యా! తొంభై అయిదు శాతం యువతీయువకుల ఆలోచనా దృక్పథం సరైన దారిలోనే వుంది. ఆలోచనల్లో స్పష్టత వుంది. ఆశావహ దృక్పథంతోనే ముందుకు నడుస్తున్నారు. ఐదుశాతం కుర్రాళ్లే చెడుదారిలో నడుస్తున్నారు" అన్నాడాయన.

కాఫీ తాగాక. ఆయన దగ్గర్లోవున్న పార్కుకు ఈవినింగ్ వాక్‌కు బయల్దేరాడు. ఆయన వెనుకే నడిచాడు దరహాస్.

"సివిల్స్‌కు ప్రిపేరయ్యేవాళ్లు ప్రతి విషయాన్నీ విశ్లేషించే ప్రయత్నం చేయాలి! సబ్జెక్ట్‌ను బట్టీకొట్టడం మూలంగా ప్రయోజనం వుండదు. కమ్యూనికేషన్ స్కిల్స్ డెవలప్ చేసుకోవాలి! మీ ఇల్లు ఇక్కడకు దగ్గర్లో వుండే సాయంత్రం ఆరు గంటలకు పార్కుకొచ్చేయ్! నాతోపాటు నడుస్తూ పేపర్లో చదివిన ఓ అంశం గురించి వివరించు. వార్తను రిపోర్ట్ చెయ్యకుండా నీ కామెంట్స్ చెప్పాలి!" అన్నాడు గిరిబాబు.

ఆ ఫ్యాకల్టీతో పరిచయం అయినందుకు ఎంతో సంతోషపడ్డాడు దరహాస్.

ఆ కుర్రాడు ఆటోడ్రైవర్ కొడుకని తెలుసుకుని ప్రత్యేక శ్రద్ధ చూపించాడు గిరిబాబు. "బీ గ్రేట్ బై యువర్ హార్డ్‌వర్క్.. నాట్ బై బర్త్" అన్నాడు దరహాస్‌తో. "పుట్టుక కాదు, కష్టపడే తత్వం భవిష్యత్తు నిర్ణయిస్తుంది.." అనేవాడాయన.

★ ★ ★

షాపింగ్‌మాల్ దగ్గర విఠల్ ఎదురొచ్చాడు దరహాస్‌కు.

"ఏరా? హైదరాబాద్ వచ్చి ఏం చేస్తున్నావ్? ఏదన్నా షాపులో పని దొరికిందా? " అడిగాడు విఠల్.

"కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవుతున్నానండి" అన్నాడు నమ్రతగా.

తేలిగ్గా తీసిపారేస్తున్నట్లు విఠల్ మాట్లాడ్తున్నా పట్టించుకోలేదు దరహాస్. సమాధానం ఇవ్వకుండా మౌనంగా వుండిపోయాడు.

"మీ నాన్నకు కాళ్ళూచేతులూ విరిగేయటగదా? నువ్వెళ్లలేదా పొన్నూరు? "

"వారంరోజుల్లో పరీక్షలున్నాయండి!

పరీక్షలయ్యేక వెళతాను.. అందాకా రా వద్దని మా అమ్మ చెప్పింది. మా నాన్నకు ప్రాణాపాయం తప్పింది"

"మా అబ్బాయి సివిల్స్ కోచింగ్ ఢిల్లీలో బాగుంటుందని అక్కడకు వెళ్లాడు. మంచి బ్రిలియంట్ మావాడు. తప్పకుండా ఐ.ఎ.ఎస్.గా సెలక్టవుతాడు. చిన్నచిన్న ఉద్యోగాలు చెయ్యడం వాడికిష్టం వుండదు. ఒక్క నిమిషం వృథా చెయ్యడు!" అంటూ కొడుకు గురించి గొప్పగా చెప్పుకొచ్చాడు.

ఆయన మాటలు వింటూ వుండిపోయాడు దరహాస్.

"మా ఇంటికోసారి వచ్చి వెళ్లు!" అంటాడేమోననుకున్నాడు దరహాస్. చేతిలోవున్న బ్యాగ్ దరహాస్‌కు ఇచ్చాడు..

పార్కింగ్ స్లాట్ దాకా అతన్ని నడిపించి బ్యాగ్ తీసుకుని కారెక్కి వెళ్లిపోయాడు విఠల్.

'రకరకాల మనుషులుంటారు' అనుకుంటూ షాపింగ్‌మాల్‌లోకి నడిచాడు దరహాస్.

★ ★ ★

రోహిణిని మరోసారి అబార్షన్ చేయించుకోమని చెప్పడంతో "ఇప్పటికే ఓసారి చేయించుకున్నాను కిందటేడు. మళ్లీ చేయించుకోమంటే ఎలా? " అందామె.

"ఇద్దరాడపిల్లల్ని కన్నావ్.. స్కానింగ్‌లో మళ్లీ ఆడపిల్లేనని చెప్పారు. ఇంకా ఆ డమూకని కనేది నా కొంప కొల్లేరు చెయ్యడానికా? నా మాట విని గర్భస్రావం చేయించుకో!" అన్నాడు అనంత్.

"ఆడపిల్లలయితే తల్లిదండ్రులను ఆప్యాయంగా చూసుకుంటారు. మగపిల్లలు తల్లిదండ్రుల్ని పట్టించుకోరు. మనూరి వృద్ధాశ్రమంలోని ముసలివాళ్లు కన్నకొడుకుల నిరాదరణకు గురైనవాళ్లే!" అంది రోహిణి.

అనంత్ తల్లి, అక్క అక్కడికి వచ్చారు. "మాటలతో చెబితే వినదురా! నాలుగు తగిలించు!" అంది అనంత్ తల్లి.

రోహిణి జుట్టు పట్టుకొని లాగి తల వంచి వీపు మీద పిడిగుద్దులు గుద్ది "ఐదో గర్భంలో తప్పకుండా కొడుకు పుడతాడని మా గురువుగారు చెప్పారు. ఈ కడుపు పోగొట్టుకో! మళ్లీ వచ్చే గర్భంలో తప్పకుండా కొడుకు పుడతాడు" అన్నాడు అనంత్.

"మళ్లీ ఆడపిల్ల పుడితేనో"

అనంత్‌కు కోపం తారస్థాయికి చేరుకుంది. అక్కను, అమ్మను రోహిణి చేతులు పట్టుకోమని చెప్పి రోకలిబండ తెచ్చి కడుపు మీద బాదడం మొదలుపెట్టాడు.

"అమ్మా!" బాధతో పెద్దగా అరిచింది.

అప్పుడే రోడ్డుమీద నడుచుకుంటూ వెళ్తున్న అమృతకు ఆ ఆర్తనాదం విన్పించి ఆ ఇంట్లోకి పరుగెత్తింది.

చెరొక చేయి పట్టుకున్న రోహిణి అత్త, ఆడబిడ్డల్ని, మళ్లీ రోకలిబండతో బాదడానికి సిద్ధంగా వున్న భర్తను చూసి "మనుషులా? పశువులా? ఏమిటి మీరు చేస్తున్న పని? " పెద్దగా అరిచింది.

చుట్టుపక్కలవాళ్లు ఆమె అరవడం గమనించి అక్కడకు చేరుకున్నారు. అనంత్ చేతిలోని రోకలిబండను లాక్కుని అతన్ని స్తంభానికి కట్టేశారు. రోహిణిని హాస్పిటల్‌కు తీసుకువెళ్లారు. ఆ దెబ్బలకు కడుపులోని శిశువు చనిపోయింది. వెంటనే ఆపరేషన్‌చేసి కడుపులోని మృతశిశువును బయటకు తీసింది డాక్టర్ ప్రియాంక.

అమృత పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి కంప్లైంట్ ఇచ్చింది.

రోహిణి భర్త, అత్త, ఆడబిడ్డలను పోలీసులు అరెస్ట్ చేసి, కేసు పెట్టారు.

ఆసుపత్రికి రోజూ వెళ్తూనేవుంది అమృత. చికిత్సకయిన ఖర్చు 'జయలక్ష్మి హాస్పిటల్' వాళ్ళే పెట్టుకున్నారు రోహిణి పరిస్థితి చూసి చలించిపోయి.

నెలరోజుల తరువాత ఆసుపత్రి నుంచి డిశ్చార్జ్ అయ్యింది.

ఫ్యాషన్ డిజైనింగ్, టైలరింగ్‌లో రోహి

ణికి శిక్షణ ఇప్పించింది అమృత. ఆ అమ్మాయి తనకాళ్ళ మీద తను నిలబ డేట్లు చేసింది. సంవత్సరం తిరిగేసరికి సొంతంగా బొటిక్ పెట్టుకుంది. తన ఫ్యాషన్ డిజైన్ షాపుకు 'సుగుణ బొటిక్' అని పేరు పెట్టుకుంది.. ఆర్థికసాయం అమృత పినతల్లి చెయ్యడంతో.

★ ★ ★

ఫేస్‌బుక్‌లో అమృత పోస్ట్‌చేసిన రోహి ణి ఫొటో ఆమెపై జరిగిన గృహహింస వివరాలు దరహాస్ చూశాడు.

ఆన్‌లైన్‌లో అమృతతో చాట్ చేస్తూ తన స్పందన తెలియజేశాడు.

"రోహిణిపై జరిగిన గృహహింస చూసేక ఆ రాత్రి నిద్రపట్టలేదు. మన షులు ఆటవిక లక్షణాలు వదిలించుకుని మానవీయ పరిమళాలు వెదజల్లాలి. ఎవరి పరిధిలో వారు ఆపన్నులను ఆదు కోవచ్చునని నిరూపించావు. అది ప్రభు త్వం, పోలీసుల పని అని ప్రేక్షకుడిగా వుండకుండా రోహిణిని కాపాడి సరైన సమయంలో వైద్య సహాయం అందిం చావు. ఆర్థిక పరిపుష్టి కల్గించే ప్రయత్నం చేశావ్. రియల్లీ యూ హేవ్ డన్ గ్రేట్ జాబ్! 'బేటీ బచావో! బేటీ పఢావో!' అంటూ ప్రధానమంత్రి పిలుపునిచ్చారు. ఆడపిల్లలపట్ల వివక్షను సమూలంగా అంతం చెయ్యాలి! జాతి నిర్మాణంలో మగ వారి పాత్ర ఎంత వుందో అంతకంటే ఎక్కువ స్త్రీపాత్ర వుంది. బాలికల పట్ల వివక్ష చూపితే ఆ మనిషిలో మానసిక జాడ్యం వున్నట్లే. మొన్నీమధ్య ప్రసూతి ఆసుపత్రి దగ్గర ఓ సంఘటన జరిగింది. ఓ నడివయసు మహిళ లోపలున్న కూతురి దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నిస్తూ వుంది. ఆసుపత్రివాళ్ళు ఆమెకు గేట్‌పాస్ ఇచ్చారు. అది ఆమె పారేసుకుంది. యాభై రూపాయలిస్తేగాని ఆవిడను లోపలికి వెళ్ళనివ్వలేదు. ఆమె కూతురు ఆడపిల్లను కన్నది. ఆడపిల్లను ఎత్తుకుని అత్తగారిం టికి వెళ్తే తనకెదురయ్యే గడ్డుపరిస్థితిని ఊహించుకుంటూ వుంది ఆ పెద్దావిడ కూతురు. బిడ్డ పుట్టిందన్న సంతోషం లేదాఅమ్మాయిలో. ఆసుపత్రి సిబ్బంది వెయ్యిరూపాయిలు అడగ్గా 'గవర్నమెంటు ఆసుపత్రిలో అంతా ఉచితమే గదా!' అందామె.

'ఇంకానయం ఆడపిల్ల పుట్టింది కాబట్టి తక్కువ తీసుకుంటున్నాం! అదే మగపిల్లా డైతే పదిహేనొందలు వసూలు చేసే వాళ్ళం!" అంది ఆయా.

బయటకు వచ్చేక ఆ గోడం తా నాద గ్గర వెళ్ళబోసుకున్నారు.

అంతెందుకు, బిడ్డ చనిపోయి బయటకు తీసుకెళ్ళాలన్నా లంచం ఇవ్వాల్సిందే! అదీ ఇక్కడి దవాఖానాల పరిస్థితి.."

అమృత సమాధానం ఇచ్చింది.

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం! 'బేటీ బచావో.. బేటీ పఢావో!' కార్యక్రమం సక్ర మంగా అమలుజరిగితే ఆడపిల్లలకు కొండంత బలం చేకూరుతుంది. భారత దేశం భవిత మహిళల భద్రతమీదే ఆధా రపడివుంది. స్లోగన్లకే పరిమితం కాకూ డదు. ఆచరణలో వుండాలి!

ఇల్లు అంటే నాలుగ్గోడల మధ్యనున్న ఇల్లుకాదు. చుట్టూ వున్న విశాల ప్రపంచం! వసుధైక కుటుంబం! అందుకే 'సర్వేజనా సుఖినోభవంతు!' అన్నారు పెద్దలు. 'స్వచ్ఛ భారత్' కూడ గొప్ప కార్య క్రమం. పరిశుభ్రత లేనిచోట అత్తర్లు, పెర్ ఫ్యూమ్‌లు వెదజల్లినా ప్రయోజనం వుండదు. పరిసరాలు శుభ్రంగా వుండాలి! అప్పుడే వ్యాధులు దూరంగా పారిపోతా యి. మనూళ్ళో యువత చీపుర్లు పట్టుకుని స్వచ్ఛభారత్‌కు మేముసైతం అంటూ వీధు లన్నీ ఊడ్చారు. అమ్మాయిలు, అబ్బాయిలు చీపుర్లు, తట్టలు పట్టుకుని ఉత్సాహంగా ఊళ్ళో కదం తొక్కుతుంటే మనసు పులక

రించింది. కాలేజ్ అమ్మాయిలు, అబ్బాయిల్ని లీడ్ చేసింది మీ చెల్లెలు లాలిత్య! అందరూ మెచ్చుకున్నారు లాలిత్యను"

"వెరీగుడ్.. గుడ్ గోయింగ్!" అంటూ ముగించాడు దరహాస్ చాటింగ్‌ను.




**శి**వయ్య తమిళనాడు వచ్చి పదేళ్ళవుతూ వుంది.

మొదట్లో కోయంబత్తూరులో వుండేవాడు. తరువాత చెన్నై వచ్చాడు. చెన్నైలో మూడు హోటళ్ళున్నాయి. కొత్తూరులో పెద్ద భవంతి వుంది.

సాయంత్రం భార్యాభర్తలు ఇంటిముందున్న పచ్చటిలాన్‌లో కుర్చీల్లో కూర్చున్నారు. పనిమనిషి ట్రేలో వేడి పాలున్న పింగాణీజగ్, కాఫీ డికాషన్, పంచదార వున్న పింగాణీ పాత్రలు తెచ్చి వాళ్ళముందున్న టీపాయ్ మీద పెట్టింది. కాఫీ కలిపి భర్తకిచ్చింది రమణి. ఆమె అతని రెండో భార్య.

వాళ్ళిద్దరిదీ పొన్నూరుదగ్గర చెరుకుపల్లి. అక్కడినుంచి పారిపోయి కోయంబత్తూరు చేరుకున్నారు. రోడ్డుపక్కన టీస్టాల్ పెట్టుకున్నారు. బాగానే నడిచింది. వచ్చిన లాభాలతో చిన్నహోటల్ కొనుక్కున్నారు. ఆ హోటల్ పెద్దదయింది. అక్కడినుంచి మకాం మార్చి చెన్నై వచ్చేశారు. కొత్తూరులో ముందు ఓ హోటల్ పెట్టారు. మంచిపేరు, లాభాలు రావడంతో మరో రెండుచోట్ల హోటళ్ళు నడుపుతున్నారు.

చెరుకుపల్లినుంచి తమిళనాడు పారిపోయి రావడానికి బలమైన కారణం వుంది. రమణిని భార్యగా స్వీకరించడానికి ముందే శివయ్యకు పెళ్లయింది. భార్యాభర్తలిద్దరూ చిన్నచిన్న పనులు చేస్తూ బతుకుబండి నెట్టుకొస్తున్నారు. ఆ జీవితం వెగటుపుట్టింది శివయ్యకు. అదే సమయంలో శివయ్య ప్రేమలో పడింది రమణి. పెళ్ళయినవాడితో తిరగడం ఏమిటని రమణిని చావబాదాడు ఆమె తండ్రి.

శివయ్య భార్య గర్భవతి అయ్యింది. 'మనం బతకడమే కష్టంగా వుంది. పైగా పుట్టబోయేది ఆడబిడ్డ! కడుపు తీయించేసుకో! అన్నాడు భార్యతో. ఆమె అతని మాట విన్లేదు.

రమణి నగలమూటతో శివయ్య దగ్గరికొచ్చింది. మనమిక్కడ సుఖపడలేం! దూరంగా వెళ్ళిపోదాం! ఏదోక వ్యాపారం చేసుకుని బతుకుదాం? " అంది.

రమణిమీద మోజులో వున్నాడతను. గర్భవతి అయిన భార్యకు తోడుగా తనుండాలన్న బాధ్యత మర్చిపోయి రమణిని తీసుకుని కోయంబత్తూరు చేరుకున్నాడు.

"వారం రోజుల్నుంచి హాస్పిటల్‌చుట్టూ తిరుగుతూ వున్నావుగదా! ఏమంది లేడీ డాక్టరు? " అడిగాడు శివయ్య కాఫీ తాగుతూ.

"పిల్లలు పుట్టే అవకాశమే లేదని చెప్పేసింది" అంది దిగులుగా

"పిల్లల్లేకపోతేనేం? నువ్వేనాకు చిన్నపిల్లగా కన్పిస్తావ్. మనిద్దరం ఒకరికొకరు తోడు.. బాధపడాల్సిన అవసరంలేదు" అన్నాడతను.

"పిల్లల్లేకుండా ముందు ముందు రోజులెలా గడుస్తాయి? బంధువులందర్నీ వదులుకుని దూ రంగా వచ్చేశా! 'అమ్మా' అని పిలుస్తూ ఇంట్లో పిల్లలు తిరిగితేనే సందడి" చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ

## కొత్తగాలి...

**మొక్కకి**
**ఎవరైనా మొక్కాలి!**
**అదే భవిష్యత్తుకు**
**చుక్కాని!**

– కె. ఎన్నార్ నమ్మి,
మార్టేరు, ప.గో. జిల్లా

అందామె.

ఆమెకు దగ్గరగా కుర్చీలాక్కుని ఆమె భుజం నిమురుతూ "అనాథాశ్రమం నుంచి ఓ పసిబిడ్డను తెచ్చుకుని దత్తత తీసుకుందామా? " అనునయించబోయాడు.

ఆమెకేదో గుర్తుకొచ్చి "నీ మొదటి భార్య మనం అక్కడి నుంచి వచ్చేటప్పుడు గర్భవతి.. ఆడపిల్ల పుట్టేక చనిపోయిందని, ఆ పాపను ఆమె స్నేహితురాలు పెంచుకుంటున్నదని అక్కడ నుంచి వచ్చిన ఓ పెద్దాయిన చెప్పాడు గుర్తుందా? " అనడిగింది.

'గుర్తులేకపోవడం ఏమిటి? ఆమెకు చేసిన ద్రోహం తనను పట్టి పీడిస్తూనే వుంది. పాపను చూడాలని అన్పించినా, పాపను చూడటానికి వెళ్తే రమణి ఏమంటుందోనన్న భయం. మరోపక్క వ్యాపారంలో తలమునకలై వున్నాడాయె' అనుకుని "ఎందుకు గుర్తులేదు? పాపకు పదేళ్ళు వచ్చివుంటాయిప్పుడు" అన్నాడు.

"ఆ పాపను తెచ్చుకుని పెంచుకుంటే ఎలా వుంటుంది? మీ కూతురయితే నా కూతురు కాదా? సొంత కూతురికంటే ఎక్కువ మురిపెంతో పెంచుకుంటాను. ప్రాణంకంటే ఎక్కువగా చూసుకుంటాను. పాపను తీసుకొచ్చేయండి!" అందామె.

'ముద్దొచ్చినప్పుడే చంక ఎక్కాలంటారు. ఇప్పుడు పాపమీద గాలిమళ్ళింది. తెచ్చి పెంచుకుందామంటున్నది. పిల్లలు పుట్టే అవకాశం వుంటే పాపసంగతి ఆలోచించేది కాదేమో. అయినా ఆమెను అనుకోవడం పెద్దతప్పు. కన్నతండ్రి అయ్యుండి తనకే లేకపోయింది. కసాయివాడిలా అమాయకురాలైన వాసంతిని వదిలి వచ్చేశాడు రమణి మీద వ్యామోహంతో. ఇప్పుడా తప్పును సరిదిద్దుకునే అవకాశం వచ్చింది' అంటూ ఆలోచనల్లో మునిగిపోయాడు

"ఏమిటి ఆలోచిస్తున్నారు? రేపే పొన్నూరు వెళ్ళండి. ఎల్లుండి పాపను తీసుకుని వచ్చేయాలి! ఆ పాప తో 'అమ్మ' అని పిలిపించుకోవాలని వుంది నాకు!" అందామె.

"అలాగేలే! రేపే బయల్దేరుతాను. నువ్వు కూడా రారాదూ! మీ అమ్మానాన్నల్ని చూసినట్లుంటుంది"

"మనకు, వాళ్ళకు బంధాలు తెగిపోయి పదేళ్ళు అవుతోంది. నేను కన్పిస్తే మా నాన్న కోపంతో నరికిపోగులు పెడతాడేమో! ఇప్పుడు వాళ్ళు నా గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలి! మీరే చెరుకుపల్లి వెళ్ళి మా అమ్మానాన్నల్ని పలకరించండి! వాళ్ళేమంటారో చూసి అప్పుడు అక్కడికెళ్ళే ఆలోచన చేస్తాను. ముందు మీరు వెళ్ళి రండి!" అందామె.

"వాళ్ళు పాపను నాతో పంపకపోతే? "

"ఎందుకు పంపరూ? వాళ్ళేం ఆస్తిపాస్తులున్నవాళ్ళు కాదు. పాపని వదిలించుకోవాలనే చూస్తారు. మనమిప్పుడు సంపన్నులమని తెలిస్తే ఎగిరి గంతేసి పాపను మీకు అప్పగిస్తారు. కాస్తోకూస్తో ఆర్థికసాయం చేయండి వాళ్ళకు. మీకు అడుగులకు మడుగులొత్తుతారు. చెప్పినట్లు వింటారు" అంది రమణి.

"అలాగే!" తలూపేడు శివయ్య.

★ ★ ★

ఇంటిముందు కూర్చుని సంపూర్ణచేత జడవేయించుకుంటూ వుంది హరిత.

అద్దంలో తన ప్రతిబింబం చూసి నవ్వు

కోవడం చూసి, "ఎందుకే నవ్వుతున్నావ్? " అనడిగింది హరిత జుట్టు వెనక్కు లాగుతూ.

"అక్కకంటే నేనే అందంగా వుంటానట"

"ఎవరన్నారు? "

"బాపయ్యతాత"

నవ్వుకుంది సంపూర్ణ.

ఇంటి ముందు కారు ఆగడంతో తలెత్తి చూసిన హరిత, "ఎవరో మనింటికే వస్తున్నారు" అంది కారుదిగి ఇంటివైపు వస్తున్న వ్యక్తిని చూసి.

అతనెవరో గుర్తుకురాలేదు సంపూర్ణకు. వేరే ఇంటికెళ్ళబోయి పొరపాటున తమ ఇంటివైపు వస్తున్నాడేమోననుకుని, "ఎవరు కావాలండీ? " అనడిగింది.

అతను దగ్గరకు వచ్చేక గుర్తుపట్టి "నువ్వు.. వాసంతి భర్తవి కదూ!" అంది.

'ఎందుకొచ్చాడు? వాసంతికి అంత అన్యాయం చేసినవాడు ఏ మొహం పెట్టుకుని వచ్చాడు? ఊళ్ళో అతని బంధువులు వున్నారు. వాళ్ళు చెప్పారేమో కూతురిక్కడుందని.. హరితను తీసుకెళ్ళడానికి వచ్చాడా? మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుని ఎక్కడో తమిళనాడులో వున్నాడని వింది. హరితను తీసుకువెళ్తే సవతి తల్లి ఊరుకుంటుందా? రాచిరంపాన పెట్టదూ? ఇతనొచ్చి అనవసరమైన ఆందోళన కల్గించాడే! హరిత తనను, కోటిని తల్లిదండ్రులనే అనుకుంటున్నది.. కాదని తెలిస్తే తల్లడిల్లిపోతుందేమో...'

హరితవైపు చూస్తూ వుండిపోయాడతను. వాసంతి పోలికలు కొట్టొచ్చినట్లు కన్పించేయి.

"నీపేరేంటి పాపా? "

"హరిత"

'ఎంత ముద్దొస్తున్నది' అనుకుని పాప బుగ్గలు నిమిరాడు.

కారు డ్రైవరు బిస్కెట్స్, చాక్‌లెట్స్ ప్యాకెట్లు తెచ్చి ఓనరుగారికిచ్చాడు.

"నువ్వెళ్ళి ఊళ్ళో ఏదోక హోటల్లో నీకు నచ్చినవి తిను.. కార్లోనే రెస్ట్ తీసుకో!" జేబులోంచి వెయ్యిరూపాయల నోటు తీసి డ్రైవరుకు ఇచ్చాడు.

శివయ్య చేతి వేళ్ళకున్న బంగారపు ఉంగరాలను చూసింది. మెళ్ళో మెరుస్తున్న గొలుసుమీద కూడా సంపూర్ణ దృష్టి పడింది. పదేళ్ళకిందట చిరిగిన దుస్తులతో పొలం పనులకు వెళ్ళేవాడు శివయ్య.

"కోటిగారికి యాక్సిడెంట్ అయ్యిందటగా, ఎలా వున్నారు? " అడిగాడు శివయ్య.

ఏం మాట్లాడకుండా లోపలికి నడిచింది సంపూర్ణ.

తన చేతిలోని ప్యాకెట్లు హరితకు ఇవ్వబోగా "వద్దు!" అంటూ సంపూర్ణ వెనుకే లోపలికి పరుగెత్తింది హరిత.

'కూతురు తనని పరాయివ్యక్తి అనుకుంటోంది. నేన్నీ తండ్రినని చెప్పుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది..' అనుకుని అక్కడే నిలబడిపోయాడు. లోపలికి రమ్మని ఎవరూ చెప్పలేదు.

హాల్లో పడుకున్న కోటికి శివయ్య వచ్చినట్లు చెప్పింది సంపూర్ణ.

"బయటే నిలబెట్టేశావేం? లోపలికి రమ్మను. అతనెలాంటివాడైనా కన్నకూతుర్ని చూడటానికి వచ్చేడు. మా ఇంటికి రావొద్దని అనలేం కదా!" అన్నాడు కోటి.

మెల్లగా అవస్థపడుతూ లేచి కూర్చున్నాడు కోటి.

"రండి! లోపలికి రండి!" అంది సంపూర్ణ గుమ్మం దగ్గరకు వెళ్ళి.

చేతిలోని ప్యాకెట్లు బల్లమీద పెట్టి కోటి కూర్చున్నవైపు వెళ్ళాడు.

కుర్చీ తెచ్చి కోటిమంచం దగ్గర వేసింది.

"ఎలావుంది మీకు? గాయాలు మానిపోయాయా? " అడిగాడు కోటిని.

"చాలావరకు మానిపోయాయి. లేచి నిలబడగల్గుతున్నాను. మామూలుగా నడవటానికి మరో రెండు నెలలు పట్టొచ్చు!"

## కొత్తగాలి...

**వటపత్రశాయికి**
**వరహాల లాలి!**
**వరకట్న సాయికి**
**కొరడాల లాలి!**

– ముడుంబ సీత,
భద్రాచలం

అన్నాడు కోటి.

వాసంతి, సంపూర్ణ ఎంతో సన్నిహితంగా వుండేవాళ్ళు. కోటితో కూడా మాట్లాడేవాడు శివయ్య. ఇద్దరూ కలిసి అప్పుడప్పుడూ సినిమాలకు వెళ్ళేవాళ్ళు. పాత పరిచయం ఉండటంతో వాళ్ళిద్దరూ మామూలుగా మాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

హరితకు బిస్కెట్ ప్యాకెట్ తీసిచ్చింది. అది పట్టుకుని బయటకు పరుగెత్తింది.

"వాసంతిని వదిలేసి వెళ్ళిపోవడం పొరపాటే! చెరుకుపల్లి అమ్మాయిని పెళ్ళి చేసుకుని చెన్నైలో సెటిలయ్యాను. సొంతంగా మూడు హోటళ్ళున్నాయి. బాగానే సంపాదించాను. పిల్లల్లేరు.." తన గురించి అన్ని వివరాలు చెప్పేశాడు శివయ్య. 'వచ్చిన వెంటనే నా కూతుర్ని తీసుకువెళ్ళిపోతాను అంటే ఏమనుకుంటారో! మరుసటిరోజు చెప్పొచ్చులే!' అనుకున్నాడు. ఊళ్ళో విషయాలు మాట్లాడుకోవడం మొదలుపెట్టారు వాళ్ళిద్దరూ.

"వంటపని చూడు. శివయ్య కూడా భోజనం చేస్తాడు" అన్నాడు కోటి.

వంటగదిలోకి వెళ్ళి కూరగాయలు తరగడం మొదలుపెట్టింది.

హరిత నాలుగైదుసార్లు లోపలికి వచ్చింది కానీ, అతను పిలిచినా దగ్గరకు వెళ్ళలేదు. దూరం నుంచే చూస్తూ ఉంది.

ఇంతలో లాలిత్య వచ్చింది. కూతుర్ని పక్కకు తీసుకువెళ్ళి శివయ్య గురించి చెప్పింది సంపూర్ణ.

"చదువుకుంటున్నావా? " లాలిత్యను అడిగాడు శివయ్య.

"మా పెద్దమ్మాయి, పేరు లాలిత్య.. డిగ్రీ పూర్తి చేసి నర్సు ట్రైనింగ్‌కు వెళ్తా వుంది" అన్నాడు కోటి.

"మీకు ఓ అబ్బాయి, ఓ అమ్మాయే గా? " అనుమానం వచ్చి అడిగాడు.

"ఇద్దరమ్మాయిలు. పెద్దది లాలిత్య, రెండోది హరిత. అబ్బాయి దరహాస్ ప్రస్తుతం హైద్రాబాద్‌లో ఏవో పరీక్షలు రాస్తున్నాడు, అవి అయిపోయేక వచ్చేస్తాడు"

హరితను వాళ్ళమ్మాయని కోటి అన్నందుకు నొచ్చుకున్నాడు శివయ్య.

"హరితను నాతో పంపండి! మాకు పెద్ద మేడ వుంది. లక్షలకు లక్షల డబ్బుంది. ఇంట్లో నేనూ, మా ఆవిడే వుండేది. హరితకు ఏ లోటూ రాకుండా చూస్తాం! బాగా చదివించి మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాం!" అన్నాడు శివయ్య తను వచ్చిన పని మెల్లగా వెల్లడించే ప్రయత్నం చేస్తూ.

గట్టిగా అడిగి తీసుకువెళ్ళలేని పరిస్థితి. హరిత మీ అమ్మాయే అయితే తల్లి గర్భంలో వుండగానే వదిలేసి ఎలా వెళ్ళావ్? పదేళ్ళలో ఒక్కసారన్నా వచ్చి కూతుర్ని పలకరించావా? ఇప్పుడు వల్లమాలిన ప్రేమ ఎలా ముంచుకొచ్చిందంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తే తనేం సమాధానం చెప్పగలుగుతాడు. సామరస్యంగా చెప్పి హరితను తీసుకెళ్ళాల్సిందేగాని బలవంతంగా తీసుకువెళ్ళలేని పరిస్థితి. తన దగ్గర ఒక్క సాక్ష్యంలేదు. వాసంతిని పెళ్ళి చేసుకున్నప్పుడు తీసిన ఫొటో లేదు. గుళ్ళో పూజారి ముందు దండలు మార్చుకున్నారు. కోటి, అతని భార్యకు తప్పితే హరిత తన కూతురని ఎవరికీ తెలియదు. ఒకరిద్దరు బంధువులకు తెలుసుగానీ వాళ్ళు కలుగజేసుకుని పాపను తనతో

పంపించే ప్రయత్నం చేయరు. వాళ్ళోసారి చెన్నై వస్తే ఆర్థికసాయం చెయ్యలేదని తన మీద గుర్రుగా వున్నారు.

కోటి ఎటువంటి సమాధానం చెప్ప కుండా మౌనంగా వుండిపోయాడు.

వచ్చిన వెంటనే ఆ ప్రస్తావన తెచ్చి పొర పాటు చేశాననుకున్నాడు శివయ్య.

వంటింట్లోంచి బంగాళాదుంపల వేపుడు, సాంబారు వాసనలు వస్తున్నాయి. రెండు అప్పడాలుంటే వేయించింది.

హరిత ఓ అప్పడం తినేసింది. మరో అప్పడం తీసుకోబోతే "మనింటికి చుట్టం వచ్చాడుగా! అతనికి ఆ అప్పడం" అంది సంపూర్ణ.

"ఎవరతను? నన్ను దగ్గరకు రమ్మన్నాడు గానీ వెళ్ళలేదు" అంది హరిత.

"ప్రేమగా పిలిస్తే దగ్గరకు వెళ్ళాలిగదా! ఈసారి పిలిస్తే ఆయన పక్కన కూర్చుని కాసేపు కబుర్లు చెప్పు! సంతోషపడతాడు!" అందామె.. అతనెవరో? హరితకు ఏమవుతాడో? చెప్పకుండా.

చిన్నారి హరితవైపే చూస్తూ వుండిపోయాడు శివయ్య.

పెద్దవాళ్ళతో పాటు ఆ పాప కూడ ఇంట్లో పనులు చేయడం అతనికి ఆశ్చర్యమేసింది. తన కుర్చీ దగ్గరకు వచ్చినప్పుడు "నాతో మాట్లాడవా? " అనడిగాడు.

అతని దగ్గరకెళ్ళి నిలబడింది హరిత.

దగ్గరకు తీసుకుని తల నిమిరాడు. కళ్లు చెమ్మగిల్లాయి.

"నీ దగ్గర చెమట వాసన.. స్నానం చేయొచ్చుగదా!"

"బాత్‌రూం ఎక్కడో చూపించు! స్నానం చేస్తాడు.. టవల్ ఇవ్వు? " అన్నాడు కోటి.

టవల్ తెచ్చి శివయ్యకు ఇచ్చింది.

"నా బంగారు తల్లి" అన్నాడు మురిపెంగా హరిత చేతులు తన చెంపలకు హత్తుకుని. మనసంతా పులకరించి పోతోంది కూతుర్ని చూస్తూంటే!

"గడ్డం గుచ్చుకుంటున్నది" అంది అతని చేతులు విదిలించుకుని సంపూర్ణ దగ్గరకు పరుగెత్తుతూ.

పాప మాటలకు నవ్వుకున్నాడు.

అతను స్నానం చేయగానే హాల్లోనే పీట వేసింది హరిత. మంచినీళ్ళ గ్లాసు తెచ్చి అతని ముందుచింది. కూరలు కూడా తానే వడ్డిస్తానంది గానీ "పడేస్తావ్.. నువ్వొద్దులే!" అని సంపూర్ణ అనగానే పక్కన నిలబడింది.

అతనికి చెప్పకుండానే డ్రైవర్ స్నానానికి ఏర్పాట్లు చేయడం, భోజనం వడ్డించడం చూసి శివయ్య ఆశ్చర్యపోయాడు. వాళ్ళ మంచితనానికి కరిగిపోయాడు. తనంటే సదభిప్రాయం లేకపోయినప్పటికీ మర్యాద లన్నీ చేసుకుపోతున్నారు.

ఆరాత్రి డ్రైవర్ కారులోనే పడుకున్నాడు.

లోపల గదిలో లాలిత్య, హరిత పడుకున్నారు. హాల్లో ఓ పక్కన కోటి మంచం, పక్కనే చాప పరుచుకుని సంపూర్ణ పడుకుంది. మరోపక్కన శివయ్య మంచం మీద పడుకున్నాడు.

శివయ్యకు బాగానే నిద్ర పట్టింది. ఎవరో సన్నగా ఏడుస్తున్నట్లు అన్పించి మెలకువ వచ్చి, తల పక్కకు తిప్పాడు. బెడ్‌లైట్ మసక వెలుగులో కోటి.. సంపూర్ణను ఓదార్చడం గమనించాడు.

"మనమేం చేస్తాం! పట్టుబడితే అతనితో హరితను పంపించక తప్పదు! మనది పెంచిన ప్రేమ. కన్న కూతురిపై అతనికీ మమకారం వుంటుంది కదా! గట్టిగా కాదనలేం" మెల్లగా అంటున్నాడు కోటి.

ఆమె లేచి లాలిత్య, హరిత పడుకున్న గదిలోకి వెళ్లి వెంటనే వచ్చేసింది.

"గదిలోకి వెళ్ళావెందుకు? "

"నిండా కప్పిన దుప్పటిని నిద్రలో కాళ్ల తో తన్నేయడం హరిత అలవాటు. చలికి తట్టుకోలేదు. అందుకే లోపలికెళ్లి దుప్పటి కప్పి వస్తున్నాను" అంది సంపూర్ణ.



ఆ మాటలూ వినిపించాయి శివయ్యకు.

ఓ రాత్రివేళ హరిత తడుముకుంటూ గదిలోంచి బయటకొచ్చి, సంపూర్ణ ఎక్కడ పడుకుందో చూసి, గువ్వపిట్టలా ఆమె పక్కన పడుకుంది.

"నిన్నొదలదు.. రాత్రిళ్లు రోజూ నీ పక్కనే పడుకోవాలి" అన్నాడు కోటి.

★ ★ ★

ఉదయం ఆరింటికి శివయ్యకు మెలకువ వచ్చింది. మొహం కడుక్కుని వాకిట్లోకి వచ్చాడు.

సంపూర్ణ కాఫీ కప్పు తెచ్చి ఇచ్చింది. కాఫీ తాగుతుంటే ఇంటి ముందు ముగ్గుల చుట్టూ గంతులేస్తున్న హరిత కన్పించింది. పూలమొక్కల దగ్గర కూర్చుని పాదులు సరిచేస్తున్నది లాలిత్య.

ఎక్కడినుంచో రామచిలుక వచ్చి హరిత భుజంమీద వాలింది. నవ్వుకుంటూ దాని రెక్కలను సుతారంగా నిమిరింది. అది భుజం మీది నుంచి ఎగిరి తలమీద చేరింది.

లాలిత్య చిన్నప్లేటులో పాలు తెచ్చి అక్కడ పెట్టింది. ప్లేటు దగ్గర వాలి పదు



నుగా వున్న ముక్కు పైభాగాన్ని ప్లేటులో వుంచి కింది భాగం ముక్కును కదిలిస్తూ జుర్రుకుంది పాలను.

ఆ దృశ్యాన్ని విచిత్రంగా చూస్తూ వుండిపోయాడు శివయ్య. రామచిలుక బెదిరిపోకుండా హరిత భుజం మీద చేరడం ఆశ్చర్యం అన్పించింది. కాసేపక్కడే తిరిగి ఎగిరిపోయింది. మళ్లీ కన్పించలేదు.

“పెంపుడు రామచిలుకా అది?” లాలిత్యను అడిగాడు.

ఇంటి వెనుక వైపు తాడిచెట్టు దగ్గరకు తీసుకువెళ్లింది. తాడిచెట్టు పైభాగం బోదెలోంచి రామచిలుకలు బయటకు రావడం చూశాడు. తాడిచెట్టు బోదెను చేతితో తట్టాడు. చాలా గట్టిగా తగిలింది. ‘రామచిలుకలు లోపలికెలా వెళ్లాయి? చెట్టుకు కంత పెట్టడానికి వీలుగా వుండవే వాటి ముక్కులు?’ అనుకుని ఆ విషయమే లాలిత్యను అడిగాడు.

“వడ్రంగిపిట్ట బోదెలో మెత్తటి భాగాన్ని గమనించి ముక్కుతో తొలిచి కంత చేసి లోపలికి దూరి పురుగుల్ని, క్రిముల్ని ఏరుకుని తింటుంది. అదే రామచిలుకలకు గూడు అయ్యింది. నెలరోజుల కిందట ఓ చిన్న రామచిలుక గూట్లోంచి కిందకు జారిపడింది. దానికి రెక్కలు రాలేదు. వారం రోజులు పాలు తాగించాం.

తరువాత అరటికాయ ముక్కలు పెట్టాం. రెండు నెలల తరువాత ఎగరడం మొదలుపెట్టింది. అప్పుడప్పుడు ఇలా పలకరించి పోతుంటుంది” అంటూ లాలిత్య ఆ రామచిలుక గురించి వివరించింది.

తాటాకుల చివర్లో వేలాడుతున్న గూళ్లు కన్పించాయి. ఆ గూళ్లల్లో చిన్న చిన్న పక్షులు దూరి బయటకు రావడం చూసి “అవేం పక్షులు?” అనడిగాడు శివయ్య.

“వీవర్ బర్డ్స్ అవి. ఇప్పుడు చెట్లు కొట్టేస్తున్నారు. పక్షులు కన్పించడంలేదు. మొన్నొకాయన వచ్చి తాడిచెట్టు బోదె కావాలి.. చెట్టు కొట్టేసి పట్టుకుపోతానంటే మేం వద్దన్నాం!”

హరిత చుట్టూ రెండు సీతాకోకచిలుకలు ఒకదాని వెంట మరొకటి తిరుగుతున్నాయి. వాటిని అదిలించకుండా, రెప్ప వాల్చకుండా చూస్తున్నది. ఆ క్షణంలో అన్పించింది శివయ్యకు- ‘ఆహ్లాదకరమైన వాతావరణంలో రామచిలుకలా, సీతాకోకచిలుకలా ఆడుకునే హరితను పట్నం తీసుకువెళ్లి భవనంలో బంధించడం ఎందుకు? స్వేచ్ఛగా ఎగిరే పిట్టను బంగారు పంజ

రంలో బిగించడం ఎందుకు? రాత్రిపూట కాస్త దుప్పటి చెదిరితేనే ఆ తల్లి హరిత దగ్గరికెళ్లి నిండుగా దుప్పటి కప్పింది చలికి తట్టుకోలేదని. తన భార్య అలా చేయగలదా? మమతానురాగాలు వెల్లివిరిసే ఈ పొదరింటి నుంచి హరితను తీసుకువెళ్లడం ఎందుకు?' అనుకుని ఇంట్లోకి వచ్చాడు. గట్టి నిర్ణయానికొచ్చి సంపూర్ణను పిలిచి కోటిదగ్గర కూర్చోమన్నాడు.

"మీరెంతో ప్రేమగా హరితను పెంచుకుంటున్నారు. మీలా చూసుకోవడం మావల్ల కాదు. నేను వ్యాపారం గొడవల్లో తిరుగుతూవుంటాను. మా ఆవిడ ఎప్పుడూ తలనొప్పి అంటూ వుంటుంది. కీళ్ల నొప్పులని మంచం దిగదు. ఇక పాప బాగోగులేం చూడగలుగుతాం? మీ బ్యాంకు ఎకౌంట్ నంబరు చెబితే, డబ్బు మీ ఖాతాలో జమచేస్తూంటాను. నేను, మా ఆవిడ అప్పుడప్పుడూ వచ్చి చూసివెళ్తుంటాం! హరిత ఎప్పటికీ మీ అమ్మాయే! పచ్చని కుటుంబంలో దానికి చోటు దొరకడం అదృష్టమే!" అన్నాడతను.

లాలిత్య, హరితలను సెంటర్‌కు తీసుకెళ్లి కొత్తబట్టలు కొనిపెట్టాడు. సాయంత్రం వరకూ అక్కడే వుండి తిరుగు ప్రయాణం అయ్యాడు శివయ్య.

★ ★ ★

విరల్, అనసూయ పొన్నూరొచ్చారు.

"మొన్న సివిల్స్ రాత పరీక్షలు జరిగేయి కదా! అన్నయ్య బాగా రాశాడా?" అడిగింది అమృత తల్లిని.

"బాగానే రాశానన్నాడు. వాడి ధ్యాస ఈ మధ్య సినిమాల మీదకు మళ్ళింది. సినిమా హీరో కావాలని ప్రయత్నం చేస్తున్నాడు" అంది అనసూయ.

"ఏదైనా పట్టుదల ఉండాలి! అన్నయ్యకు కుదురు తక్కువ. కొన్నాళ్లు ఐ.ఎ.యస్. ఆఫీసర్ కావాలనుకుంటాడు. కొన్నాళ్లు క్రికెట్ ప్లేయర్ కావాలని ప్లేగ్రౌండ్ చుట్టూ తిరిగాడు. దరహాస్ చూడు ఎంత పట్టుదలగా చదువుతున్నాడో? సివిల్స్ నెగ్గుకొస్తాడని నాకు గట్టి నమ్మకం ఉంది" అంది అమృత.

దరహాస్‌ను కూతురు పొగడటం, వికాస్‌ను ఎందుకూ పనికిరానివాడన్నట్లు మాట్లాడటం నచ్చలేదు. వీళ్ల మధ్య ఏదన్నా ఎఫైర్ నడుస్తున్నదా అని అనుమానం వచ్చిందామెకు దరహాస్‌తో చాట్ చేస్తున్నట్లు అమృతే చెప్పింది. వాడితో కబుర్లేమిటి? ఆ చాటింగ్ వివరాలు చూడాలనుకుని "నీ పాస్‌వర్డ్ చెప్పు!" అంది కూతురితో.

"ఎందుకు? ఫ్రెండ్స్‌తో ఫోన్లో మాట్లాడుతూ వుంటాను. సోషల్ మీడియాలో చాట్ చేస్తూ వుంటాను. నువ్వు ప్రత్యేకంగా చూడాల్సినవి ఏమీ లేవు.. దాచుకోవాల్సిన రహస్యాలు నా దగ్గరేమీ లేవు"

"అయితే పాస్‌వర్డ్ చెప్పడానికెందుకు సందేహిస్తున్నావు? సరదాగా నీ ఫేస్‌బుక్‌లోకి తొంగి చూడాలనుకుంటున్నాను"

'మామూలుగా అమ్మ తన విషయాలు పట్టించుకోదు. మహిళామండలిలో చురుగ్గా వుంటుంది. పెద్దపెద్దవాళ్లతో పరిచయాలున్నాయి. అమ్మది సంకుచితమైన మనసేమీ కాదు. చిన్ని విషయంలోనే అనవసరంగా నోరు పారేసుకుంటుందిగానీ ఇంకెవరితోనూ పోట్లాట పెట్టుకోదు!' అని మనసులో అనుకుని "మా ఫ్రెండ్స్ తమ భావాలను నాతో పంచుకుంటారు. వాళ్లకు నచ్చిన దృశ్యాలు, ఫొటోలు పోస్ట్ చేస్తూంటారు. అవన్నీ నువ్వు చూడటం ఏమిటి? అవి మా పర్సనల్ మేటర్స్"

"నీ ఫ్రెండ్స్‌లో మగవాళ్లు కూడా వున్నారా?" అడిగింది అనసూయ.

"ఎందుకు వుండరు? నేను చదువుకున్నవన్నీ కో-ఎడ్యుకేషన్ కాలేజీలే!"

"వాళ్లు నీతో ఏం చాట్ చేస్తూంటారో నేను చూడాలి" పట్టుబట్టింది.

"ఇప్పుడు నీకు పాస్‌వర్డ్ ఇస్తాను.

నువ్వు నేనేం చాట్ చేశానో చూస్తావ్. ఆ తరువాత పాస్‌వర్డ్ మార్చేస్తాను. అప్పుడేం చేస్తావ్? " అడిగింది అమృత.

తన పాస్‌వర్డ్ తల్లికి ఇవ్వడం నచ్చక వాదనకు దిగింది.

"ముందు పాస్‌వర్డ్ చెప్పు" పెద్దగా అరిచింది అనసూయ కంప్యూటర్ ముందు కూర్చుని. తల్లికి కోపం వచ్చిందని అర్థమై పాస్‌వర్డ్ చెప్పింది.

అనసూయ నెట్ ఓపెన్ చేసింది. కూతురు చాట్ చేసిన వివరాలన్నీ ఓపిగ్గా చూసింది. ముఖ్యంగా దరహాస్‌తో జరిపిన సంభాషణలు చదివింది. ఎక్కడా అభ్యంతరకరమైన, అసభ్యమైన విషయాలేవీ లేవు. సమాజంలోని పరిస్థితులు, జీవిత సత్యాలు వున్నాయి. తన కూతురు, దరహాస్ పరిణతి చెందినవాళ్లలా కన్పించారు. తప్పుపట్టే విషయమేదీ లేదు. తొందరపడి కూతుర్ని అనుమానించాననుకుని "ఐయామ్ సారీ!" అంది కూతురి బుగ్గలు నొక్కి.

"అమ్మా! ఒకటడుగుతాను, సమాధానం చెబుతావా? "

"ఏమిటది? "

"నన్నడిగినట్లే నీ కొడుకును పాస్‌వర్డ్ అడుగుతావా? "

మౌనంగా వుండిపోయింది అనసూయ.

అవును! నిజంగానే కొడుకును అడగలేదు. వాడు అమ్మాయిలతో చాట్ చేస్తూనే వుంటాడు.

"దరహాస్ మంచి కుర్రాడు. అతని స్నేహాన్ని వదలకు!" అనేసి గదిలోంచి బయటకు వెళ్లిపోయింది అనసూయ.

★ ★ ★

"ఏం చేస్తున్నావ్? " హౌస్ ఓనర్ సదానందం గదిలోకొచ్చి అడిగాడు దరహాస్‌ను.

"వంట అయిందండీ! ఇక తినాలి"

"రోజూ చేసే పనేగా! కొత్తేముంది? "

నవ్వి ఊరుకున్నాడు. ఆయన గదిలోకొచ్చాడంటే వెంటనే వదలడు. మాట్లాడుతూనే వుంటాడు. 'ఈ పూట వేడన్నం తినే ప్రాప్తం లేదు' అనుకున్నాడు దరహాస్.

సైన్స్ లెక్చరర్‌గా పనిచేసి పదవీవిరమణ చేశాడు సదానందం. కానీ ఎప్పుడూ సైన్సు, టెక్నాలజీకి సంబంధించిన టాపిక్స్ మాట్లాడడు. అడ్మినిస్ట్రేషనంటే అభిమానం. గవర్నమెంట్ జీప్‌లో తిరుగుతూ అధికార దర్పం చూపించడం ఇష్టం. కనీసం మండల రెవెన్యూ అధికారినైనా కాలేకపోయానంటూ బాధపడుతూంటాడు.

"టీచింగ్ ప్రొఫెషన్ ఇష్టం లేదయ్యా! ఇష్టం లేకపోయినా లెక్చరర్‌గా పనిచేయాల్సివచ్చింది. మా తమ్ముడికి అధ్యాపక వృత్తి అంటే ఇష్టం! 'నోబుల్ ప్రొఫెషన్' అంటూ వుంటాడు. వాడేమో సి.ఈ.ఓ.గా రిటైరయ్యాడు. కోట్లు సంపాదించాడు. నేనేమో ఆడపిల్ల పెళ్లి చేయలేకపోతున్నాను"

మౌనంగా వింటున్నాడు దరహాస్.

"రెండు నెలల రెంట్ ఇవ్వాలి" గుర్తుచేశాడు సదానందం.

ముందు ఆ సబ్జెక్ట్ మాట్లాడతాడు. ఆయనది పై చెయ్యి అవుతుంది. తరువాత ఆయనేం మాట్లాడినా తను ఖండించే ప్రయత్నం చేయడానికి సాహసించడు. ఏది చెప్పినా తల ఆడించాలి!

"వచ్చేవారం మా ఊరెళ్తున్నాను. తిరిగొచ్చేటప్పుడు మీకివ్వాల్సిన డబ్బు తీసుకొ

## కొత్తగాలి...

**మహనీయుల మాటలు**
**ముత్యాల సరాలు!**
**నాయకుల మాటలు**
**కుచ్చుటోపీలు!**

– నల్లపాటి సురేంద్ర,
విశాఖపట్నం

## కొత్తగాలి...

**అక్వేరియంలో**
**కొత్తచేపల్ని తరుముతూ పాతచేపలు**
**జూనియర్లను సీనియర్లు**
**ర్యాగింగ్ చేస్తున్నట్లు!**

– హెచ్. కుమారి, పుల్లాభొట్ల,
రాజమండ్రి

స్తాను" అన్నాడు దరహాస్.

"రెంట్ ఎక్కడికి పోతుందిలేవయ్యా! నువ్వు యు.పి.యస్.సి. సివిల్స్ పరీక్షలు రాశావ్. తప్పకుండా పాసవుతావ్. ఇంట ర్వ్యూలో కూడా నెగ్గావంటే తిరుగే వుం డదు. అందరూ నీచుట్టూ తిరగాల్సిందే!"

"నా చుట్టూ తిప్పించుకోడానికి నేను సివిల్స్ రాయడం లేదు సార్. గ్రామాల్లో అందరి కష్టసుఖాలు తెలుసుకుని సమ స్యల పరిష్కారానికి కృషి చేయాలనుకుం టున్నాను" అన్నాడు దరహాస్.

"మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవయ్యా! నీకు అండగా వుంటుంది. నీకే రెంట్ ప్రతినెలా ఇస్తుంది. ఉద్యోగమూ చేస్తోంది, ప్రతినెలా తన జీతం నీ చేతుల్లో పెడు తుంది"

"నా దృష్టి అంతా ఇంటర్వ్యూ మీదే వుందండీ! ఎలా ఫేస్ చెయ్యాలా అని ప్రతీక్షణం ఆలోచిస్తున్నాను.. పెళ్ళి గురించి ఆలోచించే సమయం లేదు"

"సర్లే! ఆ ఆలోచన వచ్చినప్పుడు మా అమ్మాయిని దృష్టిలో పెట్టుకో!" అనేసి వెళ్ళిపోయాడాయన.

భోజనం చేసి బెడ్ మీదకు చేరి ఇంగ్లీష్ మ్యాగజైన్స్ తిరగేస్తూ కూర్చున్నాడు.

తలుపు నెట్టుకుని లహరి గదిలోకి వ చ్చింది. వచ్చేక తలుపు గడియ పెట్టింది.

"తలుపు గడియ పెడుతున్నావెందు కు? " అడిగాడు దరహాస్.

"మా నాన్న మళ్ళీ నీ గదిలోకొచ్చి నస మొదలుపెట్టాడేమోనని తలుపులు బిగిం చానులే! నువ్వేం గాభరా పడాల్సిన పని లేదు. ఆడపిల్లకు ఉన్నంత చొరవ, ధైర్యం నీకు లేవు. మొద్దురాచిప్పలా వుంటే ఐ.ఎ. యస్. ఆఫీసర్‌వి ఎలా అవుతావ్? స్మార్ట్‌గా, చలాకీగా వుండాలి!"

లహరి బెడ్ మీద అతని పక్కన కూర్చుంది. ఆమె బ్యాంక్ మేనేజర్. దాదా పుగా అతని వయసే వుంటుంది.

"మంచి ఉద్యోగం, అందంగా వుంటా వ్..! మరి పెళ్ళెందుకు చేసుకోలేదు? " అడిగాడతను.

"పెళ్ళి చేసుకోడానికి నేను రెడీనే! మా నాన్నే అడ్డుపడుతున్నాడు. నాకు నచ్చినవా ళ్ళను మా నాన్న దగ్గరికి తీసుకొచ్చాను.. ఏదోక వంకపెట్టి వాళ్లను తిప్పిపంపించే శాడు. నిజానికి నా పెళ్ళి కావడం మానా న్నకి ఇష్టంలేదు.."

"ఎందుకని? "

"నా చిన్నతనంలోనే మా అమ్మ చనిపో యింది. కంటికిరెప్పలా చూసుకున్నాడు మా నాన్న. నాకు పెళ్లయి అత్తగారింటికి వెళ్ళిపోతానని ఆయనకు భయం! భర్తకు దగ్గరై తండ్రికి దూరం అవుతానేమోనని ఆయన కంగారు. ఒంటరైపోతాడేమో అనే అభద్రతాభావం.. ఆయన మాటలు వింటూ వంతపాడే ఇల్లరికం అల్లుడికోసం వెతుకుతున్నాడు. మీరు నచ్చారు మానా న్నకి. కానీ మీరు ఐ.ఏ.యస్. అధికారి అయ్యేక దూరంగా వెళ్ళిపోతారేమోనని ఆయన భయం. లోలోపల మీరు పరీక్ష ల్లో ఉత్తీర్ణులు కాకూడదనే మొక్కుకుంటు న్నాడు" అందామె అతనిమీద ఒరిగి పోతూ.

పాములు, తేళ్ళూ ఒంటిమీద పాకుతు న్నట్లు అన్పించిందతనికి. "దూరంగా జరు గు. బాగా చదువుకున్న అమ్మాయివి..

ఏమిటీ బలహీనత? పరాయి మగాడిమీద వాలిపోవడం నీకు తగదు. హద్దుల్లో ఉండటం మంచిది" అన్నాడు దరహాస్ పక్కకు జరుగుతూ..

"మీరు పరాయి మగాడెలా అవుతారు? నాకు కాబోయే భర్త మీరే"! అందామె, అతని పెదాలకు తన పెదాలను అందించే ప్రయత్నం చేస్తూ..

ఆమెను నెట్టేసి, "నీకు నువ్వు నిర్ణయం తీసుకుంటే సరిపోతుందా? నా ప్రమేయం అక్కరలేదా? నా మనసుకు నచ్చినవాళ్ళెవరో తెలుసుకునే ప్రయత్నం చేయవా? ఉద్రేకంతో మీద పడిపోవడమేనా? నా మనసుకు గ్రీన్‌సిగ్నల్ ఇస్తే నీకంటే ఎక్కువగా రెచ్చిపోగలను. ఉన్నతమైన వ్యక్తిత్వం ఏర్పర్చుకోడానికి సంవత్సరాల కృషి అవసరమవుతుంది. క్యారెక్టర్ దెబ్బతినడానికి ఒక్కక్షణం చాలు! రెండు క్షణాల సుఖం కోసం సంవత్సరాల తరబడి ఏర్పర్చుకున్న వ్యక్తిత్వాన్ని దెబ్బతీసుకోలేను. దయచేసి గదిలోంచి బయటకు వెళ్ళండి!" అన్నాడతను బెడ్‌మీదినుంచి కిందకు దిగి.

"నువ్వప్పుడే ఐ.ఏ.యస్. అయినట్లు ఫోజు పెడుతున్నావే! సివిల్స్ పాసవడం అంత తేలిక కాదు. పరీక్షలు తప్పేక కాళ్ళబేరానికొస్తావ్.. అప్పుడు చెబుతా నీ పని! నీకు వెనుక ఆస్తిలేదు, ఉద్యోగం లేదు.. మీ నాన్న ఆటోడ్రైవర్.. మీ అమ్మ ఇళ్లల్లో పనిచేస్తున్నది. నీ చెల్లెలు నర్సు! ఏం చూసుకుని టెక్కు? నేను బ్యాంక్ మేనేజర్ని. మా నాన్నకి ఒక్కతే కూతుర్ని.. సిటీలో రెండుమూడు ఇళ్ళున్నాయి. నాకంటే మంచి సంబంధం నీకు దొరుకుతుందా? ఆలోచించుకో! తొందరేం లేదు. నా చూపుల వలలోంచి తప్పించుకుపోలేవు! నువ్వు పరీక్షలు తప్పేక మళ్ళీ ఇదే బెడ్‌మీద కలుద్దాం!" అందామె గదిలోనుంచి బయటకు నడుస్తూ.

# చతుర ప్రవేశిక

## జూన్ చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సంపూర్ణ స్నేహితురాలు?
 జ.
2. సంపూర్ణ భర్త?
 జ.
3. అనసూయ చెల్లెలు?
 జ.
4. విఠల్ తండ్రి?
 జ.
5. వాసంతి భర్త?
 జ.
6. సుగుణ భర్త?
 జ.
7. మూర్తి మాస్టారి అన్న?
 జ.
8. అమృత ప్రేమించింది?
జ.
9. పాల్ అంకుల్ పేరు?
 జ.
10. 'మృత్యుంజయులు' నవల రచయిత?
 జ.

పంపినవారి పేరు: ------------------------------------వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

వేడివేడిగా వండుకున్న అన్నం, కూరలు చల్లారిపోయాయి. ఆకలి చచ్చిపోయింది, తండ్రీకూతుళ్ళ ప్రవర్తనకు.

★ ★ ★

సోఫాలో దిగులుగా కూర్చుంది అనసూయ.

బాత్‌రూమ్‌లో పడి తుంటిభాగం విరిగింది విఠల్‌కి. మంచంమీంచి లేచి తిరిగే పరిస్థితిలో లేదు.

అనసూయకు్కూడా అనారోగ్య సమస్యలు చుట్టుముట్టాయి. థైరాయిడ్ ప్రాబ్లమ్, ఓ కిడ్నీ సరిగా పనిచేయని స్థితి. హాస్పిటల్ చుట్టూ తిరుగుతోంది.

వీటికితోడు ఆర్థిక సమస్యలు. విఠల్ వ్యాపారం సజావుగా లేదు. ఏది చేపట్టినా నష్టాలే వస్తున్నాయి.

టీవీ ముందు కూర్చుందిగానీ ఏ ఛానల్ తిప్పినా 'విసుగొచ్చే ప్రోగ్రామ్సే' అనుకుంటూ టీవీ ఆఫ్ చేసింది.

ఎదురుగా గోడకు వేలాడదీసిన తమ పెళ్ళి ఫొటో కన్పించింది. ఆ కాలమెంతో సంతోషంగా గడిపింది. పిల్లలు పుట్టారు. నల్లటి జుట్టు తెల్లబడింది. తనవైపు చూస్తూ చిరునవ్వులు చిందిస్తున్నాడు భర్త ఫొటోలో. ఇప్పుడా నవ్వులేవి?

అందరికంటే గొప్పగా బతకాలనుకుంది. కానీ, అన్నీ అపశ్రుతులే!

విఠల్ మంచం దగ్గరికి వెళ్ళింది.

"మీరు లేచి తిరగడానికి సంవత్సరం పడుతుందని డాక్టరు చెప్పారు. ఇక్కడుండి మనం చేయగల్గిందేమీలేదు. వ్యాపారం దెబ్బతింది. పైసా సంపాదన లేనప్పుడు ఉన్నది ఖర్చుపెట్టుకుంటూ ఇక్కడ వుండడం ఎందుకు? పోన్నూరు వెళ్ళిపోదాం!" అందామె.

ఆమె ఆ మాట ఎప్పుడు అంటుందా అని ఎదురుచూస్తున్నాడతను. "మన ఆర్చీ ఇంట్లో వుంటేనే ప్రశాంతంగా వుంటుంది.

రేపే పోదాం" అన్నాడు విఠల్.

"మనకు మళ్ళీ మంచిరోజులొస్తాయి. అబ్బాయి ఐ.ఎ.యస్. అయితే అందరూ మనచుట్టూ తిరుగుతారు. పెద్దపెద్దవాళ్ళు అమ్మాయిల్ని ఇస్తామని పరిగెత్తుకుంటూ వస్తారు"

"నీ కొడుకు మీద మరీ అంత ఆత్యాస పెట్టుకోకు! నీలాగే నేనూ మనబ్బాయి పెద్ద ఆఫీసర్ అవుతాడని కలలు కన్నాను. గాలిమేడలు కట్టాను. ఈరోజు ఆ గాలి మేడ కూడా కూలిపోయింది"

"ఏం జరిగింది?" కొంచెం కంగారుగా అడిగింది అనసూయ.

"ఈ రోజే సివిల్స్ రాతపరీక్షల రిజల్ట్సు వచ్చాయి. మనవాడు తప్పాడు. ఆశ్చర్యక రమైన విషయం ఏమిటంటే సంపూర్ణ కొడుకు దరహాస్ ఉత్తీర్ణుడయ్యాడు. మన మ్మాయి ఇప్పుడే ఫోన్ చేసి చెప్పింది" అన్నాడు విఠల్.

కళ్ళు తిరిగినట్లు అన్పించి అతని పక్కన కూర్చుందామె.




**న**ర్సుగా ట్రైనింగ్ పొందేటప్పుడు హాస్పి టల్ చుట్టూ తిరిగింది లాలిత్య. వ్యాధుల బారినపడి అవస్థ పడుతున్న రోగుల్ని చూసింది. చుట్టుపక్కల గ్రామాలకు బంధువుల పెళ్ళిళ్ళకు వెళ్ళినప్పుడు, స్నేహి తురాళ్ళను కలవడానికి వెళ్ళినప్పుడు ఎన భయ్యేళ్ళు దాటిన వృద్ధులను చూసింది. వాళ్ళలో కొంతమంది పిల్లలు అమెరికా, ఆస్ట్రేలియా దేశాల్లో వున్నారు. తల్లిదండ్రు ల మీద ప్రేమవున్నా దగ్గరుండి సేవచేసే అవకాశంలేదు. వయోభారం మీదపడిన వాళ్ళు విదేశాల్లో పిల్లలతో పాటు వుండ లేరు. అందుకే చుట్టుపక్కల గ్రామాల్లోని వృద్ధులకు, రోగులకు సేవలు అందించాల నుకునేది. తను ఆసుపత్రిలో నర్సు గా చేరితే తన సేవలు ఆ ఆసుపత్రికే పరిమి తమైపోతాయి. అందరికీ విస్తృతంగా సేవలు అందించాలంటే ఎలా?!

అమృత దగ్గరికెళ్ళి తన ఆలోచనలను పంచుకుంది లాలిత్య.

"కొన్ని పనులు చిన్నవిగానే కన్పిస్తాయి. ఆ పని ఎక్కడ మొదలుపెట్టాలి? ఎప్పుడు మొదలుపెట్టాలి? ఎవరి సహకారం తీసు కోవాలి? ఎన్నో ప్రశ్నలు మెదడులో మెదు లుతాయి. పనులు మొదలు కాకముందే వాయిదా పడుతుంటాయి.

నువ్వు సేవారంగంలో వున్నావు. లాభా పేక్ష లేకుండా నలుగురికీ సేవలు అందిం చాలనుకుంటున్నావు. వెంటనే మొదలు పెట్టు! నా సహకారం నీకు ఎప్పుడూ వుంటుంది. ఆర్థిక సహాయం కూడా అంది స్తాను. నీకు ఓ వ్యాపారం ఏర్పడుతుంది. మరి కొంతమందికి జీవనోపాధి చూపించి నదానివి అవుతావు" అంది అమృత.

వృద్ధులకు సహాయపడటానికి 'హోంకేర్ సర్వీస్' మొదలుపెట్టాలని ఎప్పటినుంచో ఆమె మదిలో వుంది. అదే ఆలోచనతో లాలిత్య తన దగ్గరికి రావడం ఎంతో సంతోషాన్ని కలిగించింది. హోంకేర్ సెంటర్‌ను ఎలా నిర్వహించాలో లాలి త్యకు చెప్పింది. ప్లానింగ్ అమృతది. అకుంఠిత దీక్షతో ఆ పనిని తన భుజాల మీద వేసుకుంది లాలిత్య. 'అనురక్తి హోంకేర్ సర్వీస్' పేరు మీద రిజిస్టర్ చేయించింది లాలిత్య.

ఆ తరువాత పేపరు ప్రకటన ఇచ్చింది.

"అనురక్తి హోంకేర్ సర్వీస్' - పిల్లలు విదేశాల్లో దూరప్రాంతాల్లో వుండి ఒంటరిగా వుంటున్న వృద్ధులకు, మంచాన వున్న వారికి, పెరాలసిస్ పేషెంట్లకు మీ ఇంటికే వచ్చి సేవలు అందించడానికి మా సంస్థ అటెండర్లు, ఆయాలు సిద్ధంగా వున్నారు. మా సేవలు అవసరమైతే సంప్రదించండి" ఆ యాడ్ కింది భాగాన ఫోన్ నంబరు ఇచ్చింది.

పేపరు ప్రకటన వెలువడ్డ రెండుమూడు రోజులకే వందమంది ఫోన్ చేశారు లాలిత్యకు. వారి అడ్రెస్‌లు, వివరాలు సేకరించింది. ఒక్కొక్కరి దగ్గరికెళ్ళి హోంకేర్ సర్వీస్ గురించి వాళ్లకు వివరంగా చెప్పాలనుకుంది.

ముందుగా నడింపల్లి గ్రామంలో చంద్రయ్యగారింటికి వెళ్లింది. ఆయనకు ఎనభైయేళ్ళున్నాయి. కీళ్లనొప్పులు. ఎక్కువ దూరం నడవలేడు. ఆయన భార్యకు చూపు మందగించింది.

"నీకు ఇరవయ్యేళ్ల వయసుంటుందేమో! చిన్నపిల్లవు.. అందరికీ సేవలు సవ్యంగా అందేటట్లు ఎలా చూడగలుగుతావు? అదేమంత తేలిక్కాదు. మా దగ్గరకు ఓ కుర్రాడినో, ఆయానో పంపుతావు.. అతను విసుక్కోకుండా మేం చెప్పిన పనులు చేయాలి! ఇంట్లో మనిషిలా మెలగాలి! దొంగబుద్ధి ఉండకూడదు. మేం పెద్దవాళ్లం కదాని అలుసు తీసుకుని ఇంట్లో ఖరీదైన వస్తువులు, డబ్బు, దస్కం కాజేస్తే ఆ నష్టం ఎవరు భరిస్తారు? " ప్రశ్నించాడు చంద్రయ్య.

సేవలందించడం సులువు కాదని అప్పుడు అర్థమయ్యింది. 'ఎన్నో సవాళ్లు ఎదురవుతాయి. వాటినన్నిటినీ అతిక్రమించాలి తను! ఆ పెద్దాయన చెప్పిందంతా వాస్తవమే! అటువంటి సమస్యలు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి! సేవాదృక్పథం ఉన్న కుర్రాళ్లను, ఆయాలను పనిలోకి తీసుకోవాలి! రిక్రూట్ చేసుకునే సిబ్బందిని జాగ్రత్తగా పరిశీలించాలి! మంచి నడత ఉన్నవాళ్లనే తీసుకోవాలి!' అనుకుని, "నమ్మకస్తులనే మీ దగ్గరకు పంపుతాం తాతగారూ! మమ్మల్ని నమ్మి మాకు ఓ అవకాశం ఇవ్వండి. నెలరోజులు చూడండి! మేం పంపిన అబ్బాయి నడవడి సరిగ్గా లేకపోతే మాకు ఫోన్ చేస్తే అతన్ని తీసేసి మరొకరిని ఏర్పాటుచేస్తాం! బంగారం, పెద్దమొత్తంలో డబ్బు ఇంట్లో ఉంచుకోకండి. బ్యాంకులో దాచుకోండి! కావాలంటే మీతోపాటు నేను బ్యాంకుకు వస్తాను. చిన్న వయసులో పెద్దలకు సేవలు చేయాలని ప్రయత్నం చేస్తున్నాను.. మీ దీవెనలు కావాలి నాకు!" అంది లాలిత్య చంద్రయ్యగారి పాదాలకు నమస్కరిస్తూ.

ఆయన భార్యను పిలిచాడు.

"నాకు సరిగ్గా చూపు ఆనదమ్మాయి. వంట చేసుకోలేకపోతున్నాను. వంటపని చెయ్యాలి! మా ఇద్దర్నీ కనిపెట్టుకుని ఉండాలి. డబ్బుదేం సమస్యలేదు. మా నలుగురు పిల్లలు అమెరికాలోనే ఉన్నారు" అంది వనజాక్షి లాలిత్య చెయ్యి నిమురుతూ.

అదే సమయంలో వారి పెద్దబ్బాయి నుంచి ఫోన్ వచ్చింది.

ఆయన కాసేపు మాట్లాడి ఫోన్ లాలిత్యకు ఇచ్చాడు.

"అమెరికా ఫోన్‌కాల్ తల్లీ! నువ్వు ఎంత సేపన్నా మాట్లాడొచ్చు! మనమేం డబ్బు చెల్లించాల్సిన పనిలేదు. మావాడు రోజూ గంటసేపు మాట్లాడుతాడు" అన్నాడు చంద్రయ్య.

"లాలిత్యగారూ! నమస్తే! మీరు హోంకేర్ సర్వీస్ పెట్టారని ఎంతో సంతోషపడ్డాను. ఊళ్లో మా అమ్మానాన్నలకు సేవ చెయ్యడానికి మనుషులు దొరకరని కాదు. దొరుకుతున్నారు కానీ, నాలుగురోజులు పనిచేస్తే నాలుగురోజులు రావడం

అక్షరం

**మా**నవత్వం ఒక సముద్రం వంటిది
సముద్రంలోని కొన్ని నీటి బిందువులు
మురికిగా ఉన్నంత మాత్రాన
సముద్రమంతా మురికిగా ఉందనుకోవడం పొరపాటు
అందుకే మానవత్వంపై నమ్మకం వదులుకోవద్దు

**– రమణ మహర్షి**



లేదు. మరో మనిషిని వెతుక్కోవడం కష్టమవుతున్నది. అలా కాకుండా ఉద్యోగుల్లా నెలజీతంమీద దొరికి సక్రమంగా ఇంట్లో పనిచేస్తుంటే తల్లిదండ్రులను గురించి విదేశాల్లో ఉండే మేం పెద్దగా ఆలోచించాల్సిన అవసరం ఉండదు. నెలకు పదివేలు ఇవ్వడానికి మేం సిద్ధమే!

మా అమ్మానాన్నలు రోజూ మందులు వేసుకోవాలి! ఏ సమయానికి ఏం మందులు వేసుకోవాలో తెలీదు. మందుబిళ్లల రంగునుబట్టి తెలుసుకున్నా వేసుకోవడం మర్చిపోతూంటారు. ఒక్కోసారి మందు వేసుకున్నా వేసుకోలేదనుకుని మళ్లీ మరోసారి బిళ్లలు మింగుతున్నారు. కళ్లజోడు గుర్తుగా ఒకచోట పెట్టుకోరు. అది కనిపించక తల్లడిల్లిపోతూంటారు. వృద్ధాప్యం మూలంగా ఒక్కోసారి బట్టలు పాడుచేసుకుంటారు.. ఆ క్షణాల్లో వాళ్లను చీదరించుకోకుండా సేవ చేసేవాళ్లు కరుణామయులు. పెద్దలపట్ల సానుభూతి, కరుణ, ప్రేమ గల సేవాపరులనే సంస్థలో చేర్చుకోండి! వాళ్ల అవసరాలకు సరిపడా జీతాలు సక్రమంగా ఇవ్వండి! అప్పుడు మీ 'అనురక్తి హోంకేర్ సర్వీస్'కు మంచిపేరు వస్తుంది" అన్నాడు చంద్రయ్యగారి అబ్బాయి గోపాల్.

"మీ సలహాలు మాకు ప్రేరణ కలిగిస్తున్నాయి సార్! తప్పకుండా మీరు చెప్పినట్లే నడుచుకుంటాం! మా సేవలు పొందేవాళ్లను కష్టమర్లుగా చూడం! సొంత తల్లిదండ్రుల్లా చూసుకుంటాం!" అంది లాలిత్య.

"మీకో అనుమానం రావచ్చు! అమెరికాలో ఉన్నత స్థాయికి వెళ్లి తల్లిదండ్రుల్ని పట్టించుకోకుండా డాలర్లు పోగుజేసుకోడమే మా లక్ష్యంగా పెట్టుకున్నామనుకుంటారు. నూటికి తొంభైశాతం అలా ఉండరు. అనురాగం, ప్రేమ ఉన్నాయి. కానీ తల్లిదండ్రులు విదేశాల్లో ఉండలేరు, పిల్లలేమో భవిష్యత్‌ను వదులుకుని తల్లిదండ్రులతోపాటు ఉండలేరు. కానీ తల్లిదండ్రులు ఆనందంగా ఉండటానికి చేయవలసినదంతా చేస్తున్నారు.. అంతేకాదు పుట్టిన ఊరు సర్వతోముఖాభివృద్ధికి శాయశక్తులా కృషి చేస్తున్నారు ఎన్.ఆర్.ఐ.లు. ఓ పదిశాతంమంది నిర్లక్ష్యంగా ఉండే వాళ్లు తల్లిదండ్రుల్నీ, జన్మభూమిని మర్చిపోతారేమో కానీ అంతా అలా కాదు.

మా అమ్మ చిన్నతనంలో మాకు కొద్దిగా ఒళ్లు వెచ్చబడితే తల్లడిల్లిపోయేది. పుస్తకాలబ్యాగ్ స్కూలు దాకా మోసుకువచ్చేది. ఇంటికి రావడం కాస్త ఆలస్యమైతే తనే వచ్చేసేది! అమెరికా వెళ్తున్నానని తెలిసినప్పుడు ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి. 'మీ అబ్బాయి ఎక్కడున్నాడని?' ఎవరన్నా అడిగితే సంతోషంగా మిలమిలలాడే కన్నులతో 'అమెరికాలో ఉన్నాడని' గర్వంగా చెప్పుకునేది. అమెరికాలో మనవడు పుట్టాడని తెలిసి, వాడిని చూడలేకపోయానని మనోవేదన పెట్టుకుంది. సంవత్సరం తరువాత వాడిని తీసుకువస్తే క్షణం వాడిని వదలకుండా ఎత్తుకుని ఊరంతా తిప్పింది. రెండేళ్లకోసారి మేం ఇండియా వస్తామని దిగులుపడుతూ ఉంటుంది. ఫోన్లో పలకరిస్తే సంబరపడిపోతూ ఎదురుగా నిలబడి

మాట్లాడుతున్నట్లే అనుకుంటుంది. ఎదురె దురుగా నిలబడి మాట్లాడుకునే సదుపాయం కూడా ఉంది నెట్‌లో. మీరు పంపించే అబ్బాయో, అమ్మాయో కాస్త చదువుకున్న వాళ్లయితే నెట్ ఓపెన్ చేసి అమ్మకు చూపించవచ్చు!

మా నాన్న గురించి రెండు మాటలు.. నా చదువుకోసం రెండెకరాల మాగాణి అమ్మేశాడు. గుంటూరులో చదువుకునే రోజుల్లో వారంవారం తినుబండారాలు క్యానుల్లో మోసుకువచ్చేవాడు. వద్దన్నా వినకుండా జేబులో డబ్బు కుక్కి వెళ్లేవాడు. ఎక్కువసేపు మాట్లాడడు నాలాగా! ఫోనెత్తి 'ఏరా? బాగున్నావా?' అనేసి ఫోన్ మా అమ్మకు ఇచ్చేస్తాడు. మా అమ్మ 'కొడుకు ఫోన్ చేసి వారం రోజుల యిందంటూ కంగారుపడ్డావ్.. తీరా వాడు ఫోన్ చేశాక రెండు ముక్కలు మాట్లాడి ఫోన్ ఇచ్చేస్తున్నావ్!' అనేది. 'వాడి గొంతు ఒక్క క్షణం వింటే చాలే!' అనేవాడట, అమ్మతో. చిన్నప్పటి విషయాలు అమ్మ మర్చిపోకుండా మనవడికి, మనవరాలికి చెబుతూనే ఉంటుంది.

ఇవన్నీ మీకెందుకు చెబుతున్నానంటే మా కుటుంబాన్ని మీరు అర్థం చేసుకుంటారని.. 'ఎక్కడో దూరంగా ఉన్నాడు కొడుకు.. అవసరమైతే డబ్బు పంపుతాడు గానీ, దగ్గరుండి అన్నీ చూసుకోడు!' అని అనుకోవద్దు!"

"థ్యాంక్స్ అండీ! గతాన్ని తడుము కుంటూ అన్నీ వివరంగా చెప్పారు. అయితే మీ అమ్మానాన్నల్ని మా సంస్థ సభ్యులుగా ఎన్‌రోల్ చేసుకుంటాను. వారిక 'అనురక్తి' కుటుంబసభ్యులు అయినట్లే!" అంది లాలిత్య.

పదివేలు ముందే ఇచ్చేశాడు చంద్రయ్య. రసీదు ఇచ్చింది లాలిత్య.

"ఈ డబ్బులో తొమ్మిది వేలు మీ దగ్గర పనిచేసే అబ్బాయికి జీతంగా ఇస్తాం. వెయ్యి రూపాయలు మా దగ్గర డిపాజిట్ అవుతుంది. సంస్థ నిర్వహణకు, పనిచేసే సిబ్బంది కుటుంబ సంక్షేమం కోసం వినియోగిస్తాం! మీ దగ్గర ఉండబోయే అబ్బాయికి వసతి మీరే కల్పించాలి! భోజన ఏర్పాట్లు చెయ్యాలి. ఇంట్లోపని, వంటపని చేసే ఆయాలను కూడా ఏర్పాటుచేస్తాం!" అంది లాలిత్య.

"రెండుమూడు నెలలు చూస్తాం! మా ఇంటికి వచ్చినవాళ్లు కుదురుగా ఉండి, సంతృప్తిచెందితే కొనసాగిస్తాం! లేకపోతే ఉద్వాసనే!" అన్నాడు చంద్రయ్య.

"మీకెటువంటి అసౌకర్యం కలిగించని విధంగా నేను, మా సిబ్బంది ప్రవర్తిస్తాం. దానికి నేను హామీ"

వయసులో చిన్నదైనా ఆ అమ్మాయి ఆత్మవిశ్వాసం, పట్టుదల చంద్రయ్యకు నచ్చాయి.

'వాంటెడ్' ప్రకటన ఇచ్చింది లాలిత్య పేపర్లలో- 'వయో వృద్ధులు, రోగులకు సేవ చేయడానికి ఉత్సాహవంతులైన యువతీయువకులు, నడివయసువారు 'అనురక్తి హోంకేర్ సర్వీసెస్'లో పనిచేయుటకు కావలెను. జీతం నెలకు రూ. 9000/- వసతి, భోజనం ఉచితం. గ్రామాల్లో పనిచేయుటకు అనురక్తి ఉండవలెను' అంటూ సంప్రదించాల్సిన ఫోన్ నెంబరిచ్చింది ఆ ప్రకటనలో.

దాదాపు ఆరొందలమంది ఆమెకు ఫోన్ చేశారు. వాళ్లందరితో మాట్లాడింది. గ్రామాల్లో పనిచేయడానికి ఉత్సాహం చూపించినవాళ్లకు ప్రాధాన్యం ఇచ్చింది.

పొన్నూరుచుట్టూ కొన్ని టౌన్లున్నాయి. బాపట్ల, చీరాల, తెనాలి, రేపల్లె మొదలైన చిన్నచిన్న పట్టణాల్లో ఉండే వయోవృద్ధులు కూడా లాలిత్యను సంప్రదించడం మొదలుపెట్టారు.

మొదట్లో రెండొందలతో మొదలైన సభ్యులు నాలుగు వందలకు పెరిగారు.

అదే సంఖ్యలో అటెండర్లు, ఆయాలను నియమించాల్సి వచ్చింది. అన్ని ఊళ్లు తిరిగి డబ్బు వసూలు చెయ్యడం, సిబ్బందికి జీతాలివ్వడం లాలిత్యకు కష్టమైంది. ఇంటి ఆవరణలోనే ప్రత్యేకంగా ఓ గదిని కట్టించింది. ఒక అకౌంటెంట్, పదిమంది సిబ్బందిని నియమించింది. అన్ని ఊళ్లూ తిరిగి డబ్బు వసూలు చెయ్యడం, జమాఖర్చుల పట్టికలు తయారుచెయ్యడం వంటి పనులు ఆ సిబ్బందికి అప్పగించింది.

సంవత్సరం తిరక్కముందే కొన్ని సమస్యలొచ్చాయి. తెనాలిలో అరవై అయిదేళ్ల పెద్దమనిషి ఇంట్లో వంట చేయడానికి, మంచం పట్టిన భార్యకు సపర్యలు చెయ్యడానికి ఆడమనిషి కావాలన్నాడు. లాలిత్య ఆ ఏర్పాటు చేసింది. నలభై ఏళ్ల ఆడమనిషిని ఆ ఇంట్లో ఉంచింది. రెండుమూడు నెలలు బాగానే నడిచింది.

ఆమె పేరు రేవతి.

"రేవతీ నువ్వు బాగుంటావ్! ఆ లాలిత్య ఇచ్చే తొమ్మిదివేలకు రెట్టింపు ఇస్తాను! నేను చెప్పినట్లు చెయ్యాలి!" అనేవాడాయన.

ఆ మాటలకు అర్థం ఓరోజు రాత్రి తెలిసింది. పొద్దుపోయేక రేవతి గదిలోకొచ్చి ఆమె పక్కన పడుకున్నాడు.

"మీరు పెద్దవారు, ఇదేం పని? " అంది రేవతి అతన్ని నెట్టివేస్తూ.

"మా ఆవిడ మంచానికి అతుక్కుపోయింది. ఏం ఉపయోగం లేదు. నా మాట విను, నీకు బంగారు గొలుసు ఇస్తా!" అన్నాడతను మళ్లీ ఆమె దగ్గర చేరుతూ.

బలంగా ఒక్క తన్ను తన్నింది రేవతి.

ఆమె బలిష్ఠంగా ఉండటం, అతను సన్నగా, పీలగా ఉండటంతో అతని ఆటలేం సాగలేదు.

"మా ఆయన ఆరోగ్యం సరిగ్గాలేదు. మందులిప్పిస్తున్నాను. నా కూతురు ఇంజనీరింగ్ చదువుకుంటున్నది. రెండేళ్లు కష్టపడితే మాకు మంచిరోజులొస్తాయని లాలిత్యమ్మ నాకీ పని అప్పగించారు. జీతమే

# కొత్తగాలి... 

**ఓటు ఉన్నది**
**అమ్మడానికే**
**నోటు ఉన్నది**
**కొనడానికే!**

– చాడా మునిశేఖర్‌రెడ్డి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా

కాకుండా అవసరం అయినప్పుడు డబ్బు కూడా ఇస్తుందామె. 'ధనికుల ఇళ్లల్లో పని చేస్తున్నప్పుడు కొంతమంది ప్రలోభపెడుతూంటారు. వేటికీ లొంగకు! నీ పని నువ్వు చేసుకో!' అందామె. మీ ఆవిడకు మీరు ద్రోహం చేయతలపెట్టినా నేను మా ఆయనకు ద్రోహం చెయ్యను. నామీద మా ఆయనకెంతో నమ్మకం. ఆ నమ్మకాన్ని వమ్ము చేయను" అందామె.

అతన్ని గదిలోంచి బయటకు నెట్టేసి తలుపులేసుకుంది.

మరుసటిరోజు ఉదయం లాలిత్య దగ్గరకు వెళ్లి జరిగిన సంగతి చెప్పింది.

ఆ ఇంట్లో పని మానెయ్యమని, మరో చోట ఆమెకు పని చూపించింది.

మరోచోట మరో సమస్య వచ్చింది.

ఇంట్లో పనిచేస్తున్న అబ్బాయి పక్కింటి అమ్మాయితో ప్రేమలో పడ్డాడని ఆ పక్కింటి పెద్దాయన లాలిత్యను కలిసి గొడవ పెట్టుకున్నాడు.

"ఇటువంటి వెధవలనా మీ సంస్థలో పెట్టుకునేది? వెంటనే తీసెయ్యండి పనిలోంచి" అన్నాడు.

"అతన్ని అక్కడినుంచి తీసేస్తానుగానీ, వాళ్లిద్దరిమధ్య ప్రేమబంధాన్ని చెరిపెయ్యలేను గదా!" అంది లాలిత్య.

"మళ్లీ వాడు మా ఇంటివైపు చూస్తే

కాళ్లు విరగ్గొట్టిస్తాను" అన్నాడాయన పెద్దగా అరుస్తూ.

ఆ కుర్రాడితో పెళ్లి చేయకపోతే ఆత్మ హత్య చేసుకుంటానని బెదిరించిందా పిల్ల.

ఆరునెలలు గడిచేక ఆ కుర్రాడి కాళ్లు కడిగి కన్యాదానం చేశాడా పెద్దమనిషి.

ఒకచోట ఓ అబ్బాయి బంగారు నగలు తస్కరించాడు.

అమృతతో కలిసి పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి అతనిపై కంప్లయింట్ ఇచ్చింది లాలిత్య.

"హాయిగా ఓ ఆసుపత్రిలో నర్సుగా ప్రశాంతంగా ఉద్యోగం చేసుకోకుండా ఎందుకీ తిప్పలు? నువ్వు వృద్ధులకు ఆసరాగా ఉండాలని ఓ కుర్రాడిని పంపితే వాడే ఊసరవెల్లిలా రంగులు మార్చి దొంగతనానికి పాల్పడ్డాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

లాలిత్య అధైర్యపడక "మా దగ్గర నాలుగొందలమంది అటెండెంట్లు, నర్సులు, ఆయాలు పనిచేస్తున్నారు. ఒకరిద్దరు తప్ప అందరూ మంచిపేరు తెచ్చుకుంటున్నారు సార్! ఒకటిరెండు ఎలుకలు తిరుగుతున్నాయని ఇల్లు తగలబెట్టుకోలేం కదా!" అంది లాలిత్య.

"చిన్న వయసులో ఎందుకీ ఇబ్బందులు? బాగా అనుభవం ఉన్నవాళ్లే సేవా రంగంలో దిగాలి!"

"అన్నిరంగాల్లో అనుభవజ్ఞులు మొదట్లో ఇబ్బందులు పడినవాళ్ళే గదండి!" అంది అమృత.

లాలిత్య, అమృతల పట్టుదలకు మెచ్చుకున్నాడతను. వారం రోజుల్లోనే ఆ కుర్రాడిని పట్టుకుని బంగారపు నగలు రికవరీ చేశాడు.

లాలిత్య చేస్తున్న కృషి జిల్లా కలెక్టర్ దృష్టికి వచ్చి, అమ్మాయిని పిలిపించి మాట్లాడేడు. లాలిత్యకు తోడుగా అమృత కూడా వెళ్లింది.

అతి తక్కువ కాలంలో నాలుగొందల మందికి మీరు, మీ సిబ్బంది సేవలందించే నెట్‌వర్క్ బ్రహ్మాండంగా డెవలప్ చేశారు. ఏవో చిన్న, చిన్న లొసుగులు తప్పితే మీ 'అనురక్తి హోంకేర్ సర్వీసు'కు మంచిపేరొచ్చింది. మీ కస్టమర్లు నాలుగొందల మంది. ఒక్కొక్కరి దగ్గర పదివేలు వసూలు చేస్తున్నారు. తొమ్మిదివేల చొప్పున ఆయాలు, అటెండెంట్లకు జీతాలిస్తున్నారు. అంటే నెలకు దాదాపుగా నలభై లక్షల ఆదాయం వస్తున్నది మీ సంస్థకు. మీరింత డబ్బు ఏం చేస్తున్నారు? " అడిగాడు జిల్లా కలెక్టర్.

'ఐ.ఎ.యస్.ల బుర్ర చాలా షార్ప్' అనుకుంది అమృత.

"అటెండెంట్లు, ఆయాలు, నర్సులు కాకుండా మా సంస్థ సిబ్బంది మొదట్లో పాతికమంది ఉండేవారు. ఇప్పుడు కలెక్షన్ బాయిస్, క్లర్కులు, అటెండెంట్లు మొత్తం వందమంది ఉన్నారు. వారికి జీతాలు, ప్రోత్సాహకంగా ఇచ్చే బహుమతులు, కుటుంబ సంక్షేమ నిధి, మా ఆఫీసు, గెస్ట్ హౌస్ నిర్వహణ ఖర్చులు ఉంటాయి సార్. మిగిలిన సొమ్ము మా సంస్థ ఆధ్వర్యంలోనే ఉన్న అనాథాశ్రమానికి వాడుతున్నాం. మా స్నేహితురాలు అమృత ఉచిత సేవలు అందిస్తున్నంది. నేను నెలజీతం మాత్రం తీసుకుంటాను" అంది లాలిత్య.

"ఇట్స్‌గ్రేట్!" మెచ్చుకున్నాడు కలెక్టర్.

ఆ వార్త అన్ని పేపర్లలో వచ్చింది.

★ ★ ★

ఆర్చీ ఇంటిముందున్న అరుగుమీద కూర్చున్నాడు బాపయ్య ఉదయంపూట.

హరిత తన వయసే ఉన్న మరో అబ్బాయి చేయి పట్టుకుని ఆర్చీదగ్గర నిలబడింది. తల పైకెత్తి ఆర్చీమీదున్న కృష్ణుడి బొమ్మ, ఆవుల బొమ్మలు చూస్తున్నారు. వాళ్లిద్దర్నీ పిలిచి అరుగుమీద తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"ఈరోజు స్కూల్లేదా? "

"చిల్డ్రన్స్ డే.. స్కూల్లేదు" అంది హరిత




బాపయ్యగారి గుబురు మీసాలు చేతితో తాకే ప్రయత్నం చేస్తూ.

"అయితే ఏం చేస్తారీరోజు?" అడిగాడు.

"ఆడుకుంటాం" అన్నాడు హరిత ఫ్రెండు రాము.

"ఏం ఆటలు ఆడుకుంటారు?"

వాళ్లింట్లో వున్న బార్బీ బొమ్మలతో ఆడు కుంటాం. టీవీలో కార్టూన్ సీరియళ్లు చూస్తాం. సెల్‌ఫోన్‌లో గేమ్స్ ఆడతాం!" అంది హరిత.

పెద్దగా నవ్వాడు బాపయ్య.

"ఆటలంటే ఇవేనా? మేం చిన్నప్పుడు ఎన్ని ఆటలు ఆడేవాళ్లమో తెలుసా? "

"చెప్పు తాతయ్యా! ఏం ఆటలు ఆడే వాళ్లు? " ఆసక్తిగా అడిగింది హరిత.

"గోళీకాయలతో ఆడేవాళ్లం. బొంగరాలు తిప్పేవాళ్లం. చెరువులో ఈత కొట్టేవాళ్ళం. వానలో తడుస్తూ 'వానా వానా వల్లప్పా!' అంటూ ఆడుకునేవాళ్లం! గాలిపటాలు ఎగ రేసేవాళ్ళం! ఇంట్లో తెలియకుండా సైకిల్ తొక్కేవాళ్ళం. కిందపడితే చేతులు, కాళ్లు దోక్కుపోయేవి. ఆ దెబ్బలు పెద్దవాళ్ళకి చూపించేవాళ్లం కాదు, కొడతారని! పున్నా గపూల కాడలను చిన్నవిగా తుంచి సన్నా యిలాగా ఊదుతూ ఉండేవాళ్లం! అమ్మమ్మ, నాయనమ్మల దగ్గర చేరి పేద రాసి పెద్దమ్మ కథలు చెప్పించుకునేవాళ్లం! ఆడపిల్లలు పచ్చీసు, చింతగింజలతో ఆడే వాళ్లు. చెక్కబొమ్మలకు బ్లౌజు, పరికిణీ తొడిగి ఆడేవాళ్లు.. అబ్బో ఎన్ని ఆటలో!" అన్నాడు బాపయ్య.

"బయటకెళ్లి ఆడుకుంటామంటే 'ముందు హోమ్‌వర్క్ చెయ్యి!' అంటారు తాతా, అమ్మనాన్నలు" అన్నాడా కుర్రాడు.

"ఈ రోజు నాతో ఆడుకుందురుగానీ రండి!" అంటూ ఇంట్లోకి తీసుకువెళ్లాడు బాపయ్య.

పాతకాలంనాటి కావిడిపెట్టె ఉంది. దాని మూత తీసి అందులో ఉన్న పిండి గోళీలు, సీసం గోళీలు, చెక్క బొంగరం తీసి ఆ కుర్రాడికిచ్చాడు. వాటితో ఎలా ఆడాలో చూపించాడు బాపయ్య.

పనివాడిని పిలిచి ఇంటి వెనుకవైపు ఆవ రణలో ఉన్న చింతచెట్టు కొమ్మకు తాడు కట్టించి ఉయ్యాల ఏర్పాటుచేశాడు.

రామును, హరితను ఉయ్యాలెక్కించి ఊపాడు. వాళ్ళు ఆనందంతో కేరింతలు కొట్టారు. ఇంటి వెనుక కోళ్లు తిరుగుతు న్నాయి. వాటిని పట్టుకోమంటే, పిల్లలు వాటి వెనుక పరిగెత్తారు. అదో ఆటగా మారింది.




అమృత జిల్లా పరిషత్ స్కూల్లో టీచ రుగా చేరి సంవత్సరం అవుతూ ఉంది. సైన్స్, మాథ్స్ టీచరుగా మంచి పేరు తెచ్చుకుంది.

పదో తరగతి చదివే కాళింది మాథ్స్‌లో వెనుకబడటం గమనించింది. తను టీచ రుగా స్కూల్లో చేరిన కొత్తల్లో ఆ అమ్మాయి క్లాసు ఫస్ట్‌గా ఉండేది. సంవ త్సరం చివర్లో ఆమెకి యాభైశాతం కంటే తక్కువగా మార్కులు రావడం అమృతకు ఆశ్చర్యం కలిగి, "కాళింది చదువులో వెను కబడుతున్నది, గమనించారా? " అనడి గింది సోషల్ టీచర్ని.

"మీరొచ్చి పాఠాలు మొదలుపెట్టేక ఆ మార్పు వచ్చిందేమో!" అన్నాడు నవ్వుతూ.

ఆయన సరదాగా ఆ మాట అన్నా బాధ పడింది అమృత. కాళింది ఇంటికెళ్లి తల్లి దండ్రులతో మాట్లాడింది.

"ఇంట్లో సమస్యలేం లేవమ్మా! చక్కగా తయారై స్కూలుకు వెళ్తుంది. ఏదడిగినా ఇస్తున్నాం! ఒకటే ఆడపిల్ల కావడంతో ఎంతో ప్రేమగా చూస్తాం! స్కూల్లోనే

ఏవన్నా సమస్యలున్నాయేమో!" అన్నాడు కాళింది తండ్రి.

కాళిందిని అడిగితే "నాకేం సమస్యల్లేవు. హ్యాపీగా ఉన్నాను" అంది.

డ్రెస్, అలంకరణల మీద ఆమె ప్రత్యేక శ్రద్ధ చూపించడం గమనించింది. చిన్న పిల్ల.. అందంగా తయారవడంలో తప్పే ముందనుకుంది. 'చదువు మీద ఎక్కువ శ్రద్ధ చూపించు!' అంటే హర్ట్ అవుతుందే మోనని ఆ పిల్లని ఏమీ అనేది కాదు.

ఓ రోజు 'లక్ష్మీ పిక్చర్ ప్యాలెస్' కు సినిమాకు వెళ్తే, కాళింది ఓ అబ్బాయి పక్కన కూర్చుని కనిపించింది. ఆ కుర్రాడిని గుర్తుపట్టింది. అతను శేఖర్. ఇద్దరు ముగ్గురు అమ్మాయిలు అతని మోజులో చదువు పాడుచేసుకున్నారు. ఓ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. మరో అమ్మాయికి మతి చెలించి ఆసుపత్రి పాలయ్యింది. ఊళ్లో అందరికీ అతని సంగతి తెలుసు. అతని తండ్రి పరపతి మూలంగా ఆడపిల్లల తల్లిదండ్రులు మౌనంగా ఉండాల్సివచ్చింది.

స్కూల్లో ఒంటరిగా కన్పించినప్పుడు' 'ఊళ్లో శేఖర్ గురించి అందరికీ తెలుసు. ఆడపిల్లల జీవితాలతో చెలగాటమాడుతుంటాడు. తండ్రి సర్కిల్ ఇన్స్‌పెక్టర్ అవడంతో అతని ఆటలు సాగుతున్నాయి. కొడుకు మీద కంప్లయింట్ వచ్చినా యాక్షన్ తీసుకోలేదని శేఖర్ తండ్రిని ఇక్కడి నుంచి తెనాలికి ట్రాన్స్‌ఫర్ చేశారు. అన్నీతెలిసి నువ్వతని చుట్టూ ఎందుకు తిరుగుతున్నావ్? " అంటూ కాళిందిని మందలించింది అమృత.

"అతనంటే ప్రాణం! పెళ్లి చేసుకుంటానన్నాడు. ఒక్కరోజు అతన్ని చూడకపోతే పిచ్చెక్కినట్లుగా ఉంటుంది" అంది కాళింది.

"నువ్వు చదివేది పదోతరగతి. ప్రేమలో పడే వయసు కాదిది. ప్రేమంటే ఏమిటో తెల్లియని వయసు. బాగా చదువుకుని ఉద్యోగం వచ్చేక నీకు నచ్చినవాడిని పెళ్లి చేసుకో! ఇప్పుడు చక్కగా చదువుకో!" నచ్చజెప్పింది అమృత.

ఆమె మాటలు వింటున్నట్లు నటించింది గానీ, కాళింది మనసు అతనిమీదే వుంది.

పదోతరగతి పరీక్షలు దగ్గరికొచ్చాయి. రెండుమూడుసార్లు కాళింది ఇంటికెళ్లి పరీక్షల మీద దృష్టి పెట్టేట్లు ప్రోత్సహించింది అమృత.

ఓ రోజు భావనారాయణస్వామి ఆలయానికి వెళ్లింది అమృత. ఆమెకు తోడుగా హరిత వెళ్లింది. ఆలయ ప్రాంగణంలో దరహాస్ కన్పించాడు.

"ఎప్పుడొచ్చారు? "

"ఓ గంట ముందొచ్చాను. స్నానం చేసి గుడికొచ్చాను"

"సివిల్స్ ఇంటర్వ్యూ ఎలా జరిగింది? " అడిగింది అమృత.

"స్వామి దర్శనం అయ్యేక తీరిగ్గా మాట్లాడుకుందాం!" అన్నాడతను.

గాలిగోపురం దాటుకుని లోపలికి వెళ్తేటప్పుడు ఆలయం గురించి చెప్పడం మొదలుపెట్టాడు దరహాస్.

"భావనారాయణస్వామి ఆలయంలో ఐదు శాసనాలున్నాయి. తొలి శాసనం క్రీ.శ. 1119 నాటిది. చివరిది క్రీ.శ. 1551 నాటిది. తూర్పు ముఖంగా వుందీ ఆలయం. గర్భగుడి అంతరాళం, ముఖమండపం మహామండపం- ఈ ఐదు భాగాలూ శోభాయమానంగా వుంటాయి. పన్నెండుమంది ఆళ్వారుల విగ్రహాలూ వున్నాయి. అందుకే పొన్నూరును 'స్వర్ణపురి' అంటారు" అన్నాడు దరహాస్.

దర్శనం అయ్యేక ఆ ప్రాంగణంలోని పొన్నచెట్టు దగ్గర గచ్చుమీద కూర్చున్నారు. ముఖమండపం దగ్గరున్న జయ, విజయ విగ్రహాలు చూస్తూ వుంది హరిత.

"ఇప్పుడు చెప్పండి మీ ఇంటర్వ్యూ గురించి.. లోపలికెళ్ళగానే 'ఎన్నిమెట్లు ఎక్కివచ్చారు? ' అని మొదటి ప్రశ్న

వేశారా? " కుతూహలంగా అడిగింది.

దరహాస్ నవ్వుతూ "యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్‌వాళ్ళు మరీ అంత సబ్‌స్టాండర్డ్ ప్రశ్నలు అడగరు. ఆప్షన్ ఇచ్చిన సబ్జెక్ట్ మీదే ప్రశ్నలేస్తారు. 'అవును', 'కాదు' అని కాకుండా క్రిస్ప్‌గా సమాధానాలివ్వాలి! ఇంటర్వ్యూ అంటే పర్సనాలిటీ టెస్ట్. ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ అధికారికి వుండాల్సిన ప్రతిభ వుందో? లేదో? తెలుసుకునే విధంగానే వుంటాయి వాళ్ళడిగే ప్రశ్నలు" అన్నాడు.

"సెలక్టవుతానని కాన్ఫిడెన్స్ వచ్చిందా? " అడిగిందామె.

ఆకాశంకేసి చేతులెత్తి చూపించాడు.

"ఆకాశంవైపు చూపిస్తున్నారు సెలెక్టయ్యే అవకాశాలు 'శూన్యం' అనా, లేక సెలెక్ట్ అవబోతున్నాననే ఆనందం అంబరం తాకుతోందా? " నవ్వుతూ అడిగింది.

"త్వరలోనే తెలుస్తుందిగా" అన్నాడతను.

"మా అన్నయ్య మెయిన్స్‌లోనే తప్పాడు. ఇంటర్వ్యూ దాకా లేదు. ఈమధ్య సినిమాల్లో నటించాలనే ఆలోచనల్లో పడ్డాడు"

"ఏ రంగమైనా అనుకున్నది సాధించాలనే పట్టుదల వుండాలి! పట్టుదల లేకపోతే ఎన్ని సుగుణాలున్నా వ్యర్థమే!"

అప్పటివరకూ ఆలయప్రాంగణంలో ఆడుకుంటున్న హరిత వచ్చి వాళ్ళిద్దరి మధ్య కూర్చుని "ఈ రోజు మా స్కూల్లో 'తెలుగోడా' పాట నేర్పించారు" అంది.

"ఏదీ పాడు.. వింటాం!"

"పాటంతా రాదు, కొద్దిగా వచ్చు"

"నీకు ఎంతవరకొస్తే అంతే పాడు"

గొంతు సవరించుకున్నట్లు చిన్నచిన్న శబ్దాలు చేసి పాట అందుకుంది

"చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవాడా!
సాటిలేని జాతి ఓటమెరుగని కోట
నివురుగప్పి నేడు నిదురపోతుండాది
వీరరక్తపు ధార - ధారవోసిన సీమ
పలనాడు నీదేర వెలనాడు నీదేర
బాలచంద్రుడు చూడ ఎవడోయి
తాండ్ర పాపయ గూడ నీవోడు!
కాకతి రుద్రమ్మ, మల్లమాంబ, మొల్ల
మగువ మాంచాల నీ తోడబుట్టిన వాళ్ళే
వీరవనితలు గన్న తల్లిరా
ధీరమాతల జన్మ భూమిరా!
చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతో ఘనకీర్తి గలవాడా!"

వాళ్ళిద్దరూ హరిత భుజం తట్టి బాగా పాడావని మెచ్చుకున్నారు.

"వెలనాడంటే ఏ ప్రాంతం? " అడిగింది అమృత.

"వెలనాడంటే తెనాలి, రేపల్లె, బాపట్ల, గుంటూరు మండలాలున్న ప్రాంతం. కొత్తగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని అదే! అమరావతి, తాడికొండ, తుళ్ళూరు ప్రాంతాలు వెలనాడులోనివే! ఒకప్పటి కొండవీడు రాజ్యం ఈ ప్రాంతంలోదే! పలనాడులో చంద్రవంక, నాగులేరు వాగు లున్న మెట్టప్రాంతం వుంది. సత్తెనపల్లి, గురజాల, దుర్గి, కారెంపూడి, త్రిపురాంతకం పలనాడులో భాగం" చెప్పుకుపోయాడు దరహాస్ పలనాడు, వెలనాడు గురించి.

"సాయంత్రం నిడుబ్రోలు రైల్వేస్టేషన్ దాకా వెళ్దాం! వస్తారా? " అడిగింది అమృత.

"తప్పకుండా! ఈవెనింగ్ వాక్ చేసినట్లుంటుంది" అన్నాడతను.

ఇంటిముఖం పట్టారు ముగ్గురూ.

★ ★ ★

సాయంత్రం నిడుబ్రోలువైపు బయల్దేరారు. పొన్నూరు, నిడుబ్రోలు రెండూ కలిసే వుంటాయి.

దరహాస్ పక్కనే నడవడం ఆనందంగా వుందామెకు. మనసును తొలకరి జల్లు తడిపేస్తున్న అనుభూతి.

ఆమె పక్కన నడుస్తూంటే పూలపరి

అక్షరం

నిజాయితీ పరుడైన వ్యక్తి
తన అంతరాత్మ అంగీకరించని
పని చేయడు

– ఎమర్సన్



మళం చుట్టుముట్టినట్లుగా వుందతనికి. అంతకుముందు ఆమెతో ఎప్పుడు మాట్లాడినా, పక్కన నిలబడ్డా చిరకాల స్నేహితురాలిలా అన్పించేది. ఇప్పుడేమో హృదయంలో పులకింతలు మొదలయ్యాయి. నడుస్తున్నప్పుడు అప్రయత్నంగానే ఆమె చేతులతనికి తగులుతున్నాయి. కొంచెం దూరంగా నడవాలనుకున్నా ఇద్దరి భుజాలు, చేతులు రాసుకుంటూనే వున్నాయి.

నిడుద్రోలు రైల్వేస్టేషన్ రోడ్డులో వుండే ఓ స్నేహితురాలిని కలవాలని బయల్దేరింది. ఆ ఇంటికి తాళమేసి వుంది.

"రైల్వేఫ్లాట్‌ఫారం మీద కాసేపు నడుద్దాం!" అన్నాడతను.

తలూపిందామె.

"పూలు, తేనె రంగరించినట్లు అందంగా కన్పిస్తున్నావ్!" అందామనుకున్నాడు గానీ పెదాలుదాటి మాటలు బయటకు రాలేదు.

ఫ్లాట్‌ఫారం ఈ చివర్నుంచి ఆ చివరకు మెల్లగా నడుస్తున్నారు. అమృత దృష్టి సిమెంట్‌బెంచి మీద తలొంచుకుని కూర్చున్న కాళింది మీద పడింది.

'కాళింది ఇక్కడెందుకుంది?' అనుకుంది తనలోతాను.

ఆ అమ్మాయి ఏం చేస్తుందో చూద్దామనుకుంది. దరహాస్ చెయ్యి పట్టుకుని కొంచెం దూరంగా బెంచీ దగ్గరకు వెళ్ళింది.

అరగంట గడిచినా ఆ అమ్మాయి అక్కడి నుంచి కదల్లేదు. విజయవాడ వైపు వెళ్ళే ట్రైన్ వెళ్ళిపోయింది.

కాళింది తలొంచుకుని ఏడుస్తూనేవుంది.

కాళింది ప్రేమించిన శేఖర్ తెనాలికి మకాం మార్చాడు, అతని తండ్రికి ట్రాన్స్ఫర్ అవ్వడంతో.

సెల్‌ఫోన్‌లో అతనితో మాట్లాడటానికి చాలాసార్లు ప్రయత్నించింది. తెనాలిలో అతను మరో అమ్మాయితో తిరుగుతున్నాడని ఓ స్నేహితురాలి ద్వారా కాళిందికి తెలిసింది. దాంతో ఆమెకు ఆదుర్దా ఎక్కువైంది. తనతో శేఖర్ మాట్లాడటానికి ఇష్టపడటం లేదని తెలుసుకుంది.

ఉదయం ఫోన్లో దొరికాడు.

"మీ ఇంటికి వచ్చేస్తున్నా! నిన్ను చూడకుండా నేను బతకలేను" అంది కాళింది.

"ఎందుకంత తొందరపడతావ్. పెళ్ళి చేసుకోవడానికి చాలా సమయం వుంది. నాకు వీలు చిక్కినప్పుడు నీ దగ్గరకు వస్తాను" అన్నాడతను.

"లేదు..లేదు.. సాయంత్రం వచ్చేస్తాను. తెనాలి స్టేషన్‌కు వచ్చి నన్ను మీ ఇంటికి తీసుకువెళ్ళు!"

"నువ్వొస్తే మా నాన్న నన్ను ఇంట్లో నుంచి తరిమేస్తాడు. నేనే సాయంత్రం వస్తాను నిడుద్రోలు రైల్వేస్టేషన్‌లో ఎదురుచూస్తూ వుండు" అన్నాడతను.

అతని మీద నమ్మకంతో ఎదురుచూస్తూ వుంది. సాయంత్రం నాలుగింటికి వస్తానన్నవాడు ఆరయినా రాలేదు.

దుఃఖం పొర్లుకు ఒచ్చింది.

కాళిందిని సముదాయించే ప్రయత్నం చేసింది అమృత.

"అతనికి ఉద్యోగం లేదు. డిగ్రీ కూడా పూర్తిచెయ్యలేదు. నువ్వేమో చిన్నపిల్లవి. ఎలా బతుకుదామనుకుంటున్నారు? నిన్ను

## కొత్తగాలి...

**అమ్మంటే దైవం**
**ఆనాటి కొడుకులకు**
**ఆలి వచ్చాక అమ్మే భారం**
**ఈనాటి సుపుత్రులకు**

*- గరిశకుర్తి రాజేంద్ర,*
*కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా*

ఏదోక ఊరు తీసుకువెళతాడు. వారంరోజులు ఏదోక హోటల్లో వుంటారు. మీరు వెంట తెచ్చుకున్న డబ్బు అయిపోతుంది. ఎలా బతకాలో తెలియక నిన్ను వదిలేసి అతను వెళ్ళిపోతాడు. నువ్వు ఇంటికి రాలేని పరిస్థితి. ఎవడో మాయగాడు నువ్వు ఒంటరిగా వున్నావని తెలిసి నిన్ను ఏ బ్రోతల్‌హవుస్‌కో అమ్మేస్తాడు. నువ్వు ఎక్కడవున్నావో తెలియక మీ అమ్మానాన్నలు మంచం పడతారు" జరగబోయేది అంతా వివరంగా చెప్పింది.

వస్తానని చెప్పి రాలేదని అతని మీద ఓ పక్క కోపం, ఇంటికి వెళ్తే తల్లిదండ్రులు ఏమంటారోనన్న బాధ, ఆ అమ్మాయి మనసును మెలితిప్పాయి.

"ఇంటికి వెళ్దాం పద!" అంది అమృత.

"శేఖర్‌తో కలిసి వెళ్తున్నాను. మళ్ళీ ఇంటికి తిరిగిరాను. నా గురించి మీరు దిగులు పడకండి!- అంటూ ఓ చీటి రాసి టేబుల్‌మీద పెట్టి వచ్చాను. ఆ చీటి చూస్తే మా అమ్మానాన్నలు నన్ను నరికేస్తారు" అంది భయంతో వణికిపోతూ.

"మీ అమ్మానాన్నలతో నేను మాట్లాడుతాను. నీకేం భయంలేదు. ఇంటికి పద!" అంది అమృత.

లోలోపల ఉడికిపోతోంది కాళింది.

మనసులో స్థిరపడిన శేఖర్ ముక్కు, చెవులు, కాళ్ళు, చేతులు.. అన్నిటినీ పదునైన కత్తితో నరికివేసింది కసిగా.

చివరకు అతని రూపమే మాయమైంది ఆ అమ్మాయి మనసు నుంచి.

"పదో తరగతి పరీక్షలు దగ్గరకు వచ్చాయి. అన్నీ మరిచిపోయి శ్రద్ధగా చదువుకో! స్కూల్ ఫస్ట్ నువ్వే రావాలి!" అంది అమృత.

అమృత చెయ్యి పట్టుకుని వదల్లేదు కాళింది.

★ ★ ★

"అమ్మా! నాకు యాభైవేలు కావాలి" అడిగాడు వికాస్.

"ఎందుకు? " అడిగింది అనసూయ.

"సినిమాల్లో నటించాలని ఎప్పటి నుంచో ఉంది నాకు.. మీరేమో 'సివిల్స్' అంటూ నా వెంటపడ్డారు.. మీ గోల పడలేక కష్టపడి చదివాను.. అయినా మెయిన్స్‌లో పోయింది. టాలివుడ్‌లో నా అదృష్టం పరీక్షించుకోవాలనుకుంటున్నా ను.. ఫొటో సెషన్ అయ్యింది.. నా ఫొటోలు చూసి ఓ డైరెక్టర్ నన్ను సైడ్ హీరోగా తీసుకుంటానన్నాడు.. సినీ ఫీల్డ్‌లో తిరగాలంటే చేతిలో డబ్బు ఉండాలి!"

"మీ నాన్నగారి వ్యాపారం దెబ్బతింది తెలుసుగదా! బాత్‌రూమ్‌లో పడి నడుము విరగ్గొట్టుకున్నారు.. మామూలు మనిషి కావడానికి తొమ్మిది నెలలు పట్టింది. హాస్పిటల్, మందుల ఖర్చులు రెండు లక్షలయ్యాయి.."

"అయితే నన్నేం చెయ్యమంటావ్.. ఇంట్లో గోళ్లు గిల్లుకుంటూ కూర్చోమంటావా? " అన్నాడు కోపంగా.

"ఖర్చులు తగ్గించుకోమనే అనేది"

బీరువాలోనుంచి పదివేలు తీసిచ్చింది.

"ఇవేం సరిపోతాయి..? " గొణుక్కుంటూ ఇంట్లో నుంచి బయటపడ్డాడు.

కారు డ్రైవ్ చేసుకుంటూ అమీర్‌పేటవైపు బయల్దేరాడు. దారిలో రోడ్డు పక్కన మ్యూజిక్ సెంటర్ కన్పించింది. పాటల

సీడీ కొనుక్కోవాలనిపించింది.

కారు ఆపి వెనక్కు చూడకుండా డోర్ తీసి రోడ్డు మీద నిలబడ్డాడు. వెనుకవైపు నుంచి వస్తున్న మోటార్‌బైక్ అతని వీపును గుద్దేసింది. మోటార్ బైక్ నడుపు తున్న అతను ఎగిరి రోడ్డుమీద పడ్డాడు. కాళ్లు, చేతుల ఎముకలు విరిగాయి. తనూ పడిపోయాడు.

పైకి ఏం దెబ్బలు కన్పించకపోయేసరికి 'తను అదృష్టవంతుడు' అనుకున్నాడు. నడుం పట్టేసింది. ఆ నడుం నొప్పి తగ్గడా నికి టాబ్‌లెట్లు రాసిచ్చాడు డాక్టరు. నొప్పి తగ్గలేదు.. వారం రోజులు గడిచేసరికి నడుం నొప్పి భయంకరంగా మారింది. తట్టుకోలేక హాస్పిటల్లో చేరాడు. అన్నిర కాల పరీక్షలు చేశారు. స్పైనల్‌కార్డ్ దెబ్బ తిన్నదని తేల్చేశారు.

"వెన్నెముక, టిష్యూలు దెబ్బతిన్నాయి. వెన్నెముకలోని కొంతభాగం వాచింది" అన్నాడు డాక్టర్.

"నేను మామూలు మనిషిని కాలేనా? మళ్లీ నడవలేనా? " ఆందోళనగా అడిగాడు వికాస్.

"అంతా నీ అదృష్టంపైన ఆధారపడి ఉంది.. కొన్ని నెలలపాటు మంచంమీదే ఉండాల్సి వస్తుంది.. ఫిజికల్ ఎక్సర్‌సైజ్‌లు చెయ్యాలి! మందులు రెగ్యులర్‌గా వాడాలి! లోపల దెబ్బతిన్న టిష్యూలు రిహేబిలిటేట్ కావాలి! వాపు తగ్గాలి! అన్నిటికంటే ముఖ్యం 'నేను తొందరగా కోలు కుంటాను' అన్న ఆత్మవిశ్వాసం నీలో ఉండాలి..! విల్ పవర్ ఉంటే కోలుకోవడా నికి అవకాశం ఉంది. లాంగ్‌టర్మ్ ట్రీట్ మెంట్ కాబట్టి ఓర్పు-సహనం ఉండాలి! కొన్ని ఆపరేషన్లు కూడా చెయ్యాల్సి ఉం టుంది" అంటూ ట్రీట్‌మెంట్‌కు సంబం ధించిన వివరాలు, అయ్యే ఖర్చు గురించి విపులంగా చెప్పాడు డాక్టర్ కౌశిక్.

మరో విషయం కూడా డాక్టర్ చెప్పాడు.

"మెడికల్ ట్రీట్‌మెంట్ సంగతి మేం చూస్తాం! దానికి తోడుగా మీకు బాగా ఆప్తులు, మీ మీద ప్రేమ కురిపించేవాళ్లు మీ పక్కన ఉండి మీలో ఆత్మస్థైర్యం ప్రోది చెయ్యాలి! మీలో ఆశావహదృక్పథం కల్పించేవాళ్లు మీకు తోడుగా ఉండాలి! దెన్ యు విల్ గెట్ బాక్ యువర్ మూ మెంట్స్! మామూలు మనిషి కాగలుగు తారు ఒకటి, రెండు సంవత్సరాలలో.. ఒకటి రెండు నెలల్లో తగ్గిపోతుందని మాత్రం అనుకోకండి!"

ఎవరున్నారు తనకు తోడుగా ఉండటా నికి? అమ్మానాన్నల ఆరోగ్యం అంతంత మాత్రమే! డ్రెస్సింగ్ చెయ్యాలి.. బెడ్‌పాన్ పెట్టాలి! బట్టలు మార్చాలి!

కళ్లల్లో నీళ్లు తిరిగాయి వికాస్‌కు.

తను ఎంతో అందగాడని విర్రవీగుతూ ఉండేవాడు.. ఎవరినీ లెక్క చేసేవాడు కాదు. ఎవరికీ ప్రేమను పంచలేదు. అన్నింటిలో వైఫల్యం చెందాడు..

ఎవరు తనకు తోడుగా ఉంటారు?

★ ★ ★

"అవసరమైన ఆపరేషన్ చేశాం! వారం రోజుల తరువాత డిశ్చార్జ్ చేస్తాం" అన్నాడు డాక్టర్ కౌశిక్.

"మా ఊరు తీసుకువెళ్లవచ్చా? " అడి గింది అనసూయ.

"తీసుకు వెళ్లండి.. రోజూ రెగ్యులర్‌గా ఫిజియోథెరపీ ఎక్సర్‌సైజ్ చేయించాలి. మేం రాసిన మందులు వాడాలి! డ్రెస్సింగ్ చేస్తూ ఉండాలి. వీపుమీద పుళ్లు రాకుండా రోజూ మెడికేటెడ్ పౌడర్ చల్లుతూ ఉండాలి. క్రీము రాసి కట్టు కట్టాలి! ఈ పనులు చెయ్యడానికి మరో నర్సును ప్రత్యే కంగా పెట్టుకోండి! అతన్ని ఉత్సాహపరిచే అమ్మాయి అయితే మరింత తొందరగా కోలుకుంటాడు.. అప్పుడప్పుడు ఇక్కడకు తీసుకువచ్చి చెకప్ చేయించండి! ఐ విష్ యూ స్పీడ్ రికవరీ!" అన్నాడు డాక్టర్

కౌశిక్, వికాస్‌కు షేక్ హ్యాండ్ ఇస్తూ.

వికాస్ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు తల్లిదండ్రులు.

కొడుకు కలెక్టర్ అవుతాడని కలలు కన్నారు.

ఆ కల నిజం కాలేదు.

వికాస్ సినిమా యాక్టర్ కావాలనుకున్నాడు. ఆదిలోనే హంసపాదు పడింది.

డాక్టర్‌తో వికాస్‌ను స్వగ్రామం తీసుకువెళ్తామని చెప్పింది గానీ, అక్కడికి వెళ్లాలంటే మొహం చెల్లడంలేదు. బాపయ్య వద్దని చెబుతున్నా పొన్నూరులోని పొలం అమ్మేశారు. ఆ డబ్బు వ్యాపారం మీద పెట్టారు. అదీ ఊడ్చుకుపోయింది. బ్యాంకులో ఉన్న డబ్బంతా ఖర్చయ్యింది.

మరో రెండు మూడేళ్లపాటు వికాస్ చికిత్సకు అయ్యే ఖర్చు భరించాలి. పొన్నూరులో ఉన్నప్పుడు చెల్లెలు మీద దాష్టీకం చేసేది అనసూయ. ఇప్పుడు ఆ చెల్లెలే వికాస్ వైద్య ఖర్చులు భరించాలి.

బాపయ్య పేరు మీద రెండు ఎకరాలు తప్పితే.. పొన్నూరులో తమదంటూ ఆస్తి లేదు. పాత ఆర్సీ ఇల్లు మాత్రమే ఉంది.

సుగుణ ఫోన్ చేసింది.

"ఎలా ఉన్నారు? పొన్నూరు ఎప్పుడు వస్తారు? " అడిగింది సుగుణ.

"వెన్నెముక దెబ్బతింది వికాస్‌కు.. కోలుకోవడానికి రెండు, మూడేళ్లు పడుతుందట.. మా పరిస్థితి అంతా తల్లకిందులయ్యింది" ఏడ్చేసింది అనసూయ.

"బాధపడకు అక్కా! ఇక్కడకు వచ్చేయండి.. అందరం కలిసి ఉందాం.. ఒకరికొకరు తోడుగా ఉండొచ్చు!"

"ఇక్కడ కొన్ని అప్పులు చేశాం! అవి తీర్చితేగానీ ఇక్కడ నుంచి కదల్లేం.. రెండు లక్షలు కావాలి? " అడగలేక అడగలేక అడిగింది చెల్లెల్ని.

"డబ్బు పంపుతా గానీ అప్పులు తీర్చేసి వెంటనే పొన్నూరు వచ్చేయండి. మీ ఆరోగ్యాలే అంతంత మాత్రం! వికాస్‌కు సపర్యలు చెయ్యాలన్నా కష్టం మీకు. ఇక్కడైతే అందరం ఉంటాం కాబట్టి వాడికీ ధైర్యంగా ఉంటుంది. తొందరగా కోలుకుంటాడు.."

"నిన్ను కసురుకునేదాన్ని.. తిట్టేదాన్ని! ఇప్పుడు నువ్వే మమ్మల్ని ఆదుకుంటున్నావు" అంది పెద్దగా ఏడుస్తూ.

"మనిద్దరం ఒక తల్లికి పుట్టినవాళ్లం.. నీకు నేను, నాకు నువ్వు..! మావారి తరపు ఆస్తి తరగనంత ఉంది. మా అత్తమామలు ఆస్తి సంపాదించారే గానీ ఖర్చు పెట్టడానికి ఇష్టపడేవాళ్లు కాదు. పైసా పైసా ముడివేసి దాచుకునేవాళ్లు. ఇప్పుడు ఆ డబ్బు సద్వినియోగం అవుతోంది. మీరు వెంటనే వచ్చేయండి!" అంది సుగుణ.

చెల్లెలి మాటలు ధైర్యాన్నిచ్చాయి అనసూయకు.

★ ★ ★

వికాస్‌ను పొన్నూరు తీసుకువెళ్లారు.

మళ్లీ అందరూ ఆర్సీ ఇంటికి చేరుకోవడం విఠల్‌కు ఆనందాన్ని కలిగించింది. ఎన్నో ఆశలతో సొంత ఊరు వదిలి పట్నం వెళ్లాడు.. అన్నీ పోగొట్టుకుని మళ్లీ తిరిగి వచ్చాడు. పోయిన సంపద తిరిగి రాకపోయినా అందరూ ఆరోగ్యంగా ఉంటే చాలనుకున్నారు. ఆర్సీ ఇంట్లో తిరుగుతుంటే కొత్త ఉత్సాహం వచ్చేసింది.

చెల్లెల్ని పట్టుకుని ఏడ్చేసింది అనసూయ.

"ఎందుకు బాధపడుతున్నావ్? " అడిగింది సుగుణ.

"నీ భర్త చనిపోయాక నువ్వు ఇక్కడ చేరితే 'దిక్కులేక మా మీద వచ్చి పడ్డావ'ని నిన్ను ఈసడించేదాన్ని! పూచికపుల్లను తీసేసినట్లు మాట్లాడేదాన్ని. ఇప్పుడు నువ్వే దిక్కు అయ్యావు. అనాథాశ్రమాన్ని ఆదుకున్నావు. అమృతను చదివించావు. వికాస్‌కు హాస్పిటల్ ఖర్చు నువ్వే పెట్టుకున్నావు. నీ భర్త నుంచి నీకు ఆస్తి రావ

ఆకుపచ్చగా మార్చేస్తుంది. నువ్వేం దిగులుపడకు! వికాస్ తొందరలోనే కోలుకుంటాడు. అమృత ఉద్యోగం చేస్తూ ఉంది. దానికి మంచి మొగుడు వస్తాడు" అంది సుగుణ అక్క చేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ.

వాళ్లిద్దరూ మాట్లాడుకునేటప్పుడే లాలిత్య వచ్చి, "వికాస్‌ను పలుకరిద్దామని వచ్చాను" అంది.

"గదిలో ఉన్నాడమ్మా! వెళ్లి మాట్లాడు" అంది సుగుణ.

వికాస్ ఉన్న గదిలోకి వెళ్లింది లాలిత్య.

అశాంతిగా అటూ ఇటూ కదులుతూ ఉన్నాడు వికాస్. గదిలోకి వచ్చిన లాలిత్యను చూడగానే ముఖంలోని చిరాకు తొలగిపోయింది. గదిలో అతనొక్కడినే వదిలేసి ఎవరి పనుల్లో వాళ్లున్నారు. తల్లిదండ్రులకు తన ఎదురుగా కూర్చునే ఓపిక లేదు. అమృత స్కూలుకు వెళ్తూ ఉంది. పిన్నికి ఇంట్లో పని సరిపోతూ ఉంది.

బాపయ్యతాత అప్పుడప్పుడూ తన ఎదురుగా కూర్చుని కాసేపు కబుర్లు చెప్పి వెళ్లిపోతున్నాడు. ఆయనకు ఎనభై ఏళ్లు వచ్చాయి. ఇరవై నాలుగ్గంటలూ తన ఎదురుగా ఎలా ఉండగలడు?

ఒంటరితనం భరించలేకపోతున్నాడు తను. పక్కన కూర్చుని మాట్లాడే వాళ్లు కావాలి.

"ఎలా ఉంది మీకు? " అడిగింది లాలిత్య, అతని మంచం దగ్గరికి కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

"స్పైనల్ ఇంజూరీ. వెన్నెముక దెబ్బతింది యాక్సిడెంటులో. శాశ్వతంగా మంచం మీదే ఉండాలేమో! లేచి తిరిగే యోగం రాదేమో!" అన్నాడు జీరబోయిన గొంతుతో.

అతని కళ్లు తడిసి ఉండటం గమనించిందామె. శరీరంలో సన్నటి వణుకు కనిపిస్తోంది.

పాతికేళ్ల నిండు యవ్వనంలో ఎంతో హుషారుగా ఉండాల్సిన వికాస్ అలా మంచానికి అతుక్కుపోయి ఉండటం ఆమెకూ బాధేసింది.

"ఏదైనా కోల్పోవచ్చు గానీ ధైర్యాన్ని పోగొట్టుకోకూడదు. మీరు తప్పకుండా కోలుకుంటారు. చిన్నప్పటి నుంచి మిమ్మల్ని చూస్తూనే ఉన్నాను. అందరినీ ఆటపట్టించేవాళ్లు. నవ్వుతూ కన్పించేవాళ్లు. మిమ్మల్ని అలా చూడటమే నాకు ఇష్టం. మీరు దీనంగా ఎవరివైపూ చూడకూడదు. తాతగారు చెబుతూ ఉంటారు ఎప్పుడూ. ఆర్మీ ఇంట్లోవాళ్లు దర్పంగా, దర్జాగా ఉంటారని. మీ పూర్వీకులను గుర్తుకు తెచ్చుకుని ధైర్యంగా ఉండండి. ఆర్మీ ఇల్లన్నా, ఈ ఇంట్లో మనుషులన్నా నాకు ఆరాధనా భావం ఉంది. నా చిన్నతనంలోనే బలమైన ముద్ర పడిపోయింది. ఇప్పుడు మిమ్మల్ని ఇలా బేలగా చూడలేను. మీరు నవ్వుతూ కన్పించాలి!" అంది లాలిత్య అతని చేతిని నిమురుతూ.

ఆ మృదుస్పర్శకు కరిగిపోయేడు. తెలియని వీరావేశం నరనరాల్లో కదిలింది. తనకేం కాలేదన్న భావన ఏర్పడింది.

ఆ అమ్మాయి ఎప్పుడూ తన ఎదుటే కూర్చుంటే బాగుంటుందనుకున్నాడు. ఆమె చేతి స్పర్శద్వారా తనలో పాకిన వెచ్చదనం ఉండిపోవాలి. ఆమె వెళ్లిపోతే తను మళ్లీ మంచుగడ్డలమీద పడుకోవాలేమో!

చిన్నతనంలో లాలిత్య జడలాగి అల్లరి చేసేవాడు. వెనగ్గా వచ్చి మొట్టికాయలు మొట్టేవాడు. ఎన్నిచేసినా వెనుకే తిరిగేది.

"వాడితో ఏం పని? ఆడపిల్లలతో ఆడుకో!" అని అమ్మ కోప్పడేది లాలిత్యను.

కొత్త పరికిణీ, లంగా తనకు చూపించాలనుకుని వచ్చి ఎదురుగా నిలబడి "ఎలా ఉన్నాయి కొత్తబట్టలు? " అనడిగేది.

"పాతగుడ్డలు కట్టుకుని ఎలా ఉన్నాయని అడుగుతున్నావా? "

"కొత్తవి. కావాలంటే మా అమ్మను



డంతో నీది పై చెయ్యి అయ్యింది. నేనేమో అన్నీ పోగొట్టుకున్నాను. బ్యాంకుల్లోనీ డబ్బు ఖర్చు పెట్టేశాం! ఇక్కడి పొలం అమ్ముకున్నాం! ముందు ముందు ఎలా గడుస్తుందో? " అంది అనసూయ కన్నీళ్లు తుడుచుకుంటూ..

"అక్కా! నువ్వు, నేను వేరు అనుకోలేదు ఎప్పుడూ! నీ పిల్లలు నా పిల్లలే అనుకున్నాను. వికాస్ మంచాన పడితే నీకంటే ఎక్కువ బాధ పడుతున్నాను. వాడు పుట్టినప్పుడు నీకు జబ్బు చేసింది. నేనే వాడిని పెంచాను. కష్టాలు వచ్చినప్పుడు కుంగిపోకూడదు. నల్లటి మబ్బులు తెల్లటి ఆకాశాన్ని కమ్మేస్తాయి. ఆ మబ్బుల్ని చూసి కంగారుపడతాం! వర్షం కురిపించి మాయమైపోతాయి మబ్బులు. ఆ వర్షం భూమిని

అడుగు" అనేది.

ఆ అమ్మాయి బట్టలకు సిరా పూసే వాడు. బట్టలకు మరకలు అతను అంటిం చినట్లు ఎవరికీ చెప్పేది కాదు.

"ఎప్పుడూ మా ఆర్సీ ఇంటి చుట్టూ తిరు గుతావేం? " అనేవాడు ఆ అమ్మాయితో.

"ఆర్సీ ఇల్లంటే నాకు ఇష్టం! మీ తాత ముత్తాతలు ఊరికి చేసిన ఉపకారాల గు రించి ఊళ్లోవాళ్లు చెబుతూ ఉంటారు. బాపయ్యతాత దగ్గర కూర్చుంటే వెనుకటి తరాలవాళ్ల గురించి చెబుతూ ఉంటాడు. ఆ కబుర్లంటే ఇష్టం!" అనేది.

"మా ఇంట్లో పనిచేసేవాడిని పెళ్లిచేసు కో! ఎప్పుడూ మా ఇంటి కబుర్లు చెబుతూ ఉంటాడు" వెక్కిరించేవాడు తను.

"గోడ ఎక్కి సన్నజాజి పూలు కోసిపె ట్టావు నాకు. నువ్వు నాకింద పనిచేసే పని వాడివా? " అనేసి తుర్రుమంది.

మళ్లీ కనిపించినప్పుడు ఆ అమ్మాయి చెంప చెళ్లుమనిపించాడు. తను కొట్టినట్లు ఇంట్లో ఎవరికీ చెప్పలేదు.

"ఈ ఊరంటే ఇష్టమని చెబుతావు. ఆర్సీ ఇల్లంటే పడి చస్తావు. ఊళ్లో వాళ్లందరినీ మెచ్చుకుంటావు. నేను అప్పుడప్పుడు మొట్టికాయలు వేసినా నా చుట్టూ తిరుగు తావు. రేపు పెళ్ళయ్యాక నీ మొగుడింటికి పరిగెత్తాలిగా? " అడిగాడు ఓసారి.

"ఆర్సీ ఇంట్లో ఉండే అబ్బాయినే పెళ్లి చేసుకుంటాను" అంది లాలిత్య నవ్వుతూ.

"నీ మొహానికి ఆర్సీ ఇంటి అబ్బాయి కావాలా? " అంటూ చెవి మెలిపెట్టాడు. తప్పించుకుని పరిగెత్తింది. అక్కడే ఉంటే వీపుమీద పిడిగుద్దులు పడేవే.

"నువ్విక్కడే ఉంటావా? " అడిగింది ఓసారి.

"ఈ ఊళ్లో నేనెందుకు ఉంటాను. చిన్న టౌను ఇది. చుట్టూ అన్నీ పల్లెటూళ్లే! ఇక్కడ ఉద్యోగాలేం దొరుకుతాయి? పట్నం వెళ్తే బోలెడన్ని ఉద్యోగాలు.. బాగా చదువుకుని కలెక్టర్ కావాలని మా అమ్మ

**కొత్తగాలి...**

**నిరుత్సాహం**
**నిన్ను కాలుస్తుంది!**
**ఉత్సాహం**
**నీకు ఊపిరి పోస్తుంది!**

– మా.శ్రీ. రాజు,
పాల్వంచ, ఖమ్మం జిల్లా

అంటూ ఉంటుంది"

"కలెక్టర్ అయ్యేక ఈ ఊరికి ఏం చేస్తారు? "

"ఊళ్లోవాళ్లకి పనులు చేసిపెడితే ఏం వస్తుంది? పెద్ద పెద్దవాళ్లకు సహాయప డితే వాళ్లూ మనకు సహాయ పడతారు. ఎన్నో మెట్లు పైకి ఎక్కొచ్చు!"

"మొదటి మెట్టును మర్చిపోతారా? "

"ఇప్పుడు మెట్లెక్కి కష్టపడుతూ పైకి చేరుకోవాల్సిన అవసరంలేదు. వంద అంత స్తుల భవనంపైకి నిమిషంలో లిఫ్ట్‌లో చేరుకోవచ్చు!"

"పడిపోగలవు జాగ్రత్త.. అసలే నీకు ఆత్రం ఎక్కువ"

"పడితే పట్టుకోడానికి నువ్వున్నావుగా? "

"మా ఊళ్లో ఉంటే నువ్వు పడిపోకుండా పట్టుకుంటాను. నువ్వు పట్నం పరిగెత్తితే నేనెలా నీకు సాయపడతాను? "

"నీ సహాయం వద్దు.. నువ్వూ వద్దు.. నీకు అంతా కుళ్లు.. నేను పట్నం వెళ్లి పెద్ద ఆఫీసర్ని అవుతానని"

లాలిత్యను నెట్టేసి పరుగెత్తిన చిన్నప్పటి దృశ్యం కళ్లలో మెదిలింది.

"ఏమిటి ఆలోచన? " అడిగింది లాలిత్య.

"చిన్నప్పటి సంగతులు గుర్తుకొచ్చాయి. ఈ ఊరన్నా, ఊళ్లో వాళ్లన్నా చిన్నచూపు ఉండేది. రెక్కలు కట్టుకుని పట్నం వెళ్లి

పెద్దపెద్ద పదవులు చేపట్టాలని ఊహల పల్లకిలో ఊరేగేవాడిని. రెక్కలు తెగిపోయాయి. మళ్లీ వచ్చి సొంత ఊరులో పడిపోయాను. నువ్వేమో అందరినీ అభిమానించేదానివి. చెలిమికి చిరునామాగా మారిపోయింది ఊరు. మీ అమ్మానాన్నలు హరితను చేరదీసి పెంచారు. మూర్తి మాష్టారు అనాథాశ్రమం పెట్టారు. అమృత సహకారం అందిస్తూవుంది. మా పిన్ని అందరినీ ఆదుకుంటూ ఉంది. నువ్వేమో సర్వీస్ పెట్టి అందనంత ఎత్తుకు ఎదిగావు. పిల్లలు, పెద్దలందరికీ తల్లో నాలికలా ఉంటాడు మా తాతయ్య" అన్నాడతను.

"మన ఊరే కాదు. కక్షలు, కుట్రలు, కుతంత్రాలకు దూరంగా ఉన్న ఊళ్ళన్నీ చెలిమికి చిరునామాగా మారుతూనే ఉన్నాయి. మీకేం రెక్కలు తెగిపోలేదు. చచ్చుబడ్డాయి తాత్కాలికంగా! ఆత్మస్థైర్యం పెంచుకుంటే మళ్లీ మామూలు మనిషి అవుతారు. మంచిపనులు చేసి జన్మభూమి రుణం తీర్చుకోవచ్చు!" అంది అతనికి ధైర్యాన్ని నూరిపోస్తూ.

అప్పుడే గదిలోకి వచ్చింది అమృత. అన్న ముఖంలోని ప్రశాంతతను గమనించి, "నువ్వొచ్చి పది నిమిషాలు మాట్లాడేవో లేదో మా అన్నయ్య మొహంలో ఉత్సాహం తొణికిసలాడుతూ ఉంది. నువ్వు రోజూ రావాలి మా ఇంటికి" అంది.

"ఆర్చీ ఇంట్లో అడుగుపెడితే కాళ్లు విరగ్గొడతాను అనేవాడుగా మీ అన్నగారు" అంది లాలిత్య నవ్వుతూ.

"అవి చిన్నప్పటి సంగతులు.. ఓపిక లేనివాడిని.. కాళ్లమీద నిలబడలేని వాడిని నీ కాళ్ళేం విరగ్గొడతాను ఇప్పుడు? " అన్నాడతను కళ్లు ఒత్తుకుంటూ.

"అలా మిమ్మల్ని మీరు తక్కువచేసి మాట్లాడకండి. మళ్లీ మీకు జవసత్వాలు వస్తాయి. నేను పరుగెత్తుతుంటే నా వెంట పడి పరిగెత్తుతూ నన్ను పట్టుకోవాలి!" అంది లాలిత్య అతని చేతిమీద తన చెయ్యి వేసి.

కొండంత భరోసా అనిపించింది.

"రోజూ వచ్చి కనబడుతూ ఉండండి" అన్నాడు వికాస్.

"నేను నర్సుగా ట్రైనింగ్ పొందాను. మీకు ఇంజెక్షన్లు చేయడం, ఏ టైంకు ఏ మందులు వేసుకోవాలో.. అదంతా ఒక సారి నాకు చెబితే దగ్గరుండి మందులిస్తాను. బెడ్‌పాన్ కావాలన్నా, డ్రెస్సింగ్ చేయాలన్నా మొహమాటపడకుండా అడగండి! మీకు పూర్తిగా తగ్గిపోయేవరకు నా చిరునామా మీ ఇల్లే.. మీరే!"

ఆమె చేయి కళ్లకద్దుకోవాలనిపించింది.

ఏమనుకుంటుందోనని ఆ కోరికను మనసులోనే అణచివేసుకున్నాడు వికాస్.




**యు.**పి.యస్.సి. వెబ్‌సైట్ ఓపెన్ చేసి అందులో వచ్చిన సివిల్స్ రిజల్ట్స్ చూశాడు దరహాస్.

ఐ.ఎ.యస్.గా సెలెక్ట్ అయ్యాడు.

గాలిలో తేలిపోతున్నట్లు అన్పించింది. ఉత్సాహం, ఉద్వేగంతో హృదయం పొంగిపోతోంది.

ఇంట్లోంచి బయటకు వచ్చాడు. సూర్యకాంతిలో పూలమొక్కలు మెరుస్తూ కన్పించాయి. పూలమొక్కల పాదులు తండ్రి సరిచేస్తూ ఉంటే, తల్లి మొక్కలకు నీళ్లు పోస్తూ ఉంది.

వాళ్లిద్దరినీ మామిడిచెట్టు నీడలో పక్కప క్కన నిలబెట్టి పాదాలకు నమస్కరించాడు. తల్లిదండ్రుల ఆశీస్సులతోనే తను సివిల్స్‌లో విజయం సాధించింది.

"మీ దీవెనలతోనే ఐ.ఎ.యస్. అధికారిని అయ్యానమ్మా!"

కోటి ఏం మాట్లాడలేకపోయాడు. కొడుకు తల నిమిరాడు.

"పేదవాళ్లకు సహాయపడుతూ మంచి పేరు తెచ్చుకో నాయనా! అంతకంటే మేం కోరుకునేది ఏం ఉండదు. ఎప్పుడూ ఆనందంగా ఉండు" అని దీవించింది.

ఆమె చేతులు కడుక్కుని లోపలికి వెళ్లింది, పాయసం చేసి కొడుకు నోరు తీపి చేద్దామని.

"చెల్లెళ్లు ఇద్దరూ ఏరి? "

"లాలిత్య ఆర్చీ ఇంటికి వెళ్లింది. హరిత పొద్దున్నే లేచి వాళ్ల టీచరింటికి వెళ్లింది. డ్యాన్స్ నేర్చుకుంటున్నది. ఎక్కడకూ వెళ్లకు. పాయసం చేస్తున్నాను" అందామె.

"పది నిమిషాల్లో వచ్చేస్తాను" అని ఆర్చీ ఇంటివైపు నడిచాడు.

బాపయ్య ఎదురొచ్చాడు ఆర్చీ దగ్గర.

"ఏదో హడావుడిగా ఉన్నావ్. అమృతను కలవడానికా? " అడిగాడు బాపయ్య.

"అవునండీ"

"అమృతకు ఏదో చెప్పాలని బయల్దేరినట్లున్నావ్"

తలూపేడు.

"మీరిద్దరూ మాట్లాడుకునేటప్పుడు మీ మొహాల్లో తొంగిచూసే ఆనందం నేను గమనించలేదనుకుంటున్నావా? మా మనవరాలిని ప్రేమిస్తున్నావు గదూ! మిమ్మల్ని చూస్తే ఈర్ష్య కలుగుతున్నదయ్యా! పెళ్లికి ముందు అమ్మాయిని చూడనిచ్చేవాళ్లు కాదు. పెళ్లిపీటల మీద కూడా పెళ్లికూతురు, పెళ్లికొడుక్కు మధ్య దుప్పటి ఉంచేవాళ్లు. సరిగ్గా ముహూర్తం సమయానికి జీలకర్ర, బెల్లం నెత్తిమీద పెట్టమనేవాళ్లు. అప్పుడే ఒకరినొకరు చూసుకునేది. పెళ్లికి ముందు ప్రేమించుకోవడం అద్భుతంగా ఉంటుందని మిమ్మల్ని చూస్తే తెలుస్తూ ఉంది. మా కాలం వాళ్లు ఏం కోల్పోయారో తెలుస్తూ ఉంది" దరహాస్‌ను మాట్లాడనివ్వకుండా తను చెప్పాలనుకుంది చెప్పేశాడు.

"అది కాదండీ" ఏదో చెప్పబోయాడు.

"అమృత నీకు ఇష్టమే కదూ!"

"అమృతను ఇష్టపడనివారెవరు? "

"ఇంటి వెనుక చెట్లనీడలో కూర్చుని పుస్తకం చదువుతోంది. ఇప్పుడే వెళ్లి చెప్పెయ్యి!"

"ఏ విషయం? "

"అదేనయ్యా! నిన్ను తప్పితే మరొకరిని పెళ్ళిచేసుకోనని చెప్పు.. ఎన్నాళ్ళీ దాగుడు మూతలు.. ఒకరంటే ఒకరికి ప్రాణం కానీ బయటపడరు! నేనెందుకు చెబుతున్నానో అర్థంచేసుకో! నా కొడుకు విఠల్ నా మనవరాలికి సంబంధాలు చూస్తున్నాడు. ఇంటిముందు బంగారంలాంటి కుర్రాడిని పెట్టుకుని అమెరికాలో ఉద్యోగంచేసే కుర్రాడిని అల్లుడిగా చేసుకునే ప్రయత్నాలు నాకు నచ్చలేదయ్యా!" అంటూ తన మనసులోని మాట చెప్పేక మనసు తేలికపడింది ఆయనకు. ఇక వాళ్ళకు నచ్చిన నిర్ణయం వాళ్ళు తీసుకుంటారు.

ఇంటి వెనుకవైపుకు వెళ్ళాడు దరహాస్.

సిమెంటు బెంచీమీద కూర్చుని, ఒళ్ళో పుస్తకం పెట్టుకుని ఆకాశంకేసి చూస్తున్నది అమృత.

చిన్నగా దగ్గాడు తన రాకను తెలియజేస్తూ.

"రండి.. రండి.. కూర్చోండి" తన పక్కన కూర్చోమని చెబుతూ బెంచీమీద ఓ పక్కన సర్దుకుని కూర్చుంది.

"మీకో శుభవార్త చెబుదామని వచ్చాను" అన్నాడతను.

"శుభవార్త మీకు సంబంధించినదా?

## కొత్తగాలి...

**నాడు తల్లిదండ్రులంటే**
**పిల్లలకి భయం**
**నేడు పిల్లలంటే**
**తల్లిదండ్రులకు భయం!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై

నాకు సంబంధించినదా? "

"మన ఇద్దరికీ సంబంధించినది. నాకు శుభాన్ని కలిగించే వార్త మీకు ఆనందాన్ని కలిగిస్తుంది కదా"

"చెప్పండి ఏమిటి? పెళ్ళి చేసుకోబోతు న్నారా? ఎవరినైనా ప్రేమించారా? "

"ప్రేమించడం అయిపోయింది. ఇక పెళ్ళి చేసుకోవడమే మిగిలింది. ట్రైనింగ్ పూర్తయ్యేక వాళ్ళకు నచ్చినచోట పోస్టింగ్ ఇస్తారు. గ్రామీణ ప్రాంతాల్లోనే పోస్టింగ్ వుంటుంది మొదట్లో"

"ఎవరిని ప్రేమించారు? ఎవరిని పెళ్ళి చేసుకోబోతున్నారు? పోస్టింగ్ ఏమిటి? సస్పెన్స్‌లో పెట్టకుండా విషయం ఏమిటో చెప్పండి" అందామె.

"నా గుండె గుప్పెడంత.. హృదయ కవాటాలు తెరిచి ఎవరిని ప్రేమిస్తున్నానో, ఎవరిని పెళ్ళిచేసుకుంటున్నానో తెలుసుకో వాలంటే ముందు పాస్‌వర్డ్ టైప్ చెయ్యాలి. నా ప్రేమకు సంబంధించిన పాస్‌వర్డ్ మీ దగ్గరే వుంది.." అన్నాడతను.

వచ్చే నవ్వును ఆపుకుంటూ "పాస్‌వర్డ్ పర్సనల్. మరొకరికి చెప్పకూడదు.. మీరెందుకు మీ పాస్‌వర్డ్ నాకు చెప్పారు" అడిగిందామె.

ఆమె చిరునవ్వులు చిందిస్తుంటే అతని మనసు పరవశించింది.

వలపు పంచుకోవడానికి పలకరిస్తున్న ట్లుగా వున్నాయి ఆమె పెదవులు. నును సిగ్గుల తెరచాటున ఆమె అనురాగం అత నికి స్పష్టంగా కనిపిస్తూనే వుంది. మన సులో వెన్నెలవాగు ప్రవహిస్తోంది.

"కాబోయే శ్రీమతివి నువ్వు. నీకు బహుమతిగా ఎప్పుడో నా ప్రేమ 'పాస్‌వర్డ్' ఇచ్చేశాను. నాదంటూ నాదగ్గర ఏదీలేదు. చిన్ననాటి చెలిమిని పెద్ద కలిమిలా కన్నుల్లో దాచుకున్నాను" అన్నాడతను ఆమెకు దగ్గరగా జరుగుతూ.

"మాటలు నేర్చుకున్నారు" అందామె.

"పాతసినిమాలు ఎక్కువగా చూస్తుంటాను. పాటల, మాటల పరిమళం నన్ను వెంటాడుతూ వుంటుంది. అప్పటి తెలుగు పదాలు మర్చిపోతున్నాం! మధురమైన అచ్చ తెలుగు పదాల స్థానంలో కొత్తప దాలు దొర్లుకొస్తున్నాయి. హైటెక్ పదాలుగా కన్పిస్తాయి, ఇప్పుడు మనం వాడు తున్న కొన్ని పదాలు. తేనెలాంటి తెలుగు దనాన్ని పరిరక్షించుకోవాలి!

"ఏ విషయం చెప్పినా విశ్లేషిస్తూ చెబుతారు. ఐ.ఎ.యస్ లక్షణాలు వచ్చేశాయి మీకు పూర్తిగా"

"ఆ విషయం చెప్పడానికే నేనొస్తుంటే మీ తాతగారు 'అమృతను పెళ్ళిచేసుకో! ఆ విషయం నాన్నొద్దు' అన్నారు. ఆ విషయంలో క్లారిటీ వచ్చేసింది. నీ మనసులో నేనున్నాను. రెండో విషయం సివిల్స్ ఫైనల్ రిజల్ట్స్ వచ్చేశాయి. ఐ.ఎ.యస్.గా సెలెక్ట్ అయ్యాను. ట్రైనింగ్ అయ్యేక పోస్టింగ్ ఇస్తారు. పోస్టింగ్ ఆర్డర్ వచ్చేక మనిద్దరం పెళ్ళి చేసుకుందాం!" అన్నాడు.

రెండు శుభవార్తలు వినేసరికి ఆమె హృదయం తన్మయత్వం చెందింది ఎదలో సిరివెన్నెల కురుస్తూ వుంటే ఆ వెన్నెల ఆమె కళ్ళలో కదలాడింది.

"కాఫీ తీసుకువస్తాను రెండు నిముషాల్లో" అందామె లేచి నిలబడుతూ.

"ఓన్లీ కాఫీ.. నాట్ అదర్ ఐటమ్స్"

"మీరు ఏది కావాలన్నా తీసుకువస్తాను"

"అవేమీ వద్దు.. ఉమర్ ఖయ్యామ్, గాలీబ్‌లా మారిపోతాను అవి సేవిస్తే"

ఇద్దరూ నవ్వుకున్నారు.

లోపలికి వెళ్ళి కాఫీ కప్పుతో వచ్చింది.

"ఒకే కప్పు తెచ్చారు? !"

"చెరి సగం తాగుదాం" అందామె.

ఆమె చేతులకు వేసుకున్న ఆకుపచ్చ రంగు గాజులు సవ్వడి చేశాయి.

ఆ గాజుల సవ్వడి అతని గుండెల్లో గిలి గింతలు పెట్టింది.

కప్పులో కాఫీ సగం తాగి ఆమెకిచ్చాడు.

అతని కళ్ళల్లోకి చూస్తూ కప్పు పెదాల దగ్గర వుంచుకుంది.

"నిన్నొదిలి వెళ్ళాలనిపించడం లేదు, ఇక్కడే కూర్చోవాలనిపిస్తున్నది"

"నాక్కూడా" అందామె.

పూలబంతిలా కన్పించిందామె.

ఆమె భుజాలచుట్టూ చేతులు వేశాడు. ఆమె అభ్యంతర పెట్టలేదు.

"మా నాన్నగారు నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు" అందామె.

"నేను నచ్చలేదా మీ నాన్నగారికి? "

"ఆయన స్నేహితుడి కొడుకు ఐ.పి. యస్. ఆఫీసర్. అతనికిచ్చి పెళ్ళి చేయాలని చూస్తున్నారు. తను ఊహించని ఎత్తుకు మీ కుటుంబం ఎదిగిందని ఆయనకు లోలోపల ఈర్ష్య వుంది. అందుకే మీరు నచ్చరు. మా పిన్నికి, తాతగారికి మీరంటే ఎంతో ఇష్టం"

మౌనంగా వుండిపోయాడు ఏం మాట్లాడాలో తెలియక.

ఆమెకు కొంచెం దూరంగా జరిగాడు.

"ఐ.పి.యస్. అనగానే ఐ.ఎ.యస్. గారు దూరంగా జరిగారు. మా నాన్నగారు ఆయన ప్రయత్నాలేవో ఆయన చేస్తున్నారు. చివరి నిర్ణయం తీసుకోవాల్సింది మా పిన్నే. ఇంట్లో ఆమె మాట ఫైనల్. ఆవిడ మన పక్షం కాబట్టి కంగారుపడాల్సిన పనిలేదు ఆఫీసరుగారూ!"

అనవసరంగా ఆదుర్దాపడ్డాననుకున్నాడు. సామాన్యంగా దేనికీ కంగారుపడడు. తాపీగా, కూల్‌గానే వుంటాడు. కానీ అమృత తను ఒక ఐ.పి.యస్. ఆఫీసర్‌కు ఇచ్చి పెళ్ళి చేయాలన్న తలంపుతో వాళ్ళ నాన్న ఉన్నారని ఆమె చెప్పగానే తన గుండె ఎందుకో దడదడా కొట్టుకుంది. చిరుచెమటలు పట్టాయి. అప్పుడు అర్థమయ్యింది అమృతను తన భార్యగా కాకుండా మరో విధంగా ఊహించుకోలేను. ఆమె దూరమైతే బతుకు చీకటైపోతుంది అనుకున్నాడు.

అతని చూపులు ఆమె మీదే వున్నాయి. ఆమెను చూస్తూ సంవత్సరాలు, యుగాలు గడిపేయవచ్చు

ఆమె నడుంచుట్టూ ఓ చెయ్యివేసి మరో చేత్తో ఆమె మొహాన్ని దగ్గరకు తీసుకుని గులాబీ రేకుల్లాంటి పెదాలను ముద్దు పెట్టుకున్నాడు.

వాళ్ళిద్దరూ ఆ ప్రేమ పరవశంలో మునిగిపోయి తమపక్కన ఎవరొచ్చి నిలబడ్డారో గమనించలేదు. పిన్ని చిన్నగా దగ్గేసరికి తలెత్తి చూసి సిగ్గుపడిపోయింది అమృత.

"వేడివేడి పెసరట్లు తెచ్చాను తినండి!" అంటూ చెరో ప్లేటు ఇచ్చింది సుగుణ.

★ ★ ★

ఒంట్లో ఓపిక లేకపోయినా ఇంట్లోంచి మెల్లగా నడుచుకుంటూ ఆర్చీ దాకా వచ్చాడు బాపయ్య. భుజం మీది ఉత్తరీయాన్ని సర్దుకుని అరుగు మీద కూర్చోబోతే కళ్ళు తిరిగాయి. వెంటనే కూలిపోయాడు. ఎముకలు విరుగుతున్నాయేమో నన్నంత నొప్పులు మొదలయ్యాయి ఒంట్లో.

అప్పుడే ఇంటిముందు నుంచి ఆటోను రోడ్డు మీదకు తీసుకువచ్చి గుడ్డతో తుడుస్తున్న కోటి, బాపయ్యగారు పడిపోవడం చూశాడు. అక్కడకు వచ్చి ఇంట్లో వున్న విఠల్‌ను పిలిచాడు. ఇద్దరూ కలిసి బాప

## కొత్తగాలి...

**వీధుల్లో మురికి తొలగిస్తేనే**
**సాకారం కాదు స్వచ్ఛభారత్**
**మనసుల్లో మురికి వదిలితేనే**
**వెల్లివిరుస్తుంది స్వచ్ఛభారత్!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

య్యను ఆటోలో వెనుక సీట్లో పడుకోబెట్టి హాస్పిటల్ కు తీసుకువెళ్ళారు.

డాక్టర్ పరీక్ష చేసి రెండుమూడు ఇంజెక్షన్లు చేశాడు.

సాయంత్రానికి కొద్దిగా తెలివొచ్చింది. నెమ్మదిగా కనురెప్పలు పైకెత్తి చుట్టూ కలియచూశాడు బాపయ్య. లేచే ప్రయత్నం చేయబోయాడుగానీ ఆయన వల్ల కాలేదు.

కొద్దిగా కొబ్బరినీళ్ళు తాగించాడు విఠల్, తండ్రి చేత.

కాస్త ఓపిక వచ్చిందాయనకు.

"నువ్వు చనిపోయావనుకున్నాం. అదృష్టం బాగుండి ఆ సమయానికి కోటి చూసి నన్ను పిలిచాడు. ఆటోలో హాస్పిటల్ కు తీసుకొచ్చాం. ప్రాణానికి అపాయం ఏమీ లేదన్నారు డాక్టరుగారు" అన్నాడు విఠల్ తండ్రితో.

"చనిపోడానికి ఏముందిలే? ఎప్పుడైనా తప్పదుగదా! బతకాలని వుందిరా మరికొంతకాలం" అన్నాడు బాపయ్య.

నవ్వొచ్చింది విఠల్ కు. తండ్రిని చూస్తుంటే అబ్బురంగా వుంటుంది. తనకు ఊహ తెలిసిన తరువాత ఆయన చనిపోతాడనుకున్న సందర్భాలు ఏడెనిమిదిసార్లు వచ్చాయి. తన చిన్నతనంలో ఒకసారి ఆయనకు జబ్బు చేసింది.

"మీ నాన్న బతకడురా.. మనకు కష్టకాలం వచ్చింది.. బతుకుబండి ఎలా ఈడ్చాలో? నువ్వేమో చిన్నవాడివి.. నేనేమో ఇంట్లోంచి బయట కాలుపెట్టి ఎరగను" అంది అమ్మ ఏడుస్తూ. నెలరోజుల్లోనే కోలుకున్నాడు.

"మనబ్బాయికి పెళ్లయి పిల్లలు పుట్టే దాకా నాకేం కాదే!" అని అమ్మతో అనడం తనకు ఇంకా గుర్తుంది.

మరోసారి ఎడ్లబండి మీద నుంచి కింద పడ్డాడు. బండిచక్రం ఆయన పొట్టమీదుగా పోయింది. 'పైకి గాయమేమీ కన్పించకపోయినా బండి బరువుకు పేగులు తెగిపోయి వుంటాయి. బతకడు' అన్నారు చుట్టూ చేరినవాళ్ళు.

లేచి గ్లాసుడు మంచినీళ్ళు తాగి, ముల్లుకర్ర పట్టుకుని పొలం వెళ్ళాడు.

ఓసారి వీపు మీద పెద్ద గడ్డ లేచింది.

డాక్టరు చిట్టిబాబు, ఆ గడ్డలో ఓ చిన్న ముక్కను గుంటూరు పంపించి పరీక్ష చేయించాడు. వాళ్ళ దగ్గరనుంచి వచ్చిన రిపోర్టు చూసి "మీ నాన్నకు క్యాన్సర్.. చెబితే గాభరాపడతాడేమో! తొందరపడి చెప్పకు!" అన్నాడు తనతో.

తండ్రి చనిపోతాడేమోనని కుమిలిపోతుంటే ఓరోజు "ఏంట్రా అబ్బాయ్.. నీలో నీవు మథనపడుతున్నట్లు కనిపిస్తున్నావ్.. ఒంట్లో బాగుండలేదా? " అనడిగాడాయన.

"నాకు కాదు నాన్నా, నీకే... క్యాన్సరని డాక్టరుగారు చెప్పారు" చెప్పలేక చెప్పాడు.

"నాకు రాచపుండు రావడం ఏమిటి? నేనేమన్నా జమీందారునా? " అని నవ్వి, "నీకు కొడుకో కూతురో పుట్టే దాకా నాకేం కాదు" అన్నాడాయన.

సంవత్సరాలు గడిచిపోయాయి. నాన్న రాయిలాగే వున్నాడు.. తన ఆరోగ్యమే పాడయింది. ఆసుపత్రి చుట్టూ తిరుగుతూ వున్నాడు తను.

"ఒరేయ్.. నా మనుమడు వికాస్ పూర్తిగా కోలుకుని, పెళ్ళి చేసుకునేదాకా నాకేం కాదురా! వాడి పెళ్ళి చూసేకే చని

పోతా" అన్నాడు బాపయ్య.

తండ్రి మాటలు బీరుపోవు. వికాస్ తప్పకుండా కోలుకుంటాడు. వాడి పెళ్ళి తండ్రి చూస్తాడు. వాడికి శుభాశీస్సులు అందజేస్తాడు తన తండ్రి.

కొడుకును దగ్గరకు పిలిచాడు బాపయ్య.

"నేను రెండు కోరికలు కోరతాను. కాద నకుండా తీరుస్తావా? " అడిగాడు.

"ఏమిటో చెప్పు? "

"చేతిలో చెయ్యివేసి మాట ఇవ్వాలి"

"అలాగేలే!" తండ్రి చేతిలో తన చేతిని వుంచాడు విఠల్.

"మన అమృతను దరహాస్‌కు ఇచ్చి పెళ్ళిచెయ్యి. అదే మొదటి కోరిక. రెండో కోరిక ఏమిటంటే ఆ పిచ్చిపిల్ల లాలిత్య నా మనవడిని కనిపెట్టుకుని పగలు, రాత్రి అనకుండా మనింటికి వచ్చి సేవలు చే స్తోంది. మనవాడు కోలుకున్నాక ఆ పిల్లను మన వికాస్‌కు ఇచ్చి పెళ్ళి చెయ్యి! ఇచ్చిన మాట తప్పకు!" అన్నాడు, లేచి కూర్చునే ప్రయత్నం చేస్తూ.

చిన్నప్పటినుంచి తండ్రి తను అడిగిన వన్నీ సమకూర్చేడు. తన వ్యాపారంకోసం పొలం అమ్మమంటే అమ్మేశాడు.. ఎప్పు డూ 'అది కావాలి ఇది కావాలి!' అని అడ గలేదు. ఇప్పుడాయన చెప్పినవి తను చేయగల్గినవే! అభ్యంతరం చెప్పాల్సిన అవ సరం ఏముంది?

"అలాగే చేస్తాను నాన్నా!" అన్నాడు మనస్ఫూర్తిగా.

దరహాస్‌కు ఐ.ఏ.యస్. ట్రైనింగ్ పూర్త య్యింది.

పొన్నూరు వచ్చాడు.

"మన పెళ్ళికి మా నాన్నగారు ఒప్పుకు న్నారు. మీరు ఎప్పుడంటే అప్పుడే మన పెళ్ళి" అంది అమృత.

"పోస్టింగ్ ఆర్డర్స్ రాకముందే పెళ్ళి సందడి అయిపోతే బాగుంటుంది.. పోస్టులో జాయినయ్యాక పెళ్ళి చేసుకుంటే ఐ.ఏ.ఎస్. హోదాలో పెళ్ళి ఏర్పాట్లు చేసు కున్నాడు.. అధికారం దుర్వినియోగం అయ్యిందని గిట్టనివాళ్ళు అంటారు.. పోస్టింగ్ ఆర్డర్స్ రాకముందే పెళ్ళి చేసు కుందాం!" అన్నాడతను.

"మిమ్మల్ని ఏ స్టేట్‌కు ఎలాట్ చేశారు? పోస్టింగ్ ఎక్కడిస్తారు? "

"మన రాష్ట్రానికే ఎలాట్ చేశారు. ముందు డిప్యూటీ కలెక్టర్ హోదాలో పనిచే యాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాలతో పరిచయం ఏర్పడుతుందని దానికి సంబం ధించిన ఏ ప్రాజెక్టుకైనా డైరెక్టర్‌గా పోస్టింగ్ ఇవ్వొచ్చు!"

"మొదటి అర్జీ నేనే మీ ముందు దాఖలు పరుస్తాను"

"ఏమిటో ఆ అర్జీ? "

"ఆడపిల్లలను రక్షించండి! ఆడపిల్లలను చదివించండి! ఈ స్ఫూర్తితో ముందుకు సాగాలి! స్త్రీపురుషులు సమానమనే భావన ఏర్పడాలి! అన్నిరంగాల్లో స్త్రీలను ప్రోత్స హించాలి! ప్రపంచంలో దాదాపు పది కోట్ల మంది స్త్రీలపై అత్యాచారాలు, గృహహింస, అణచివేత జరుగుతున్నాయి. పేదప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపర్చడానికి మీ పరిధిలో మీరు కృషి చేయాలి" అంది ఆవే శపడిపోతూ.

"ఇదేదో నా మానిఫెస్టోలాగా నా ముందు పెట్టేలా వున్నావే!"

"అవును మానిఫెస్టో అమలుచేయడానికి కృషి చెయ్యకపోతే ఇంట్లో మీకు ముద్ద, ముద్దు బంద్ అయిపోతాయి"

"ఇంట్లో దొరక్కపోతే బయట ట్రై చేస్తాం!" అన్నాడు నవ్వుతూ.

"మీకు అంత సీన్ లేదుగానీ తొందరగా ముహూర్తాలు పెట్టించండి"

"దేవిగారు తొందరపడుతున్నారు ఎందుకో? "

ఆమెను దగ్గరకు లాక్కుని పెదాలపై వెచ్చటి ముద్రవేశాడు.

## కొత్తగాలి...

**కిడ్నీ రాకెట్! నోట్ల రాకెట్!**
**డిగ్రీల రాకెట్!**
**నిజమైన రాకెట్లకన్నా**
**వేగం...వేగం..!**

– నీహారిక దూసి,
బెంగళూరు

"తొందర ఎవరికో తెలుస్తూనే వుంది" అందామె అతని విశాలమైన వక్షస్థలం మీద ఒరిగిపోతూ.

"ఇన్నాళ్ళూ చదువులో పడి నీ మీద ధ్యాస గుండెలో ఓమూల ఒదిగిపోయింది. ఇప్పుడు వాగులా బయటకు పొంగుతూం ది. ఆ ఉరవడిని ఆపడం కష్టం!" అన్నాడు ఆమెను గట్టిగా కౌగలించుకుంటూ.

"మీ అమ్మగారు వస్తున్నారు" అందామె.

అటూ ఇటూ చూశాడు. ఎవరూ కన్పిం చలేదు. ఇంట్లోంచి బయటకు పరుగెత్తింది అమృత.

★ ★ ★

రెండేళ్ళు గడిచాయి.

దరహాస్, అమృతలకు కూతురు పుట్టింది.

వాళ్ళ ఆనందానికి అవధుల్లేవు.

వికాస్ ఆరోగ్య పరిస్థితి మెరుగవ్వడాని క్కూడా రెండేళ్ళు పట్టింది.

డాక్టర్లు మళ్ళీ అన్ని పరీక్షలు చేశారు.

లోయర్ స్పైనల్ కార్డ్ మామూలు స్థితికి చేరుకుంది. వాపు పూర్తిగా తగ్గిపో యింది. దెబ్బతిన్న టిష్యూస్ రీ జనరేట్ అయ్యాయి. వెన్నెముకలోని నరాలు కొద్ది కొద్దిగా పటుత్వం సంతరించుకుంటు న్నాయి. మొదట్లో పాదాలలో కదలిక మొదలయింది.

లాలిత్య భుజం మీద చేయివేసి కొంత దూరం నడవడం ప్రారంభించాడు.

"నువ్వు మామూలుగా నడవగల్గుతావ్" అనే పాజిటివ్ థాట్ ఆమె అతనిలోనికి చొచ్చుకు వెళ్ళేటట్లు చేసింది.

అతను నడవటం చూసి డాక్టర్లు ఆశ్చర్య పోయారు.

"రియల్లీ.. ఇటీజ్ మిరాకిల్.. ఇంత తొందరగా కోలుకుంటావని అనుకోలేదు. యు ఆర్ ఫార్చునేట్" అన్నాడు డాక్టర్ చిట్టిబాబు.

నడుముకు కవచంలా ప్యాడ్ కట్టుకుని, చేతిలో స్టిక్ పట్టుకుని నడవడం మెదలు పెట్టాడు. ఆ తరువాత వాటి అవసరం కూడా లేకపోయింది.

"నిజంగా నువ్వు పక్కన లేకపోతే నేను మాములుగా నడవడం సాధ్యమయ్యేది కాదు" అన్నాడు వికాస్, లాలిత్య మృదు వైన చేతిని చేతిలోకి తీసుకుని నొక్కుతూ.

ఆమె అందమైన రూపం అతని కళ్ళల్లో ఒద్దికగా ఇమిడిపోయింది.

"నాదేముంధి.. నా వృత్తి ఇతరులకు సేవ చెయ్యడం. ఆ సదుద్దేశంతోనే గదా 'అనురక్తి హోంకేర్ సర్వీస్' నిర్వహిస్తూ న్నది" అందామె.

"నువ్వు పక్కన వుంటే ఈ భూగోళాన్ని చుట్టి వచ్చే ఓపిక వస్తుంది" అన్నాడతను.

"పెళ్ళి చేసుకుని హాయిగా మీ ఆవిడతో అన్ని ప్రదేశాలూ తిరిగి రండి!"

అతనిలో ఏదో అనుమానం!

"పెళ్ళి సంగతి ఎందుకుగానీ నాలుగడు గులు నడవగలిగితే చాలు ఈ జీవితానికి. నా పనులు నేను చేసుకునే స్థితిలో వుంటే చాలు!" అన్నాడతను.

"ఎందుకలా అనుకుంటారు? మీరు పెళ్ళి చేసుకోవాలి. పిల్లల్ని కనాలి! ఆ పిల్ల లతో ఆడుతూపాడుతూ తిరగాలి!" అంది లాలిత్య అతన్ని ఉత్సాహపరుస్తూ.

"ఆ రోజులు వస్తాయంటావా?"

"తప్పకుండా!"

"నీ మనసు ఆకుల్లా పచ్చగా, నీళ్ళలా స్వచ్ఛంగా, తేనెలాగా తియ్యగా వుంటుంది. అందరి గురించి ఆలోచిస్తావ్‌గానీ.. నీ గురించి ఆలోచించవే? ఎప్పుడు పెళ్ళి చేసుకుంటావ్? " అనడిగాడు.

"సాయంత్రం ఊరిబయట తమలపాకుల తోటవరకూ వెళ్ళొద్దాం! సాయంత్రపు నీరెండ మీకు ఉత్తేజాన్ని, శక్తిని ఇస్తుంది" అంది లాలిత్య.

"అక్కడిదాకా నడవగలనా? "

"పక్కన నేనుంటాను కదా! అలసట అన్పించినప్పుడు కాసేపు విశ్రాంతి తీసుకుని తిరిగి వచ్చేయొచ్చు!"

"ఊరిబయట పచ్చటి పొలాలు, తోటల్లోకి వచ్చేసరికి అమ్మ ఒడిలో వున్నంత ప్రశాంతంగా వుంది. ఎన్నాళ్ళయ్యిందో ఊరి బయటకు వచ్చి. థ్యాంక్స్ లాలిత్యా" అన్నాడు ఆమె భుజం మీద చెయ్యి వేసి, ఆప్యాయంగా నిమురుతూ.

అతనిలో ఏదో తెలియని పులకరింత.

తమలపాకుల తోట మధ్యలో మోటార్ షెడ్ వుంది. చుట్టూ వలయంలో కొబ్బరి చెట్లున్నాయి. మధ్యలో నీళ్ళబావి వుంది. అటూ ఇటూ చూశాడు వికాస్.

ఎవరూ లేరు.

"నిజంగా నేను సంసార జీవితానికి పనికొస్తానా? " అడిగాడతను.

"నన్ను నమ్మండి..! మీరు కొండనైనా పిండి చేయగలరు" అందామె.

అతనిలో ఆత్మవిశ్వాసాన్ని రెట్టింపుచేసింది తన మాటలతో.

ఆమెను కౌగిలించుకున్నాడు. ఉద్రేకం కట్టలు తెంచుకుంది.

తొలిముద్దు అతనిలో మదన తాపాన్ని పెంచేసింది.

"నా మనసును పట్టి పీడిస్తున్న అనుమాన భూతాన్ని తన్ని తరిమేసింది ఈ బిగి కౌగిలింత. ఐయామ్ వెరీ హ్యాపీ!" అంటూ కిందికి ఒరిగిపోయాడు.

అతను కిందకు జారడం చూసి ఆమె ఒక్కక్షణం కంగారుపడింది.

రెండు చేతులతో ఆమె మోకాళ్ళను చుట్టేశాడు.

"నన్ను కాపాడిన దేవతవు నువ్వు! నన్ను పెళ్ళిచేసుకుంటానని మాటివ్వు!" ప్రాధేయపడుతూ అడిగాడు.

నవ్వుతూ అతని తలను నిమిరింది.

"ఎవరికీ చెప్పలేదుగానీ చిన్నప్పటినుంచీ నేను ఆరాధించేది నిన్నే! పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకోవాలని ఎప్పటినుంచో అనుకున్నాను.. నా కల సాకారమైంది" అంది తనూ కింద కూర్చుని అతని ఒడిలో వాలిపోతూ.

జీవనలిపిని నేర్పిన ఆమె వైపు ఆరాధనగా చూశాడు వికాస్.

★ ★ ★

అనారోగ్యం చుట్టుముట్టడంతో మరోసారి హాస్పిటల్‌లో చేరాడు బాపయ్య. తొంభై అయిదేళ్ళు వచ్చాయి.

"ఎన్నోసార్లు మృత్యు మొహంలోకి వెళ్ళి బయటపడ్డాడు. ఈసారే ఏమవుతుందో? "అన్నాడు విఠల్ కొడుకు వికాస్‌తో.

"తాతా! ఏదన్నా కోరిక మిగిలిపోయిందా? " అనడిగాడు వికాస్.

తెల్లటి గడ్డాన్ని నిమురుకున్నాడు.. ఏదో మాట్లాడబోయాడు.. దగ్గుతెర కమ్మేసింది. దగ్గు సర్దుకున్నాక మెల్లగా గొణిగాడు..

తాత నోటిదగ్గర చెవి ఆన్చాడు వికాస్.

"నీకు కొడుకో, కూతురో పుట్టేక లోకం నుంచి సెలవు తీసుకుంటాను" అన్నాడు బాపయ్య.

వికాస్ పెళ్ళయి సంవత్సరం అయ్యింది.

లాలిత్య గర్భవతన్న సంగతి కూడా బాపయ్యకు తెలుసు.

జీవితంలో మరో సున్నితమైన కోణం ఆవిష్కరింపబడబోతోంది. మమకారం మనిషిని నడిపిస్తూ వుంటుంది. కొత్త శక్తిని ఇస్తూ వుంటుంది. ©

# పైకి కఠినం .. లోన మధురం!!

ప్రపంచం అంతా
నాకింత బాగా కనిపిస్తోంది ఎందుకో?
ఎందుకేమిటి?
నిజంగా నేనెంతో గొప్పవాడ్ని కాబట్టి!
అరె.. పొరపాటు పొరపాటు..
అదేంకాదు..
నాన్న భుజం మీద కూర్చోబెట్టుకున్నందునే
అది సాధ్యమైందని నాకిప్పుడే తెలిసింది!
అవును నాన్న చెక్కిన శిల్పాన్ని నేను !
అమ్మ తొమ్మిదినెలలూ కడుపులో మోస్తే
నాన్న పందొమ్మిదేళ్లు గుండెలపై మోశాడు.
నాకోసం అమ్మ అనుక్షణం
కన్నీరు కార్చిందని తెలుసు
నాన్న కన్నీళ్లు చెమటరూపంలో
ఆయన దేహం నుంచి ఉబికి ఉంటాయని
ఇప్పుడే తెలిసింది..
గంభీరంగా కఠినంగా కన్పించే
నాన్న హృదయం అనుక్షణం నాకోసం
తల్లడిల్లుతుందనీ తెలిసింది..
ఆ పూట నా కడుపు నింపడం
ఎలా అని అమ్మ ఆలోచిస్తుంది
పాతికేళ్లతర్వాత నా ఆకలి తీరేందుకు
అవసరమైన ప్రణాళికలు
మనసులోనే వేసుకునేవాడు నాన్న
బాధ కలిగితే అమ్మ రోదిస్తుంది..
నాన్న వాదిస్తాడు.. గదమాయిస్తాడు..
తను చెప్పినట్లు చేయమని శాసిస్తాడు.
ఆ శాసనం వెనుక నా గమనం
పూలబాటపై సాగాలన్న
ఆకాంక్ష ఉందని నాకిప్పుడే తెలిసింది.
ఇది ఇంకా ముందే తెలిస్తే
ఎంత బాగుండేది..
ఆయన పాదాలు కళ్లకు అద్దుకుని
కన్నీళ్లతో కడిగేవాడ్ని!
ఇప్పుడు కడగాలన్నా ఆయన
నా మనసులో తప్ప మహిలో లేడు!
ఉన్నా కడిగించుకోడు..
కారణం కొడుకు తలవంచడం
ఆయన ఇష్టపడడు..

- ఓ కొడుకు ఆవేదన ఇది..

నడిచే దైవాలైన అమ్మానాన్నల గురించి
ఎంత చెప్పినా తక్కువే! ఏంచెప్పినా తక్కువే!
జూన్ మూడో ఆదివారం
పితృదినోత్సవ సందర్భంగా
ప్రత్యేక కథనమిది...!

## నాన్న మాటే తారకమంత్రం


షబానా ఆజ్మీ

బాలీవుడ్ నటి షబానా ఆజ్మీ. 'అంకుర్', 'అర్థ్', 'ఖాన్‌దార్', 'పార్', 'గాడ్‌మదర్', 'స్వామి', 'మండీ' ఇలా నటించిన ప్రతీ చిత్రం నటనకు నిర్వచనంగా నిలుస్తుంది. షబానా సైకాలజీ స్టూడెంట్. కళాశాల చదువే కాదు, జీవితాన్నీ క్షుణ్ణంగా చదివారు. ఖాళీ దొరికితే కాదు వీలు కల్పించుకుని మరీ పుస్తకాలు చదువుతారు. సామాజిక సేవకూ షబానా వెనుదీయరు. మురికివాడల్లో నిస్సహాయులకు చేయూతనందిస్తారు. స్కూలు పిల్లలకు టాయిలెట్లు లేకపోవడం లాంటి అనేక సమస్యలపై షబానా అలుపెరుగని ఉద్యమాలు చేపట్టారు. గ్లామర్ ప్రపంచంలో తళుకులీనే కళాకారిణి అట్టడుగు వర్గాలకు సేవ ఎలా చేస్తోంది, ఈ వ్యక్తిత్వం, ఔన్నత్యం ఎలా సాధ్యమయ్యాయంటే షబానా తండ్రి కైఫీ ఆజ్మీ వల్లే. అవును, ఆ జక్కన చెక్కిన శిల్పమే షబానా ఆజ్మీ.

కైఫీ ఆజ్మీగా పిల్చుకునే సయ్యద్ అక్తర్ హుస్సేన్ రజ్వీ సినీ గేయ రచయితగా ఎంత ప్రసిద్ధులో సమాజ సేవకుడిగానూ అంత విఖ్యాతులు. ఆయన ఊరూరా సేవా కార్యక్రమాలు సాగించేవారు. ఆశించే మార్పుకై కృషి చేయడమే తప్ప అవాంతరాలకు కుంగిపోవడం ఆయనకు తెలీదు. ఆర్తులకు

సేవచేస్తూ సమాజంలో చైతన్యాన్ని నింపడం మానవత్వమని బాల్యంలోనే చిన్నారి షబానాకు తర్ఫీదిచ్చారు. సమస్యలకు తల్లడిల్లని ధీరగాంభీర్యాన్ని నేర్పించారు. కళాహృదయాన్నీ, స్థిరచిత్తాన్నీ వారసత్వంగా ఇచ్చారు. "'నువ్వు కోరుకునే మార్పు జీవితకాలంలో సాధ్యం కాకున్నాసరే నిరాశపడకూడదు' అంటూ నాన్న చెప్పిన ఉపదేశం నాకు తారకమంత్రమైంది" - అని చెప్పే షబానా ఆజ్మీ రీల్ స్టారే కాదు, రియల్ స్టార్ అనిపించుకున్నారు. "నేను సాధించింది ఏమైనా వుందంటే అదంతా నాన్న చలవే"నని గర్వంగా చెప్పుకుంటారామె.

## నా కూతురే నా ప్రపంచం!


మహేష్ భూపతి

'టెన్నిస్ గాడాఫ్ ఇండియా'గా ప్రఖ్యాతుడైన మహేష్ భూపతి ఆటగాడే కాదు అందగాడు కూడా. ప్రపంచ సుందరి లారాదత్తాను పెళ్ళిచేసుకున్నారు మహేష్ భూపతి. వీరి కూతురు సారా. టెన్నిస్‌తో బిజీగా వుంటే తప్ప భూపతికి కూతురే ప్రపంచం. ఖాళీ సమయాల్లో పనివాళ్ళను దగ్గరకు రానీయకుండా, సారా పనులన్నీ తనే స్వయంగా చేయడంలో తనకు ఆనందం వుందని చెప్తారు. తన చలాకీతనాన్ని, స్పోర్టీవ్‌నెస్‌నీ ఉగ్గుగిన్నెతో రంగరించిపోశారు. ఇంత శ్రద్ధాసక్తులతో పెంచిన మహేష్ భూపతి కూతురు సారా తండ్రిలా క్రీడాకారిణి అయినా కాకున్నా గొప్ప వ్యక్తిత్వాన్ని అలవర్చుకుంటుంది అనడంలో లేశమాత్రం సందేహం లేదు. అతను కూతుర్ని ఎంతగా గారాబం చేస్తారో అంతగా జీవిత పాఠాలూ నేర్పిస్తున్నారు మరి!.

## మా నాన్న మహోన్నతుడు

బాలీవుడ్ అందాలభామ, అగ్రకథానాయిక దీపికా పదుకొణె, బాడ్మింటన్ ఛాంపియన్ ప్రకాష్ పదుకొణె కూతురు. తండ్రి ఆశావహ దృక్పథాన్ని దీపిక పుణికిపుచ్చుకుంది. మోడల్‌గా కెరీర్‌ను ప్రారంభించిన దీపిక హీరోయిన్‌గా ఎదిగింది. తన నటనాకౌశలంతో సుస్థిరస్థానాన్ని సంపాదించుకుంది. సందర్భం వచ్చినప్పుడల్లా తల్లిదండ్రులు తనకిచ్చిన అండదండల గురించి పదేపదే చెప్తుంది దీపిక. ముఖ్యంగా తన తండ్రి మహోన్నతుడని, తన ఎదుగుదల అంతా ఆయనిచ్చిన తర్ఫీదుతోనే సాధ్యమైందంటూ కృతజ్ఞతలు తెలియజేస్తుంటుంది.


దీపికా పదుకొణె

## ఆరవ్ నా ప్రాణం


అక్షయ్‌కుమార్

హిందీ చిత్రసీమలో అమితాబ్‌కు మల్లేనే అక్షయ్‌కు కూడా దేశవిదేశాల్లో అసంఖ్యాకంగా అభిమానులున్నారు. ప్రపంచమంతా అభిమానించే అక్షయ్‌కుమార్ ఇల్లు చేరేసరికి ఒక సాధారణ నాన్నయిపోతాడు. హీరోవర్షిప్ అంతా గుమ్మం అవతలే. గడప దాటి ఇంట్లో అడుగుపెట్టాడంటే అతనో మంచి భర్త, అంతకుమించి గొప్ప తండ్రి. కొడుకు ఆరవ్ ప్రాణం కంటే ఎక్కువని చెప్పే అక్షయ్‌కుమార్ అతనితో వీలైనంత ఎక్కువ సమయం గడపాలని చూస్తారు. జిమ్‌కు వెళ్ళేటప్పుడు కొడుకును వెంట తీసికెళ్తారు. కొడుక్కి తనే దగ్గరుండి సైకిల్ తొక్కడం నేర్పించారు. మార్షల్ ఆర్ట్స్‌లో తర్ఫీదిచ్చారు. అన్నిటినీ మించి కొడుక్కు నిరంతరం జీవితసత్యాల్ని, నైతికవిలువల్ని బోధిస్తుంటారు అక్షయ్.

ప్రముఖుల తండ్రులు గనుక వాళ్ళ కృషి గురించి మనందరికీ తెలిసింది. సాధారణ వ్యక్తుల తండ్రులు కూడా సంతానంకోసం తాము చేయగల్గినంతా చేస్తారు. పిల్లల పెంపకంలో ప్రతీక్షణం తమని తాము అర్పించుకుంటారు. అంకితమైపోయి సేవచేస్తారు. బిడ్డలు ప్రయోజకులైనప్పుడు తమ జీవితం సార్థకమైందని మురిసిపోతారు. అందుకే 'పితృదినోత్సవం' సందర్భంగా నాన్నలందరికీ అభినందనలు!

# మనసున ఉన్నదీ...

★ మే నెల చతురలో వెలువడ్డ డా. సి. రాధాకృష్ణన్ గారి నవల 'అగ్ని'ని చిల్లర భవానీదేవి అనువదించిన తీరు శ్లాఘనీయం. నవల ఎత్తుగడ, ముగింపు.. ఆ మధ్య నవల నడిచిన తీరు ఒక ప్రవాహం. ఆ ప్రవాహం నీరుది కాదు, లావా.. అగ్ని గోళంలా ప్రవహించింది. అందాల కేరళ వర్ణన ఎత్తుగడ అయితే మూసా పని కుర్రాడి తల నరికేయడం కసాయి ముగింపు నిజానికి అగ్ని. మొత్తానికి అగ్ని మంచి నవల! 'నవలావలోకనం' ద్వారా అందిస్తున్న పాత నవలల పరిచయాలు అప్పటి సమాజ స్థితిగతులను పాఠకలోకానికి తెలియజేస్తున్నాయి. 'అక్షరం'లో వస్తున్న మహనీయుల వాక్యాలు ఏ కాలానికైనా వర్తిస్తాయి. మంచి శీర్షికలతో భావనాసముద్రంలో మమ్మల్ని అలరించే 'చతుర'కు, సంపాదకవర్గానికి వందనాలు.

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

★ అందమైన ముఖచిత్రంతో వెలువడిన మే చతుర నవలాస్రవంతి ఎంతగానో ఆకట్టుకుంది. నవల 'అగ్ని' షడ్రుచుల సమ్మేళనంలా అలరించింది. చాలాకాలం తర్వాత మా అభిమాన రచయిత్రి ద్వివేదుల విశాలాక్షి గారి నవల 'వారధి' పరిచయం రావడం ఆనందంగా ఉంది. మాతృదినోత్సవం సందర్భంగా వచ్చిన 'అమ్మకు జేజే!' చాలా బాగుంది.

– కరణం శివానందరావు, కర్నూలు

★ 'అగ్ని' నవల నిజంగా భీభత్స భయానక దృశ్య కావ్యమే! రష్యన్ నవల 'వెనుకంజ' ఏదైనా సాధించడం ఎంత ముఖ్యమో, దాన్ని కాపాడుకోవడం కూడా అంతే ముఖ్యమని తెలియజేసింది. 'వారధి' ఒక ప్రతీకాత్మక నవల. బతుకులోని కష్టాలను దాటడానికి మనోబలాన్ని 'వారధి'గా చేసుకోవాలని చెబుతుంది. 'చతుర ప్ర.జ.' ద్వారా ఆధ్యాత్మిక లోతుపాతులు తెలుస్తున్నాయి. చిరకాలం నిలిచే 'చెర'కాలం రచనల పరిచయం అభినందనీయం.

– మహబూబ్ కమల్, ఖాజీపేట

★ ముఖచిత్రం మాతృదినోత్సవ దినాన్ని అందంగా ప్రతిఫలింపజేసింది. డా. సి. రాధాకృష్ణన్ మలయాళ నవల 'అగ్ని' బాగుంది. ఆద్యంతం మేకలను కసాయి కత్తికి బలివ్వడం అదోలా అనిపించింది. కసాయి కూతురు ప్రేమించిన వాడితో లేచిపోతే అమాయక కుర్రాడిని చంపడం ఒకింత బాధ కలిగించింది. చదువు, అక్షరజ్ఞానం లేని సౌందర్యవతి యశోద నేపథ్యంగా ఆమె జీవితంలో జరిగిన ఉపద్రవాలకు మానసిక సంఘర్షణలకు అక్షరరూపమిచ్చిన మహాశ్వేతాదేవి రచన 'తెల్లని నెత్తురు' మాతృదినోత్సవ కానుకగా భావించాం. 'వారధి' నవలా సమీక్ష బాగుంది.

– ముక్కెర రమేశ్‌చంద్ర,
గుర్రం పేట, వరంగల్ జిల్లా

★ మలయాళ నవల 'అగ్ని', పెద్దకథ 'తెల్లని నెత్తురు' రెండూ విషాదాంతాలే. అగ్ని క్రూరత్వానికి పరాకాష్ట అయితే, తెల్లని నెత్తురు ఓ స్త్రీ కష్టాలకు పరాకాష్ట. యశోద బతుకు శోచనీయం. మాతృత్వమే ఆమె వృత్తి. పిల్లలకు పాలివ్వడానికే ఆమె ఏటా గర్భం దాల్చి బిడ్డను కనడం కొత్త కోణం. చివరికి అదే ఆమె అనారోగ్యానికి కారణమవడం జాలిగొల్పింది.

– అరిపిరాల సువర్ణ, బెంగళూరు

★ అగ్ని నవల ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. మూసా పాత్ర ఒళ్లు గగుర్పొడిచేలా ఉంది. కూతురిపై ఎంతో ప్రేమ ఉన్నప్పటికీ అతని ప్రవర్తన ఒకింత బాధ కలిగించింది. అనువాదం చక్కగా సాగింది. కుటుంబ దినోత్సవం సందర్భంగా అందించిన 'కష్టం కూడా ఇష్టమే!' బాగుంది.

– శోభ, మణుగూరు

★ మలయాళ నవల 'అగ్ని' బాగుంది. 'టెక్‌గురూ!'లో ఉపయోగకరమైన విషయాలు అందించారు. 'చతుర ప్ర.జ.' ద్వారా మా సందేహాలు తీరుతున్నాయి. మహాశ్వేతాదేవిగారి కథ 'తెల్లని నెత్తురు' అద్భుతంగా ఉంది.

– లక్ష్మణ్, నల్గొండ

# వింత బౌద్ధ ఆలయం



జావా(ఇండోనేషియా)లో బొరాబుడార్ ఆలయం ప్రపంచంలోకెల్లా వింత బౌద్ధ ఆలయం! ఇది పిరమిడ్ ఆకారంలో ఉంటుంది. ఈ పిరమిడ్ ఎక్కాలంటే యాత్రికులు వలయ మార్గంలో పైకి వెళ్లాలి. పిరమిడ్ పైకి ఎక్కేటపుడు దారిలో రాతి మీద అతి సున్నితంగా చెక్కిన బుద్ధుని జీవిత విశేషాలు, అనేక బౌద్ధ ధర్మాలు చూడొచ్చు.

తొమ్మిదో శతాబ్దంలో నిర్మించిన ఈ బౌద్ధ ఆలయానికి ఏడు చదరపు డాబాలు, చుట్టూ పిట్టగోడ ఉన్నాయి. చిట్టచివరి డాబా దగ్గర గుండ్రని మరో మూడు డాబాలు ఉంటాయి. ఈ గుండ్రని డాబాల మీద చిన్నచిన్న గంటల రూపంలో 72 స్థూపాలు ఉన్నాయి. ప్రతి స్థూపంలోనూ ఒక్కో బుద్ధ విగ్రహం ఉంది. స్థూపం చుట్టూ ఉండే జల్లెడ రంధ్రాల గుండా లోపలి బుద్ధ విగ్రహాన్ని చూడగలం.



చిట్టచివరి స్థూపంలో బౌద్ధ విగ్రహం చాలా పెద్దది. 71 స్థూపాలలోని చిన్న విగ్రహాలను చూసిన తరువాతే చివరి స్థూపంలోని పెద్ద విగ్రహాన్ని చూసే వీలు ఉంటుంది. అంతేగాకుండా డాబాల చుట్టూ గోడ ఎత్తుగా ఉండడం వల్ల పిరమిడ్ ఎక్కే యాత్రికుడు పూర్తిగా ఎక్కితేగానీ విగ్రహాన్ని దర్శించుకోలేరు.

సేకరణ : ఎ. రాంబాబు

# భూమి వయస్సు

'రేడియమ్' లాంటి కొన్ని ఖనిజాలు నిరంతరం కిరణాలను ప్రసరిస్తూ ఉండడం వల్ల వాటిని 'రేడియోధార్మిక' పదార్థాలు అంటారు. అలా కిరణాలు ప్రసరిస్తూ కాలక్రమేణ పూర్తిగా భిన్నమైన ఖనిజాలుగా మారిపోతాయవి. వాటిలో ఈ మార్పు జరిగే క్రమాన్ని కచ్చితంగా లెక్కబెట్టారు శాస్త్రవేత్తలు. ఇంకో విశేషమేమిటంటే ఏ పరిస్థితులలోనూ ఆ 'క్రమం' మారదు. ఉష్ణోగ్రతలో తీవ్రమైన మార్పుల ప్రభావం కూడా ఆ 'క్రమం' మీద ఏమాత్రం పనిచేయదు. ఆ మార్పు వేగం రవ్వంతయినా పెరగడంగానీ, తగ్గడం గానీ జరగదు. ఇలాంటి రేడియోధార్మిక శక్తిగల ఖనిజాలు ప్రపంచం అంతటా రాళ్లలో కనిపిస్తున్నాయి. వాటి వల్ల మన భూమి మీది చాలా ప్రాచీనమైన రాళ్లు 140 కోట్ల సంవత్సరాల క్రితం ఘనీభవించి, గట్టిపడినట్లు మనకు తెలియవచ్చింది. ఉపరితలం గట్టిపడి పెంకు కట్టక పూర్వం సుమారు 60 కోట్ల సంవత్సరాల పాటు ఆవిర్లవంటి వాయు పదార్థాల రూపంలోనూ, ద్రవ్యపదార్థ రూపంలోనూ ఈ భూమి ఉండేది. ఖగోళ సంబంధమైన సాక్ష్యం కూడా భూగోళం ఒక గ్రహంగా ఉన్న మన సౌరకుటుంబం వయస్సు కొన్ని వందల కోట్ల సంవత్సరాలని చాటుతుంది. ప్రస్తుతం భూమి వయస్సు 200 కోట్ల సంవత్సరాలు అని ఉజ్జాయింపుగా భూగర్భ శాస్త్రవేత్తలు నిర్ణయించారు.



పెద్దకథ

# కొయ్య గుర్రపు విజేత

ఆవిడ అందంగా వుంటుంది. అన్ని సదుపాయాలతోనీ జీవితాన్ని ప్రారంభించింది. కానీ అదృష్టం కలిసి రాలేదు. ప్రేమించే పెళ్లి చేసుకుంది. కానీ ఆ ప్రేమ నిష్ప్రయోజనం అయిపోయింది. ఆరోగ్యంగా వుండే పిల్లలున్నారు ఆవిడకి. కానీ- వాళ్లు తనకి అంటగట్టిన వాళ్లని భావించేది. వాళ్లని ప్రేమించలేకపోతుండేది. పిల్లలు కూడా నిర్లిప్తంగా, తప్పు పడుతున్నట్టుగా ఆమెని చూసేవాళ్లు. దాంతో తను చేసిన తప్పుని సరిదిద్దుకోవాలని హడావిడి పడుతున్నట్లు కనిపించేది. అయితే తను సరిదిద్దుకోవాల్సిందేమిటో ఆవిడకి తెలిసేది కాదు. పిల్లలు దగ్గరగా వున్నప్పుడు - తన మనసులో ఏదో కాఠిన్య భావం వచ్చేస్తున్నట్టు అనిపించేది ఆవిడకి. ఈ రకమైన భావం వస్తున్నందుకు ఆవిడ బాధ పడేది. దాంతో - మరింత మృదువుగా - పిల్లల్ని యెంతో ప్రేమిస్తున్నట్టుగా- ప్రవర్తించడానికి ప్రయత్నించేది. అయితే- తన మనస్సులో యేదో కాఠిన్యభావం వుందనీ, అది ఎవర్నీ ప్రేమించనివ్వదనీ ఆమెకు తెలుసు. "ఎంత మంచి తల్లి! పిల్లల్ని నిజంగా ఆరాధిస్తుంది" అని అనుకునే వాళ్లు- ఆమెని చూసిన వాళ్లంతా. అది నిజంకాదనీ ఆమెకి- పిల్లలకి కూడా తెలుసు. ఒకరికళ్లల్లో మరొకరికి - ఆ విషయం స్పష్టంగా కనిపిస్తూ వుండేది.

ఒకబ్బాయి, యిద్దరమ్మాయిలూ వుండే వారామెకి. మంచి గార్డెన్‌తో - చక్కగా కనిపించే యిల్లు, చక్కగా సమయాసమయాలు తెలిసిన వాళ్లు- చుట్టపట్ల వున్న వాళ్ల కంటే మేం గొప్పవాళ్లం అనే భావనా- అలావుండేది వాళ్లస్థితి. కానీ - దర్జాగా జీవిస్తున్నా - యెప్పుడూ యేదో ఆందోళనలో వున్నట్టుగా కనిపించేవారు. చాలినంత డబ్బు యెప్పుడూ వుండేది కాదు. తల్లికి కొంచెం ఆదాయంవుండేది. తండ్రికీ వుండేది కొంచెం ఆదాయం. కానీ అది సమాజంలో వాళ్ల హోదాకీ తగినంతగా మాత్రం వుండేదికాదు. తండ్రి పట్నంలో ఏదో ఆఫీసులో పనిచేస్తూవుండేవాడు. అతనికి మంచి అవకాశాలున్నా - అవి యెప్పుడూ అందుబాటులోకి వచ్చేవి కావు. హోదా జీవితం కొనసాగుతూ వుండేది కానీ - డబ్బు సరిపోవడంలేదే అనే భావం నిత్యం బాధిస్తూ వుండేది వాళ్లని.

చివరికి ఆమె చెప్పింది.

"నేనేమైనా కొంచెం డబ్బు సంపాదించగలనేమో చూస్తాను" అని.

అయితే - యెక్కడ ప్రారంభించాలో ఆమెకి తెలీలేదు. మెదడికి పని కల్పించి చాలా చాలా ప్రయత్నాలు చేసింది. కానీ యేదీ విజయవంతం కాలేదు. ఈ పరాజయం వల్ల ఆమె ముఖం మీద ముడతలు వచ్చేశాయి. మరికొంచెం డబ్బు కావాలి, మరికొంచెం డబ్బు కావాలి అనిపిస్తుండేది నిత్యం. తండ్రి అందంగా వుండి, ఖరీదైన అభిరుచుల్ని కలిగి వుండేవాడు. కానీ యేనాటికి చెప్పుకోదగిందేమీ సాధించలేనివాడిలాగ కనిపించేవాడు. తల్లికి తన మీద బోలెడు నమ్మకం వుండేది. కానీ

ఆవిడా ఏదీ సాధించలేకపోయింది. అయితే- ఆమె అభిరుచులూ ఖరీదైనవే.

ఎవరూ, యెన్నడూ అనకపోయినా - ఆ యింట్లో 'మరికొంచెం డబ్బు కావాలి- మరి కొంచెం యెక్కువగా డబ్బుకావాలి' అనే మాటలు ప్రతిధ్వనిస్తున్నట్టుగా అనిపిం చేది. పిల్లలకయితే- ఆ మాట అనునిత్యం వినిపిస్తున్నట్టుండేది- యెవరూ యెన్నడూ ఆ మాటని గట్టిగా అనకపోయినా, క్రిస్మస్ స మయంలో ఖరీదైన ఆటవస్తువులతో తమ గది నిండిపోయినప్పుడు కూడా - పిల్లలకి ఆ మాట వినిపిస్తూనే వుండేది. ప్రతి బిడ్డకీ- మిగిలిన యిద్దరు బిడ్డల కళ్లల్లో కనిపిస్తూ వుండేది- ఆ భావం.

పిల్లలు ఆడుకునే కొయ్య తూగుడు గుర్రపు స్ప్రింగుల నుండి కూడా గుసగు సగా ఆ మాట వినిపిస్తున్నట్టుగా వుండేది. కొయ్యగుర్రం కూడా - తన వూగే తలతో- ఆ మాటల్ని వింటున్నదానిలా కనిపించేది. బొమ్మలగదిలో కూర్చున్న పింక్ కలర్ బొమ్మ కూడా- ఆ మాటని స్పష్టంగా విన్న దానిలా కనిపించేది. అమాయకమైన కుక్కపిల్ల కూడా - ఇంట్లో వినిపిస్తున్న గుసగుస మాటలు వినిపించినట్టు ప్రవర్తిం చేది. అయితే- యెవరూ ఆ మాటని గట్టిగా అనేవారు కాదు. ఆ గుసగుస అంతటా వినిపిస్తుండేదేమో- యెవరూ దానిగురించి మాటాడుకునేవారు కాదు. నిత్యం వూపిరి పీలుస్తున్నా - 'మేం వూపిరి పీలుస్తున్నాం' అని యెవరూ అంటూవుం డరు కదా- అలా అన్నమాట.

"అమ్మా! సొంత కారు మనం యెందుకు వుంచుకోడంలేదు? ఎప్పుడూ అంకుల్ కారునో, టేక్సీనో యెందుకు వాడుతుం టాం? " అనడిగేడు- పాల్ ఒకరోజు

"ఎందుకుంచుకోడం లేదంటే- మనది డబ్బులేని కుటుంబం కనక"



"కానీ- యెందుకనమ్మా- అలా? "

"ఎందుకంటే- మీ నాన్నగారికి బహుశా అదృష్టం కలిసిరాకపోవడం వల్ల"

కుర్రవాడు కాస్సేపు నిశ్శబ్దంగా వున్నాడు.

"అదృష్టం అంటే- డబ్బా అమ్మా? " అన డిగేడు కాస్త భయపడుతూ.

"కాదు పాల్- కానీ అదృష్టం నీకు డబ్బు వచ్చేలా చేస్తుంది"

"అదా! సరే- అదృష్టం అంటే ఏమి టమ్మా? "

"నీకు డబ్బు కలిగేలా చేసేదే అదృష్టం. నువ్వు అదృష్టవంతుడవయితే- నీకు డ బ్బుంటుంది. అందుకనే డబ్బున్నవాడిగా పుట్టడం కన్నా, అదృష్టవంతుడిగా పుట్టడం మంచిది. నువ్వు ఒక్క డబ్బున్నవాడివే అ యితే ఆ డబ్బు యెప్పుడేనా పోవడానికి అ వకాశం వుంది. నువ్వు అదృష్టవంతుడయి తే నీకెప్పుడూ డబ్బు వస్తూ వుంటుంది"

"అలాగా? అలా అయితే- నాన్న అదృ ష్టవంతుడు కాదా? "

"దురదృష్టవంతుడు" అంది నిష్ఠూ రంగా.

నమ్మలేను అన్నట్టుగా చూశాడు కుర్రాడు తల్లివైపు.

"ఎందుకని? "

"నాకు తెలీదు. ఒకడు అదృష్టవంతుడు యెందుకౌతాడో, మరొకడు దురదృష్టవం తుడెందుకవుతాడో- యెన్నడూ యెవరికీ తెలీదు. భగవంతుడికి తెలుసు. కానీ- అతనెవరికీ చెప్పడు"

"అలా కాదు. అతను చెప్పాలి. అమ్మా! నువ్వు అదృష్టవంతురాలివి కావా? "

"నేను కాలేను- ఒక అదృష్టవంతుడు కాని భర్తని పెళ్లాడేక"

"నీ మట్టుకు అదృష్టవంతురాలివి కావా? "

"పెళ్లికాక మునుపు అదృష్టవంతురాల్ని అనుకునేదాన్ని. ఇప్పుడుమాత్రం చాలా దురదృష్ట వంతురాల్ని అనుకుంటున్నాను"

"ఎందుకని? "

"దాన్ని వదిలేయ్. ఏమో- నేను దురదృష్టవంతురాల్ని కానేమో!" అందావిడ.

పాల్ ఆమెకేసి చూసేడు- నిజంగానే ఆమె అలా అనుకుంటోందా? అన్నది తెలుసుకోవడానికి. ఆమె మూతిని ముడిచిన విధానం చూసి, తన నుంచి ఆమె యేదో దాచాలని చూస్తోందని అనుకున్నాడు.

"ఏదియేమైనా- నేను మాత్రం అదృష్టవంతుడ్నే! " అన్నాడు దృఢంగా.

"ఎందుకట? " అంది తల్లి- నవ్వుతూ.

ఆమెవైపు తేరిపార చూసేడు. తను ఆ మాటని యెందుకన్నాడో తెలియనుకూడా తెలీదు కుర్రాడికి.

"దేవుడు నాకు చెప్తాడు" అన్నాడు- గట్టిగా, దృఢంగా.

"అలాగే చెప్తూ వుండాలని కోరుకుంటున్నాను- హనీ" అందావిడ- కాస్త నిష్ఠూరంగా నవ్వుతూ.

"నాకు చెప్తాడు"

"చాలామంచిది!" అందావిడ- భర్త వుపయోగించే ఆశ్చర్యార్థకాన్ని వుపయోగిస్తూ.

కుర్రాడికి అర్థమయిపోయింది- తల్లి తనని నమ్మడం లేదని- తను అంత కచ్చితంగా చెప్పిన దాన్ని కూడా ఆమె పట్టించుకోలేదని. ఈ సంగతి కుర్రాడికి కోపం తెప్పించింది. దాంతో యెలాగైనా ఆమె దృష్టిని తను చెప్పిందాని వైపు మళ్లించాలనే కోరిక తీవ్రమయింది.

చిన్నపిల్లవాడిలాగే - అదృష్టానికి మార్గమేమిటో తెలుసుకోడానికి ప్రయత్నించాడు. తదేక ధ్యానంగా, యితరులెవర్నీ పట్టించుకోకుండా, రహస్యంగా, తన మనసులో, అదృష్టం గురించి తెలుసుకోడానికి ప్రయత్నం చేసేవాడు. 'అదృష్టం కావాలి - అది తనక్కావాలి, తనక్కావాలి'

నర్సరీలో చెల్లెళ్లందరూ బొమ్మలతో ఆడుకుంటూవుంటే - తను కొయ్యగుర్రం మీద కూర్చుంటాడు పాల్. కూర్చొని - దానిని గాలిలో పరిగెత్తిస్తున్నట్టు పిచ్చిగా వూపుతాడు, అచ్చం పిచ్చివాడిలాగ.

దాంతో ఆడుకుంటున్న అమ్మాయిలిద్దరూ అతనివేపు వింతగా చూస్తారు. అడ్డూఆపూ లేనిదానిలాగ గుర్రం వూగుతూ వుంటుంది- పాల్ నల్లని జుట్టు యెగురుతూ వుంటుంది- అతని కళ్ళల్లో యేదో అలౌకికమైన మెరుపు కనిపిస్తూ వుంటుంది. అలాటపుడు చిన్నపిల్లలిద్దరికీ అన్నని పలకరించడానికి ధైర్యం చాలదు.

వెర్రిగా సాగే ఈరకమైన ప్రయాణం ముగింపుకి రాగానే- కుర్రాడు కిందికి దిగిపోయి- ఆ కొయ్యగుర్రం ముందు నిలబడి

ఇంగ్లండ్ మూలం :
**డి.హెచ్. లారెన్స్**

అనువాదం :
**ఎ.వి. రెడ్డిశాస్త్రి**

దాని అవనతమైన ముఖంకేసి తదేకంగా చూస్తాడు. దాని యెరుపురంగు మూతి కాస్త తెరచుకొని వుంటుంది. దాని పెద్ద పెద్ద కళ్లు అద్దాల్లా మెరుస్తుంటాయి.

అలసిపోయి చూస్తున్నట్టుగా కనిపిస్తున్న ఆ గుర్రాన్ని ఆజ్ఞాపిస్తాడు పాల్ "ఇప్పుడు నన్ను అదృష్టం వున్న దగ్గరికి తీస్కెళ్లాలి, తీస్కెళ్లాలి" అంటూ. తన మేనమామ ఆస్కార్ బహుమానంగా యిచ్చిన చిన్న కొరడాతో దాని మెడమీద కొడతాడు. దానిని బలవంతం చేస్తే అది తనని అదృష్టం వున్న దగ్గరికీ తీసికెళుతుందని - వాడి నమ్మకం. అంచేత మళ్లీ ఆ గుర్రం మీద కూర్చొని- స్వారీ ప్రారంభిస్తాడు. చివరికి ఆ గుర్రం తనని గమ్యం చేరుస్తుందని వాడి నమ్మకం.

"నీ గుర్రం విరిగిపోతుంది పాల్"

అంటుంది నర్స్.

"వాడెప్పుడూ అలాగే స్వారీ చేస్తుంటాడు. అది మానేస్తే బావుండ్ను" అంటుంది వాడి చెల్లెలు జోన్.

ఆ మాటలు విని వురిమి చూసేవాడు పాల్. నర్స్ యేమీ చెయ్యలేక వూరుకునేది. కుర్రాడు ఆమెకి అర్థం కావడంలేదు. ఏది ఏమైనా ఆమె పరిధికి మించి ఎదుగుతున్నాడు పాల్.

ఒకనాడు పాల్ తన కొయ్యగుర్రం మీద వున్మాదంగా స్వారీ చేస్తున్న సమయంలో - అతని తల్లి, మేనమామ ఆస్కార్ వచ్చారక్కడికి. కుర్రాడు వాళ్లతో మాట్లాడలేదు.

"హలో! లిటిల్ జాకీ! గెలిచే గుర్రాన్నే స్వారీ చేస్తున్నావా?" అన్నాడు అతని మేనమామ.

"నువ్వు పెద్దవాడివయిపోయావు కదా - ఇంకా ఈ కొయ్యగుర్రం మీద స్వారీ చెయ్యడమేమిటి? నువ్వింకా చిన్నకుర్రాడివి కాదు కదా" అంది పాల్ తల్లి.

పాల్ ఒక తీక్షణమైన చూపుతో చూసేడు ఆమెని - తన పెద్దపెద్ద కళ్లతో. గుర్రం మాంచి వూపులో వున్నప్పుడు పాల్ యెవరితోనీ మాట్లాడడు. వాడి తీవ్రమయిన చూపుని చూసి తల్లి ఆందోళన పడిపోతూ కొడుకుని చూసింది. చివరికి వాడు స్వారీ ఆపి గుర్రం దిగేడు.

"నేనక్కడికి చేరుకున్నాను" అన్నాడు తీవ్ర స్వరంతో.

వాడి నీలి కళ్లు మెరుస్తున్నాయి. గుర్రపుస్వారీ చేస్తున్నట్టు ఇంకా కాళ్లు ఎడంగానే వున్నాయి.

"ఎక్కడికి చేరుకున్నావు?" అడిగింది వాడి తల్లి.

"ఎక్కడికి వెళ్లాలని అనుకుంటున్నానో అక్కడికి" అన్నాడు తల్లిని తీక్షణంగా చూస్తూ.

"బావుందిరా బాబూ! అక్కడికి చేరేదాకా ఆగకు. మరయితే - నీ గుర్రం పేరేమిటి?" అడిగేడు అంకుల్ ఆస్కార్.

"గుర్రానికి పేరు లేదు" అన్నాడు.

"పేరు లేకుండానే గెలుపు గుర్రం అయిపోతుందా?"

"ఆ గుర్రానికి వేరు వేరు పేర్లుంటాయి. కిందటివారం దానిపేరు శాన్ సోవినోవా"

"శాన్ సోవినోవా? ఆ గుర్రం పందెంలో గెలిచిందే! దాని పేరు నీకెలా తెలుసు?"

"బేసెట్‌తో యెప్పుడూ గుర్రప్పందేల గురించే మాట్లాడుతుంటాడు" అంది నర్స్.

అంకుల్‌కి సంతోషం వేసింది - తన చిన్న మేనల్లుడికి - గుర్రప్పందేల గురించి భోగట్టాలన్నీ తెలిసి వున్నందుకు. చిన్న వయస్సులోనే వున్న బేసెట్‌కి గార్డెనర్‌గా వుద్యోగం దొరకడం కూడ తన వల్లే కదా!

బేసెట్ యుద్ధంలో గాయపడ్డాడు. ఎడమ పాదానికి గాయం అయింది. ఆస్కార్ యింట్లో అతని ఆంతరంగిక పరిచారకుడిగా పనిచేశాడు - ఇంతకుముందు. గుర్రప్పందేల వివరాలన్నీ అతడికి క్షుణ్ణంగా తెలుసు. నిజానికి గుర్రప్పందాలే వాడి వూపిరి. వాడితోపాటు - ఈ కుర్రాడికి కూడా గుర్రప్పందేలు వూపిరై కూర్చున్నాయన్నమాట!

ఆస్కార్‌కి మొత్తం సమాచారం అందింది - బేసెట్ ద్వారా.

"సార్! మాస్టర్ పాల్ నా దగ్గరికి వచ్చి అడుగుతుంటారు- నేను చెప్పకుండా ఉండలేను కదా!" అన్నాడు బేసెట్- ముఖాన్ని సీరియస్‌గా పెట్టి.

"అయితే- గెలుస్తుందనుకున్న యే గుర్రం మీదేనా కుర్రాడు పందెం కాసేడా?"

"నన్ను మన్నించండి సార్! నేను కుర్రాడి భోగట్టాల్ని బయటికి చెప్పలేను. మీరు అతన్నే అడగొచ్చు కదా! కానీ - చిన్నవాడయినా- ఆట గొప్పగా తెలిసిన కుర్రాడు. గుర్రప్పందాలంటే చాలా ఇష్టం. నేను గా



నీ మీకు చెప్తే అతగాడి రహస్యాల్ని బయటికి చెప్పేశానని అనుకోవచ్చు"

అంకుల్ కుర్రాడ్ని కారులో తీసికెళ్లాడు - "అలా వెళ్లొద్దాంరా!" అనిచెప్పి.

"చూడు పాల్! నువ్వు గుర్రప్పందేల మీద డబ్బు ఏదేనా కాసేవా? "

అందగాడైన అంకుల్ వైపు కుర్రాడు తేరిపార చూసేడు.

"ఎందుకు? నేను పందేల మీద కాయకూడదా? " అన్నాడు - అంకుల్ అడిగిందానికి సమాధానం యివ్వకుండా.

"అబ్బెబ్బే! అదేం కాదు. లింకాన్ గుర్రప్పందేలకి - నాకేమైనా - సలహాలిస్తావేమోనని" కారు గ్రామాల్ని దాటుకుంటూ - అంకుల్ ఆస్కార్ వూరు హేంప్‌షైర్ వైపు పరుగుతీస్తోంది.

"నిజంగానే అడుగుతున్నావా? "

"నిజంగానే అడుగుతున్నాను" అన్నాడు అంకుల్ ఆస్కార్.

"అలా అయితే - డేఫొడిల్"

"డేఫొడిల్లా? నాకు నమ్మకం లేదురా! మీర్జా గురించి నీ అభిప్రాయం ఏమిటి? "

"గెలిచే గుర్రం పేరే నాకు తెలుసు- అది డేఫొడిల్"

"డేఫొడిల్లా? "

కొంచెం నిశ్శబ్దం. డెఫొడిల్ యెవరూ వూహించలేని గుర్రం.

"అంకుల్"

"చెప్పు"

"ఈ సంగతి మరెవ్వరికీ చెప్పవు కదా? నేను బేసెట్‌కి ప్రామిస్ చేసేను"

"వాడి సంగతి అలా వదిలెయ్. అసలు - దీంతో వాడికేం సంబంధం? "

"మేమిద్దరం పార్ట్‌నర్స్. అతడే నాకు చేబదులిచ్చేడు- మొదటి అయిదు షిల్లింగులూ. ఆ డబ్బు పోయింది. నేను నిజం

## కొత్తగాలి...

**కంప్యూటరు డెస్క్‌టాప్**
**పెద్దకొడుకు దూరంగానే**
**లాప్‌టాప్ ముద్దుల కూతురు**
**ఎప్పుడూ ఒళ్లోనే!**

– కె.వి. సుబ్రమణ్యం,
విశాఖపట్నం

చెప్తున్నాను - ఈ వ్యవహారం మా యిద్దరి మధ్యనే వుంటుంది. నువ్విచ్చిన పది షిల్లింగులతోనే నేను గెలవడం ప్రారంభమయింది. అంచేత నువ్వు అదృష్టవంతుడివని అనుకుంటున్నాను. ఈ సంగతి మరెవరికీ చెప్పవుకదా? "

కుర్రాడు అంకుల్ని తన పెద్దపెద్ద కళ్లతో వేడుకోలుగా చూసేడు.

అంకుల్ చలించిపోయాడు. కొంచెం అసహనంగా కూడా అనిపించి నవ్వేడు.

"సరే! అలాగే కానీరా బాబూ! నువ్వు చెప్తున్న సంగతులు నేనెవరికీ చెప్పను. డేఫొడిల్లా? అయితే దాని మీద నువ్వెంత కాస్తున్నావ్? "

"నా దగ్గరున్నదంతా - ఇరవై పౌండ్లు మినహాయించి. ఆ ఇరవై పౌండ్లు రిజర్వులో వుంచుకుంటాను"

అదేదో గొప్ప జోకులా అనిపించింది అంకుల్ ఆస్కార్‌కి.

"ఇరవై పౌండ్లు రిజర్వులో వుంచుకుంటున్నావా? మరైతే నీ పందెం ఎంత? "

"నేను మూడు వందలు పందెం కాస్తున్నాను" అన్నాడు కుర్రాడు సీరియస్‌గా.

"ఇది మనిద్దరి మధ్యనే వుండాలి. అంకుల్! నువ్వెవరికీ చెప్పవు కదా? "

అంకుల్ విరగబడి నవ్వేడు.

"మనిద్దరి మధ్యనే వుంటుందిరా - కానీ నీ మూడు వందలూ ఏవీ? " అన్నాడు - నవ్వుతూ.

"బేసెట్ దాస్తాడు. మేం పార్ట్ నర్స్‌మి"

"అవునా? మీరిద్దరూ పార్ట్‌నర్సా? సరే మరి బేసెట్ ఎంత పందెం కాస్తాడట ఈ డేఫొడిల్ మీద? "

"నేను కాస్తున్నంత యెక్కువ పందెం అతను కాయడం లేదు. బహుశా నూట యాభై కాస్తూ వుండొచ్చు"

"పెన్నీలా? "అన్నాడు అంకుల్ నవ్వుతూ.

"పౌండ్లు" అన్నాడు కుర్రాడు అంకుల్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"బేసెట్ - నాకంటే యెక్కువ డబ్బు రిజర్వ్‌లో వుంచుకుంటాడు"

ఆశ్చర్యం, తమాషా భావాల మధ్య వూగిసలాడుతూ వుండిపోయాడు అంకుల్ ఆస్కార్. విషయాన్ని మరిపొడిగించలేదు. కానీ, లింకాన్ రేసులకి తన మేనల్లుడ్ని తీసుకు వెళ్లాలని గట్టిగా నిశ్చయించుకున్నాడు.

"ఒరే కుర్రాడా!, నేను మీర్జా మీద ఇరవై పౌండ్లు కాస్తున్నాను. నీ కోసం అయిదు పౌండ్లు, నువ్వు యే గుర్రం పేరు చెపితే దానిమీద కాస్తాను. నువ్వు యే గుర్రాన్ని యెంచుకుంటావు? "

"డేఫొడిల్ అంకుల్"

"ఉహు, డేఫొడిల్ మీద అయిదు కట్టలేనురా!"

"ఆ అయిదు పౌండ్లు నావే అయితే నేను డేఫొడిల్ మీదే కాస్తాను"

"సరే! నువ్వన్నట్టే చేస్తాను. ఒక అయిదు నీ పేరు మీదా, ఒక అయిదు నాపేరు మీదా డేఫొడిల్ మీద కడుతున్నాను"

గుర్రప్పందేలు చూడ్డానికి అంతకు ముందు యెప్పుడూ వెళ్ళలేదు కుర్రాడు. వాడి కళ్లల్లో నీలిమంటలు మండుతున్నట్టనిపించింది అంకుల్ ఆస్కార్‌కి. గట్టిగా వూపిరి బిగబట్టి మరీ చూస్తున్నాడు. వాళ్ల

అక్షరం

నిజం చెప్పడానికి
ఎంతో ధైర్యం ఉండాలి
అలాగే నిజం ఒప్పుకోవడానికి
అంతకుమించిన ధైర్యం ఉండాలి

– ఆర్.కె. నారాయణ్



ముందు వరసలో కూర్చున్న ఒక పెద్ద మనిషి తన డబ్బుని లాన్సలెట్ మీద కాసేడు. మహోవ్రేకంతో చేతులు కిందికీ మీదకీ వూపుతూ 'లాన్సలెట్, లాన్సలెట్' అని ఫ్రెంచ్ యాసతో అరుస్తున్నాడు.

డేఫోడిల్ ముందు లాన్సలెట్ తర్వాత, మీర్జా మూడో స్థానంలోనీ వచ్చేయి. కళ్ళు మెరుస్తున్నా కుర్రాడు మాత్రం సీరియస్‌గా వున్నాడు. అంకుల్ నాలుగు అయిదు పౌండ్ల నోట్లని తెచ్చేడు. ఒకటికి నాలుగు రెట్లు. "ఏం చెయ్యమంటావురా ఈ డబ్బుని" అనడిగేడు అంకుల్ కుర్రాడి ముందు నోట్లని వూగిస్తూ.

"బేసెట్‌తో మాట్లాడదాం. నా దగ్గరిప్పుడు పదిహేను వందలు వున్నాయనుకుంటాను. ఇరవై రిజర్వులో ఉన్నాయి ఇప్పుడీ యిరవై"

కుర్రాడి ముఖంలోకి కొంచెం పరీక్షగా చూసి "చూడు నాన్నా! బేసెట్- పదిహేనువందలూ- వీటి గురించి నువ్వు సీరియస్‌గా మాట్లాడ్డం లేదు యేం, అంతే కదా? " అన్నాడు అంకుల్ ఆస్కార్.

"నేను సీరియస్‌గానే చెప్తున్నాను. కానీ ఇది మనిద్దరి మధ్యనే వుండాలి అంకుల్- నిజంగానే- కదూ? "

"నిజంగానే. సరే- నేను బేసెట్‌తో మాట్లాడాలి"

"నువ్వు నాతోనీ, బేసెట్‌తోనీ పార్ట్‌నర్‌గా వుంటానంటే మనమంతా పార్ట్‌నర్స్‌గా వుండొచ్చు. కానీ మన ముగ్గురి మధ్యనే వుండాలి ఈ విషయం. అలాగని నువ్వు మాట యివ్వాలి. బేసెట్, నేనూ అదృష్టవంతులమి. నువ్వూ అదృష్టవంతుడివే అయివుండాలి. ఎంచేతనంటే నువ్విచ్చిన పది షిల్లింగులతోనే నేను గెలవడం ప్రారంభించేను"

★ ★ ★

ఒకనాడు మధ్యాహ్నం పాల్‌నీ, బేసెట్‌నీ రిచ్‌మండ్ పార్క్‌కి తీసుకెళ్లాడు అంకుల్ ఆస్కార్. అక్కడ కూర్చొని తీరిగ్గా మాట్లాడుకున్నారు.

"సార్! ఇలా జరిగింది- మాస్టర్ పాల్ గుర్రప్పందేల గురించి నన్ను చెప్పమంటాడు- కథలాగా. నేను గెలిచానో లేదో స్పష్టంగా చెప్పమంటాడు. ఒక సంవత్సరం కిందట అనుకుంటాను బ్లష్ ఆఫ్ డాన్ గుర్రం మీద అయిదు షిల్లింగులు పందెం కాసేడు. ఓడిపోయాం. తరవాత అదృష్టం తిరిగింది. మీరు పాల్‌కి యిచ్చిన పది షిల్లింగులతో, మేం సింఘలీస్ గుర్రం మీద కాసేం. అప్పట్నుండీ వరసగా గెలుస్తున్నాం. అవును కదా మాస్టర్ పాల్? "

"మాకు కచ్చితంగా తెలిస్తే మరేం ఫర్వాలేదు. మాకు తెలియకపోతే మాత్రం ఓడిపోతుంటాం" అన్నాడు పాల్.

"కానీ అలాటప్పుడు జాగ్రత్తగా వుంటాం" అన్నాడు బేసెట్.

"అయితే మీకు కచ్చితంగా యెప్పుడు తెలుస్తుంటుంది? " అనడిగేడు ఆస్కార్.

"అది పాల్‌కే తెలుస్తుంది సార్" అన్నాడు బేసెట్, కాస్త రహస్యంగా.

"స్వర్గం నుండి అతనికి తెలుస్తుందనుకుంటా సార్. లింకాన్‌లో డేఫొడిల్ గురించి తెలిసినట్టుగా అన్నమాట. మన

ముందు గెలిచే గుర్రం నిలబడి వున్నంత స్పష్టంగా తెలుస్తుంది సార్"

"డేఫొడిల్ మీద నువ్వేమేనా కాశావా?" అనడిగేడు అంకుల్ ఆస్కార్.

"కాసేను! నేనూ కొంత సంపాదించేను"

"నా మేనల్లుడో??"

బేసెట్ నిశ్శబ్దంగా అయిపోయాడు పాల్‌కేసి చూస్తూ.

"నాకు పన్నెండు వందలు వచ్చాయి కదా బేసెట్? డేఫొడిల్ మీద మూడొం దలు పెట్టినట్టు అంకుల్తో చెప్పేను"

"అవును అంతే" అన్నాడు బేసెట్.

"అయితే యేదా డబ్బు?" అడిగేడు అంకుల్.

"దాన్ని జాగ్రత్తగా దాచిపెడుతున్నాం సార్! మాస్టర్ పాల్ యే క్షణంలో అడిగినా అది రెడీగా వుంటుంది సార్"

"ఏవిటీ! పదిహేనువందల పౌండ్లా?"

"అదే కాదు- ఇంకా కొన్ని- మరో నలభై గెలిచిన ఇరవైతో కలుపుకొని"

"ఆశ్చర్యంగా వుందే!" అన్నాడు అంకుల్.

"నన్ను మన్నించండి సార్! ఇలా అంటున్నందుకు. కానీ మాస్టర్ పాల్ మిమ్మల్ని పార్ట్‌నర్‌గా వుండమంటే తప్పకుండా ఒప్పుకుంటాను, నేనేగాని మీ స్థానంలో వుంటే" అన్నాడు బేసెట్.

ఆస్కార్ ఆలోచించేడు. తరవాత "నేను డబ్బుని నా కళ్లతో చూడాలి" అన్నాడు.

ఇంటికి వెళ్ళేరు. వాళ్లు చెప్పినట్టే బేసెట్ పదిహేనువందల పౌండ్ల నోట్లని పట్టుకొచ్చి చూపించేడు. గార్డెన్ హౌస్‌లో రిజర్వుడు యిరవై పౌండ్లు, డిపాజిట్లో వున్నాయి.

"చూడంకుల్! నాకు కచ్చితంగా తెలిసినప్పుడు ఫర్వాలేదు. అప్పుడు మేం పెద్ద పందెం కాస్తాం. 'డేఫొడిల్' గురించి తెలిసినట్లన్నమాట. ఒక్కసారి వూహగా మాత్రమే తెలుస్తుంది. ఒక్కోసారైతే కనీసం వూహకూడా తట్టదు. అంతేకదా బేసెట్? అలాటప్పుడు మేం జాగ్రత్తగా వుంటాం. ఎందుకంటే అలాటప్పుడు సాధారణంగా ఓడిపోతుంటాం గనక"

"బావుంది 'డేఫొడిల్' గురించి నువ్వు కచ్చితంగా చెప్పావు కదా అలా యెలా చెప్పగలుగుతావూ?"

"నాకు తెలీదు" అన్నాడు పాల్ ఇబ్బంది పడుతూ. "నేను కచ్చితంగా చెప్పగలుగుతాను. అంతే అంకుల్" అన్నాడు పాల్.

"స్వర్గం నుండి అతనికి యెవరో చెప్పినట్లు అనిపిస్తుంది సార్" అన్నాడు బేసెట్.

"అలాగే అనుకోవాలి" అన్నాడు అంకుల్.

కానీ అతను కూడా పార్ట్‌నర్ అయేడు. 'లీగర్' పందేలు వచ్చినప్పుడు పాల్ కచ్చితంగా 'లైవ్‌లీ స్పార్క్' గెలుస్తుందని చెప్పేడు. ఆ గుర్రం బొత్తిగా ఆలోచించడానికి కూడా వీలు కానంత నాసిరకం. ఆ గుర్రం మీద వెయ్యి పౌండ్లు కాయమని కుర్రాడు పట్టుపట్టేడు. బేసెట్ ఆరు వందలు కాసేడు. ఆస్కార్ రెండు వందల పౌండ్లు కాసేడు. 'లైవ్‌లీ స్పార్క్' గెలిచింది. ఒకటికి పదిరెట్లు గెలుచుకున్నాడు. పాల్ పదివేల పౌండ్లు సంపాదించేడు.

"చూశావా అంకుల్! నాకు కచ్చితంగా తెలిసిపోయింది" అన్నాడు పాల్.

ఆస్కార్ కూడా రెండు వేల పౌండ్లు సంపాదించేడు.

"చూడూ! ఇదంతా నాకెందుకో భయం కలిగిస్తోంది" అన్నాడు ఆస్కార్.

"భయం అక్కర్లేదు అంకుల్! ఈసారి చాలారోజుల దాకా నేను యే గుర్రం గురించీ చెప్పలేకపోవచ్చు"

"అదిసరేగాని నువ్వు యేం చేస్తావు ఈ డబ్బుతో?" అనడిగేడు అంకుల్ ఆస్కార్.

"ఇదంతా నేను అమ్మకోసమనే కదా ప్రారంభించేను. నాన్న అదృష్టవంతుడు కాడు కనక తనకి కూడా అదృష్టం లేదని



అనుకుంటోంది ఆమె. అంచేత నేననుకు న్నాను- నేను గాని అదృష్టవంతుడ్నయితే గుసగుసలు ఆగిపోతాయని"

"ఏ గుసగుస లాగిపోతాయంటావ్? "

"మా యింట్లో వినిపించే గుసగుసలు. అందుకనే మా యిల్లంటే నాకు ద్వేషం"

"ఏమని గుసగుస లాడుతుంటుంది మీ యిల్లు? "

"డబ్బు తక్కువగా వున్నదనే గుసగుసలు.. నీకు తెలుసు కదా అంకుల్!"

"అవునవును నాకు తెలుసు!"

"పైగా ఇది కూడా నీకు తెలుసు కదా బాకీలు తీర్చమని అమ్మకి నోటీసులు వస్తుంటాయని"

"అవున్నాకు తెలుసు"

"ఇల్లు గుసగుసలాడుతుంటుంది.. నీవెనకాతల నీ గురించి మనుషులు నవ్వుకుంటున్నట్టు. అది నిజంగా ఘోరం. అంచేతనే నేననుకున్నాను నేనే అదృష్టవంతుడ్నయితే"

"ఆ గుసగుసల్ని ఆపవచ్చని అంతేనా? " గొంతుకలిపేడు అంకుల్ ఆస్కార్.

తన పెద్ద పెద్ద నీలిరంగు కళ్లతో అంకుల్ని గమనిస్తున్నాడు కుర్రాడు. ఆ కళ్లల్లో అర్థం చేసోకోడానికి వీలుకాని అగ్నిలాంటి జ్వాల యేదో కనిపిస్తోంది.

"సరే అయితే ఇప్పుడు మనం యేం చేద్దాం? " అన్నాడు అంకుల్.

"నాకు అదృష్టం కలిసొచ్చిందని అమ్మకి తెలియడం నాకిష్టం లేదు"

"ఎంచేతరా బాబూ? "

"నన్ను ఆపేస్తుంది"

"అలా చేస్తుందనుకోను"

"అమ్మకి తెలీడం నాకిష్టం లేదు" అన్నాడు కుర్రాడు చిత్రమైన శరీరభంగిమలతో.

"సరే అలాగే కానీ! ఆవిడకి తెలియకుండానే నడిపిద్దాం"

ఆ విధంగా నిర్ణయించుకొని చాలా చాక

చక్యంగా నడిపించేరు వ్యవహారాన్ని. అంకుల్ సూచన మేరకి పాల్ అతనికి అయిదువేల పౌండ్లు యిచ్చేడు. అతడు ఆ డబ్బుని ఫేమిలీ లాయరు దగ్గర డిపాజిట్ చేశాడు. లాయర్ పాల్ తల్లికి భోగట్టా అందచెయ్యాలి. ఆమె బంధువెవరో ఒకా యన తన దగ్గర అయిదువేల పౌండ్లు డిపాజిట్ చేశారనీ, ఆ డిపాజిట్ నుండి సంవత్సరానికి వెయ్యి పౌండ్ల చొప్పున ఆమెకి పుట్టింరోజు కానుకగా ముడుతూ వుంటుందనీ లాయరు చెప్పిన సందేశం.

"అలాగయితే పుట్టినరోజు బహుమా నంగా అయిదు సంవత్సరాల వరకూ సం వత్సరానికి వెయ్యేసి పౌండ్లు అందుతూ వుంటాయన్నమాట" అన్నాడు అంకుల్.

"ఈ యేర్పాటుతో పరిస్థితులు మరీ అంత ఇబ్బందికరంగా తయారవకుండా కాపాడుతూ ఉంటాయి ఆమెని"

పాల్ తల్లి పుట్టినరోజు నవంబరులో వస్తుంది. పాల్ ఇప్పుడు తల్లిదండ్రులతో కలిసే భోంచేస్తున్నాడు.. నర్సరీ స్థితి దాటి పోయాడు కనక. అతని తల్లి ఇంచు మించు ప్రతీరోజు పట్నం వెళుతూ వుంటుంది. డ్రెస్ మెటీరియల్ మీదా, వున్ని దుస్తుల మీదా స్కెచ్చిలు వెయ్య డంలో తనకి నైపుణ్యం వున్నదని గ్రహిం చిందావిడ. దాంతో రహస్యంగా ఒక స్నేహితురాలి స్టూడియోలో వర్క్ చేస్తుం డేది. ఆ ఫెండ్రు దుస్తులు తయారుచేసే వాళ్లకి ఆర్టిస్టు. వున్ని దుస్తుల్లో వున్న పెద్దింటి మహిళల చిత్రాలు వేసేది. న్యూస్ పేపర్ ఎడ్వర్టయిజ్‌మెంటు కోసం చిత్రాలు తయారుచేసేది. ఈ ఆర్టిస్టు ఫ్రెండు సంవత్సరానికి యెన్నో వేల పౌండ్లు సంపాదిస్తు వుండేది. కానీ పాల్ తల్లికి మాత్రం కొన్ని వందల పౌండ్లు మాత్రమే ఇచ్చేది.

దీనివల్ల పాల్ తల్లికి మరో అసంతృప్తి. ఎందులోనో ఒకదాన్లో తను ప్రథమురా లిగా వుండాలనేదే ఆమె కాంక్ష. కానీ దేన్లోనీ విజయం సాధించలేకపోతోంది. కనీసం దుస్తుల మీద వేసే బొమ్మల అడ్వ ర్టయిజ్‌మెంటులో కూడా.

తన పుట్టినరోజు నాడు బ్రేక్‌ఫాస్ట్ చెయ్యడానికి కిందికొచ్చింది. తనకి వచ్చిన వుత్తరాలు చదువుతుంటే ఆమె ముఖాన్ని పరిశీలనగా చూస్తున్నాడు పాల్. లాయర్ లెటర్ పంపించినట్టు తెలుసు పాల్‌కి. దాన్ని చదవగానే ఆవిడ ముఖం మరింత కఠినంగా మారింది. ముఖంలో యే భా వాలు లేకుండా పోయాయి. తరవాత యే దో నిశ్చయించుకున్నట్టుగా కనపడింది. దాని గురించి ఒక్కమాట కూడా అనకుండా మిగి లిన వుత్తరాల అడుగున దాచేసింది.

"అమ్మా! నీ పుట్టినరోజునాడు యేదేనా మంచి విషయం పోస్టు ద్వారా నీకు అంద లేదా? " అనడిగేడు పాల్.

"చాలా చిన్న, మంచి సంగతి" అన్నదా విడ. ఆమె గొంతులో ఏ భావం లేదు. ఇంక మరేమీ మాటాడకుండా టౌన్లోకి వె ళ్లిపోయింది.

మధ్యాహ్నం అంకుల్ ఆస్కార్ వచ్చేడు. పాల్ తల్లి లాయరుతో సుదీర్ఘంగా సంభా షించిందని చెప్పేడు. 'తాను అప్పుల్లో వున్నాననీ అంచేత అయిదు వేల పౌండ్లనీ వెంటనే తీస్కోడానికి అవకాశం లేదా' అన డిగిందట.

"నువ్వేమంటావ్? " అన్నాడు పాల్.

"నిర్ణయం నీకే వదిలిపెడుతున్నాను"

"సరే! అలాగయితే ఆవిడ ఆ డబ్బుని తీస్కోనీ. మిగిలిన పందేల్లో మనకి మరి కొంచెం డబ్బు వస్తుంది కదా"

"అరువు ఆరు కాసుల కంటే, రొక్కం మూడు కాసులు నయం కదా" అన్నాడు అంకుల్.

"నిజమేకానీ గ్రేండ్ నేషనల్‌కి నాకు

తప్పకుండా తెలుస్తుంది. లేకపోతే 'లింకాన్ షైర్', లేకపోతే 'డెర్బీ' యేదో ఒక దానికి నాకు తప్పకుండా తెలుస్తుంది"

దాంతో లాయర్‌కి అంగీకారం తెలియపరిచేడు అంకుల్.

ఒక్కసారిగా అయిదువేల పౌండ్లు ముట్టేయి పాల్ తల్లికి.

ఇది జరిగేక ఒక వింతైన సంగతి జరిగింది. ఇంట్లో వినిపించే గొంతుకలు అకస్మాత్తుగా వర్షాకాలంలో సాయంత్రాలప్పుడు కప్పలు చేసే వెర్రిగోలలా వున్నత స్థాయికి పెరిగిపోయాయి. ఇంటికి కొత్త అలంకారాలు వచ్చేయి. పాల్‌కి ఒక ట్యూటర్ని ఏర్పాటుచేశారు. పాల్ తన తండ్రి చదివిన ఎటాన్ పబ్లిక్‌స్కూల్‌కి నిజంగానే వెళ్లబోతున్నాడు వచ్చే శిశిరరుతువులో.

చలికాలంలో పువ్వులు కొన్నారు. పాల్ తల్లి తను కావాలని కోరుకుంటున్న విలాసాలనన్నిట్నీ సమకూర్చుకుంటోంది. అయినప్పటికీ ఇంట్లో వినిపించే గొంతుకలు మిమోసా, ఆమండ ఫ్లవర్ కుండీల వెనకనించి మెరిసిపోతున్న కుషన్ కింద నుండి కీచుగొంతుకలతో సంతోషంగా అరవడం మొదలుపెట్టేయి.. 'మరికొంచెం డబ్బుకావాలి, మరికొంచెం డబ్బుకావాలి'- 'ఇప్పుడు, ఇప్పుడు- మరికొంచెం డబ్బు కావాలి, మరికొంచెం డబ్బు కావాలి- ఎప్పటికంటే కూడా, మరింత డబ్బు కావాలి' అంటూ.

ఈ అరుపులు పాల్‌ని భయభ్రాంతుడ్ని చేసేయి. తన ట్యూటర్‌తో కలిసి లాటిన్, గ్రీకు చదువుతుండేవాడు. కానీ- బేసెట్‌తోనే సమయమంతా ఎక్కువగా గడిచేది.

'గ్రేండ్ నేషనల్' వచ్చి వెళ్లిపోయింది. గుర్రం పేరు తెలియలేదు పాల్‌కి. ఓ వంద పౌండ్లు నష్టపోయారు. వేసంగి వచ్చేస్తోంది. 'లింకాన్' గురించి చాలా ఆందోళన పడుతున్నాడు పాల్. కానీ 'లింకాన్'కి కూడ అతనికి తెలియలేదు. మరో యాభై పౌండ్లు పోయాయి. అతని

## కొత్తగాలి...

**ఎన్నికల ముందు నాయకులు**
**కోతల రాయుళ్లు!**
**ఎన్నుకున్నాక**
**వాతల రాయుళ్లు!**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

కళ్లు యిప్పుడు భయంకరంగా కనిపిస్తున్నాయి. అతనిలో యేదో తీవ్రమయిన ఆందోళన బయటపడ్డానికి సిద్ధంగా వున్నట్టనిపించేది.

'పోతేపోనీరా బాబూ! దాని గురించి నువ్వు బెంగపెట్టుకోకు' అని కుర్రాడ్ని మందలించేవాడు అంకుల్ ఆస్కార్. కానీ అతను చెపుతున్న మాటలు తనచెవికి వినపడనట్టుగావుండేది పాల్ ప్రవర్తన.

"డెర్బీకి నాకు తెలిసి తీరాలి, డెర్బీకి నాకు తెలిసి తీరాలి" అని కుర్రాడు రెట్టించి మరీ అన్నాడు. విశాలమైన వాడి నీలిరంగుకళ్లు - ఏదో వున్మాదంతో జ్వలిస్తున్నట్టు కనిపించేవి.

ఏదో తీవ్రమయిన ఒత్తిడిలో వున్నాడు కొడుకని గ్రహించింది తల్లి. దాంతో "నువ్వు కొంతకాలం సముద్రతీరానికి వెళ్లడం మంచిది. కొంతకాలం ఆగేకంటే - వెంటనే వెళ్తే మంచిది కదా?" అంది పాల్ తల్లి - కొడుకు వైపు ఆత్రంగా చూస్తూ. కొడుకు గరించి ఆలోచనలతో - ఆమె గుండెలు బరువెక్కేయి. కానీ- కుర్రాడు మాత్రం తన అంతు చిక్కనివ్వని పెద్ద కళ్లతో పైకిచూస్తూ "డెర్బీకి ముందుగా బహుశా వెళ్లలేనమ్మా" అన్నాడు.

"ఎందుకని?" తన ప్రతిపాదనకి వ్యతిరే

కత రాగానే ఆమె గొంతు పెరిగింది.

"ఎందుకని? కావాలంటే మీ అంకుల్ ఆస్కార్‌తో కలిసి సముద్రపు ఒడ్డు నుండే 'డెర్బీ'కి వెళ్లవచ్చు కదా! అదే నీకోర్కెకైతే ఇక్కడ వుండి పోవలసిన అవసరం యేమీ లేదు. అదీకాక నువ్వు గుర్రప్పందేల గురించి మరీ యెక్కువగా పట్టించుకుంటు న్నావనిపిస్తోంది నాకు. అది మంచిది కాదు. మా కుటుంబం యిలాటి జూదాల కుటుంబమే. గుర్రప్పందేల వల్ల యెంత హాని జరుగుతుందో నువ్వు పెద్దవాడివైన తరవాత గానీ గుర్తించలేవు. నేను ఆ బేసెట్‌ని వుద్యోగం లోంచి తీసేస్తాను. అంకుల్ ఆస్కార్‌ని గుర్రప్పందేల విష యం నీ దగ్గర మాట్లాడొద్దని చెప్తాను. సముద్రపొడ్డుకి కొన్నాళ్లు వెళ్లి యివన్నీ మరిచిపో. నువ్వు వీటి గురించి అతిగా ఆలోచించి పిచ్చివాడివయిపోతున్నావు"

"డెర్బీ అయిందాకా నన్నిక్కడ వుండ నిస్తే, నీకు యేదియిష్టమైతే అది చేస్తా నమ్మా" అన్నాడు కుర్రాడు.

"ఎక్కడ ఉండనివ్వాలి నిన్ను? ఈ యింట్లోనేనా? "

"అవును" అని జవాబిచ్చేడు కుర్రాడు- త ల్లివైపు తదేకంగా చూస్తూ.

"గమ్మత్తుగా వుందే! ఈ యిల్లంటే అక స్మాత్తుగా నీకింత ప్రేమ యెలా పుట్టుకొ చ్చింది? ఈ యిల్లంటే నీకిష్టమని నాకె ప్పుడూ తెలీలేదే!"

మాటాడకుండా ఆమెని చూస్తూ వుండి పోయాడు పాల్.

ఆ కుర్రాడికి ఒక రహస్యం వుంది. కా నీ ఆ రహస్యాన్ని బేసెట్‌కి గానీ, అంకుల్ ఆస్కార్‌కి గానీ తెలియనివ్వలేదు.

కుర్రాడితల్లి యేదీ తేల్చుకోలేక అహం దెబ్బ తిన్నట్టు అలా నిలబడిపోయింది కొంచెంసేపు. చివరకి "సరే! అలాగే కానీ. డెర్బీ అయిపోయిందాకా సముద్రపొడ్డుకి వెళ్లొద్దులే - నీకిష్టం లేకపోతే. కానీ- ఈ పందేల గురించి ఆలోచించి నీ ఆరోగ్యం పాడుచేస్కోనని మాట యివ్వాలి. ఈ సర దాల గురించీ, గుర్రప్పందేల గురించీ వాటి జోలికి పోనని మాట యివ్వాలి"

"అలాగే!" అన్నాడు కుర్రాడు మామూ లుగా. "వీటి గురించి పెద్దగా ఆలోచించ నమ్మా ఆ విషయంలో నువ్వు బెంగ పెట్టు కోకు. నేను నీలాగ వుండగలిగితే వాటి గు రించి ఆలోచించను"

"నువ్వు నాలాగ వుండడం, నేను నీలాగ వుండడమూనా? ఏవిటో యిదంతా నాకు బోధపడ్డంలేదు"

"కానీ- వీటి గురించి నువ్వేం బెంగ పెట్టుకోనక్కర్లేదమ్మా సరేనా" అన్నాడు పాల్ తల్లితో.

"చాలా సంతోషంగా వుంటుంది అలా జరిగితే" అందావిడ.

వాడి తూగుడు గుర్రమే పాల్ తాలూకా పరమ రహస్యం. నర్స్, నర్సరీల కట్టడి నుండి బయటపడ్డ వయస్సు వచ్చేసిందగ్గ ర్నుండీ పాల్ ఆ కొయ్యగుర్రాన్ని ఇంటి పై అంతస్తులో వున్న తన గదికి మార్పించేసు కున్నాడు.

"తూగుడు గుర్రం మీద వూగే వయసు దాటిపోయింది నీకు" అంది పాల్ తల్లి.. ఇంకా వాడు దాని మీద వూగాలనుకోడా నికి తన అయిష్టతని తెలియచేస్తూ.

"అలాగే అమ్మా! కానీ నాకు నిజం గు ర్రం వచ్చేదాకా దీన్ని వుండనీ. నా పక్కని యేదో ఒక జంతువు వుండాలని నా కోరి క" అని సమాధానం యిచ్చేడు కుర్రాడు.

ఆ రకంగా రంగు వెలిసిపోయినట్టుగా కనిపిస్తున్న తూగుడు గుర్రం కుర్రాడి పడ కగదిలోకొచ్చి దౌడు తియ్యడానికి సిద్ధంగా వున్న భంగిమలో నిలబడి వుంది.

'డెర్బీ' దగ్గర పడుతోంది. దాంతో కుర్రా డు మరింత ఎక్కువగా ఉద్రేకపడుతు

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# పాత్రచిత్రణలో అద్భుత శిల్పవిన్యాసం




'చతుర' మేనెల సంచిక మాతృత్వపు మధురమైన చిరునవ్వుతో పలకరించింది. డా.సి. రాధాకృష్ణన్ 'అగ్ని' మలయాళ నవలకు డా. చిల్లర భవానీదేవి అనువాదం తెలుగు నవలంత స్వచ్ఛంగా, సరళంగా ఉంది.

మనిషి సంపూర్ణతకు శరీరంలోని అన్ని అవయవాలకు ఎంత ప్రాధాన్యం ఉందో, అలాగే ఒక నవల ఆసాంతం ఉత్కంఠగా పాఠకులచే చదివించడానికి అందులోని కథావస్తువు, కథనశైలి, పాత్రచిత్రణ తదితర అంశాలకు అంతే ప్రాధాన్యం ఉంది. ఐదు దశాబ్దాల క్రితం వచ్చిన ఈ నవలలో అప్పటి సామాజిక పరిస్థితులను కళ్ల ముందు జరిగినట్లు అక్షరాల్లో చిత్రించారు రచయిత. 'అగ్ని' నవల కథాంశం గ్రామంలో ప్రారంభమై కేరళలోని జనజీవన విధానం, బ్రిటీషువారి రాజ్య విస్తరణ గురించి చక్కగా విశదపరిచారు. పాత్రచిత్రణ విషయానికి వస్తే ముఖ్యంగా మూసా పాత్రను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ధైర్యవంతులు సైతం కంపించేట్లుగా, ఒళ్లు జలదరించేలా ఉంది. కన్న కూతురు విషయంలో ఆమెకు కావలసినవన్నీ సమకూర్చడంలో బాధ్యత కలిగిన తండ్రిగా వ్యవహరించాడు. కూతురు అవిటితనం పోగొట్టడానికి అవసరమైన మందులు సిద్ధంచేయడం, కాలికి పూయడం, జ్వరం వచ్చినప్పుడు తిట్టి, కొట్టి మందు తాగించడం నాన్న ప్రేమకు నిదర్శనంగా ఉంది. కూతురు సులేమాన్‌తో కలవడం, గర్భం దాల్చడం, చివరికి అమాయకంగా అతనితో వెళ్లిపోవడం - ఈ సంఘటలన్నీ తన కళ్లముందే జరుగుతున్నప్పుడు మూసా అనుభవించిన మానసిక ఘర్షణ పాఠకుల హృదయాలను ద్రవింపజేస్తుంది. ఒక వైపు కన్న ప్రేమ.. మరోవైపు చేసిన తప్పునకు కూతుర్ని అక్కడికక్కడే నరికివేయాలన్నంత ఆగ్రహం. ఇవేవీ బయటకు వెల్లడికాకుండా మూసా అనుభవించిన ఆవేదన, ఆక్రోశం, ఆగ్రహం.. చేస్తున్న పనిలోనే వ్యక్తం కావడం పాత్రచిత్రణలో రచయిత చూపిన అద్భుతమైన శిల్పంగా చెప్పుకోవచ్చు. వైవిధ్యమైన దృశ్యకావ్యంలా 'అగ్ని' నవల ఎంతగానో అలరించింది.

మహాశ్వేతాదేవి పెద్దకథ 'తెల్లని నెత్తురు' స్త్రీజాతి ఔన్నత్యాన్ని చాటిచెప్పింది. తల్లిగా చెల్లిగా భార్యగా గొప్పస్థానాన్ని ఇచ్చినట్లు సమాజంలో ఎంతచెబుతున్నా వాస్తవంలో స్త్రీ అనాదిగా అన్నివిధాలా దోపిడీకి గురవుతోందన్న సత్యాన్ని రచయిత్రి హృదయాలు కరిగేలా చిత్రించారు. భార్యగా, పాలతల్లిగా అందరి అవసరాలు తీర్చిన యశోదను ఎవరూ ఆదరించకపోవడం అమానుషం అనిపించక మానదు. నిస్వార్థమైన తల్లిప్రేమకు నిదర్శనం 'అమ్మకు జేజే' ప్రత్యేక వ్యాసం. ఇంకా చమత్'కారం', 'కొత్తగాలి' కవితలు, 'చతుర ప్ర.జ.', 'చతురంగం' ఆకట్టుకున్నాయి. ప్రధానంగా 'భామనే సత్యభామనే' ప్రతి నెలా మమ్మల్ని అలరిస్తోంది.



– సయ్యద్ జమీలాబేగం, కర్నూలు

## కొత్తగాలి...

**నాటి రైతన్న నలుగురికీ**
**అన్నం పెట్టే అన్నదాత!**
**నేటి రైతన్న నలుగురి వద్దా**
**చేయిచాచే రుణగ్రహీత!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

న్నట్టు కనిపిస్తున్నాడు. ఎవరేనా ఏదేనా చెపితే అస్సలు వినిపించనట్టు ప్రవర్తిస్తు న్నాడు. బాగా చిక్కిపోయేడు కూడాను. కళ్లు ఎవరికీ అంతుచిక్కని పరిస్థితిలో వు న్నట్టు ప్రకాశిస్తున్నాయి. కుర్రవాడి గురిం చి యెందుకో అకస్మాత్తుగా ఆందోళన ఆరంభమయింది తల్లికి. ఒక్కోసారైతే వాడి గురించి బెంగపెట్టేసుకుని ఓ అర గంటసేపు అలా వుండిపోతోంది. వాడి ద గ్గరకి పరుగెత్తుకెళ్లి చూసి, కొడుకు కులా సాగా వున్నాడో? లేదో? తేల్చుకోవాలను కుంది. 'డెర్బీ'కి రెండురాత్రుల ముందు, పట్నంలో ఓ పెద్దపార్టీలో వుందావిడ. అలాటి సమయంలో తన మొదటి సంతానం అయిన కొడుకు పాల్ గురించి యెందుకో బెంగ వచ్చేసి మరెవరితోనీ మా టాడలేకపోయింది.

ఎంతో ప్రయత్నం చేసింది తన ఫీలింగ్స్‌ని అదుపులోకి తెచ్చుకోడానికి. ఎందుకంటే యిలాటి పార్టీల్లో వున్నప్పుడు యెలా ప్రవర్తించాలో తనకి తెలుసు కనక. కానీ మరీ బలంగా కుదిపేస్తోంది కొడుకు గురించి ఆందోళన. డాన్స్‌ని విడిచిపెట్టేసి కిందకి వెళ్లి యింటికి ఫోన్ చేసింది. అంత రాత్రప్పుడు వచ్చిన ఫోన్ విని ఆశ్చ ర్యపోయింది పిల్లల నర్స్.

"పిల్లలు బాగున్నారా మిస్ విల్ మాట్?"

"బాగానే వున్నారమ్మా"

"మాస్టర్ పాల్ బాగానే వున్నాడా?"

"పడుకోడానికి నేరుగా వెళ్లిపోయాడే! అయినా ఒకసారి మీదికి వెళ్లి చూసొచ్చి చెప్పనా?"

"ఒద్దులే" అంది పాల్ తల్లి అయిష్టంగా. "అక్కర్లేదులే! అనవసరంగా శ్రమపడకు నాకోసం చూస్తూ కూర్చోవద్దు. ఇంటికి తొందరగానే వచ్చేస్తా" కొడుక్కి యెక్కడ నిద్రాభంగం అవుతుందోనని ఆమె భయం.

తల్లి, తండ్రి యింటికి వచ్చేసరికి రాత్రి ఇంచుమించు ఒంటిగంటయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. పాల్ తల్లి తన గది లోకి వెళ్లి వున్నికోటుని తీసేసింది. తన కోసం వేచి వుండనక్కరలేదని నౌకర్లకి ముందే చెప్పింది. భర్త కింద విస్కీ సోడా కలుపుకుంటూండడం వినిపించింది.

కొడుకు గురించి మనసులో ఆందోళన పడుతుండడం వల్ల మెల్లగా మేడ మీదకి వెళ్లింది. చప్పుడు చెయ్యకుండా మేడమీద వరండాలో నడుస్తోంది. ఏదో చిన్న శబ్దం వినిపిస్తోంది, యేమిటది?

కొడుకు గది వెలుపల నిలబడి విం టోంది వూపిరి బిగబట్టుకొని. లోపల నుంచి యేదో బరువైన వింతైన అస్పష్ట మైన శబ్దం వినిపిస్తోంది. ఆమెకి గుండె కొట్టుకోడం మానేసినట్టనిపించింది. విని పించీ వినిపించని శబ్దం! కానీ తొందర గానూ బలంగానూ వినిపిస్తున్నట్టనిపిం చింది. ఏదో పెద్ద గమనంలో వినిపించే చప్పుడు. ఏవిటది? భగవంతుడా ఏమిటా చప్పుడు? నేను తెలుసుకొని తీరాలి. ఆ చ ప్పుడు తనకి పరిచయం వున్నట్టనిపించిం దావిడకి. కాని కచ్చితంగా ఇదీ అని నిశ్చ యించుకోలేక పోతోంది. ఆ శబ్దం అలా సాగుతూనే వుంది.

అ
క్ష
రం

పరులను నిందించడం కాదు,
ఎప్పటికప్పుడు నీ తప్పులు తెలుసుకుని సరిదిద్దుకో
అప్పుడే జీవితంలో ఉన్నత స్థానానికి చేరుకోగలవు

– అబ్రహాం లింకన్



వెర్రిగా ఆందోళన, భయాలతో కొయ్య బారిపోతూ మెల్లగా తలుపు తెరిచింది.

గది చీకటిగా వుంది. అయినా కిటికీకి దగ్గరగా ఏదో ముందుకీ వెనక్కీ తీవ్రంగా వూగుతున్నట్టనిపించింది. భయంతోనీ, ఆశ్చర్యంతోనీ తేరిపార చూసిందామె. తరవాత అకస్మాత్తుగా లైటు వేసింది.

ఆకుపచ్చని పైజామాలో తన కొడుకుని చూసింది, తూగుడు గుర్రం మీద కూర్చొని వున్నాదిలా ముందుకీ, వెనక్కీ వూగుతూ.

లైటు వెలుతురు కొయ్యగుర్రాన్ని పరిగెత్తిస్తున్న భంగిమలో వున్న వాడి మీద పడింది.

"పాల్! ఏం చేస్తున్నావ్?" కేకవేసింది.

"అది మలబార్" అని పాల్ గట్టిగా అరిచేడు.. పెద్దగా, వింతగా వినిపించే గొంతుకతో. 'అది మలబార్' అతడి కళ్లు ఒక్క క్షణకాలం ఆమెవైపు చూశాయి వింతగా, స్పృహ లేనట్టుగా. తరవాత దబ్బున కింద పడిపోయాడు.

ఒక్కసారిగా మాతృత్వభావం పెల్లుబికిందామెలో. పరుగెత్తుకెళ్లి కొడుకుని తన చేతుల్లోకి తీసుకుంది. కానీ కుర్రాడు అపస్మారక స్థితిలో వున్నాడు. అలా అపస్మారక స్థితిలోనే గడిచింది కాలం, ఏదో బ్రెయిన్ ఫీవర్‌తో. కానీ అటూ యిటూ దొర్లుతూ ఏదో మాట్లాడుతూనే వున్నాడు. వాడి తల్లి రాయిలా గడ్డకట్టుకుపోయి వాడి పక్కనే కూర్చుంది.

'మలబార్! అది మలబార్! బేసెట్, బేసెట్, అది మలబార్' ఆ రకంగా కుర్రాడు కలవరించడం మొదలెట్టేడు లేచి పోయి కొయ్యగుర్రాన్ని వూగించాలని ప్రయత్నిస్తూ..

"మలబార్ అంటున్నాడు, ఆ మాటకి అర్థమేమిటి?" అనడిగింది, హృదయం బద్దలయిపోతున్న తల్లి.

"నాకు తెలీదు" అన్నాడు తండ్రి, ఆయనా గడ్డకట్టిపోతూ.

"మలబార్ అంటున్నాడు యేమిటి?" అని తన అన్న ఆస్కార్‌ని అడిగింది.

"డెర్బీ పందెంలో పాల్గొంటున్న ఒక గుర్రం పేరు" అని జవాబిచ్చేడు.

ఒకపక్క మనస్తాపంతో బాధపడుతున్నా ఆస్కార్ బేసెట్‌తో మాట్లాడి మలబార్ మీద వెయ్యిపౌండ్లు పందెం కాసేడు. ఒకటికి పధ్నాలుగు రెట్లు.

మూడోరోజునాటికి ప్రమాదకరంగా మారింది పాల్ జ్వరం. తన పొడవైన వంకీల జుట్టుతో తలని దిండుమీద నిలవ నివ్వకుండా అటూయిటూ వూగిస్తున్నాడు కుర్రాడు. వాడు నిద్రపోవడంలేదు. అలాగని తెలివీ రాలేదు. వాడి కళ్లు నీలి రాళ్లలా వున్నాయి. తల్లి నిజంగానే హృదయం రాయి అయిపోయిన దానిలా పిల్లవాడి పక్కన కూర్చుంది.

సాయంకాలం ఆస్కార్, బేసెట్‌లు రాలేదు. కానీ బేసెట్ ఒక చిన్న సందేశం పంపుకున్నాడు.. 'తను ఒక్కక్షణం ఒక క్షణం అంటే ఒక్క క్షణం పైకి రావచ్చునా?' అని.

వాడి ప్రవర్తన పాల్ తల్లికి బాగా కోపం తెప్పించింది. కానీ మరోమారు ఆలోచించేక సరే రమ్మంది.. ఏమో బేసెట్ రావ

## పుస్తకావిష్కరణ



త్యాగరాయగానసభలో ఏప్రిల్ 23న జరిగిన శారదాఅశోకవర్ధన్ 'నా సిరిచుక్క సికింద్రాబాద్' పుస్తకావిష్కరణ సభలో డా. సి.నారాయణరెడ్డి, కళాదీక్షితులు, విహారి, డా. ఎన్. గోపి, వాసా ప్రభావతి, తమిరిశ జానకిలతో రచయిత్రి

డంవల్ల కుర్రాడికి తెలివి వస్తుందేమోనని భావించి.

పొట్టిగా, బ్రౌన్ కలర్ మీసంతో, చురుకైన బ్రౌన్ కలర్ కళ్లతో ఏమాత్రం శబ్దం కాకుండా గదిలోకి వచ్చేడు తోటమాలి బేసెట్. పాల్ తల్లికి సెల్యూట్ చేసి మెల్లగా పక్క దగ్గరికి వెళ్లేడు. జ్వరంతో కొట్టుకుంటూ మరణావస్థలో వున్న కుర్రాడ్ని తన చురుకైన కళ్లు మెరుస్తుండగా "మాస్టర్ పాల్!" అని అతి మెల్లగా పిల్చేడు. "మాస్టర్ పాల్! మలబార్ మొదటి ప్లేస్‌లో వచ్చింది. మీరు చెప్పినట్టే చేసేను. మీకు డెబ్బైవేల పౌండ్లు వచ్చేయి. మలబార్ గెలిచింది మాస్టర్ పాల్!"

"మలబార్! మలబార్! మలబారని నేను అన్నాను కదా అమ్మా! నేను మలబార్ అన్నానా? నేను అదృష్టవంతుడ్నని అంటావా అమ్మా? నాకు మలబారని తెలుసు. నేను చెప్పలేదా? యెనభైవేల పౌండ్లు! అది అదృష్టమే అంటాను.

నువ్వు అనవా అమ్మా? నాకు తెలుసు నాకు తెలుసు- మలబార్ గెలుస్తుందని. అనుకున్నట్లుగానే గెలిచింది. పేరు తెలిసిందాకా నేను నా గుర్రం మీద ప్రయాణం చెయ్యగలిగానా అప్పుడు కచ్చితంగా తెలిసిపోతుంది. బేసెట్ నువ్వు యెంత పెట్టుబడి పెట్టగలిగితే అంతా పెట్టొచ్చు. నీదగ్గరున్నదంతా పందెం కాసేవా బేసెట్? "

"వేయి పౌండ్లు కట్టేను మాస్టర్ పాల్"

"అమ్మా! నీకెప్పుడూ చెప్పలేదు. నేను గుర్రం మీద స్వారీచేసి 'అక్కడికి' చేరుకోగలిగితే, అప్పుడు నాకు కచ్చితంగా తెలిసిపోతుంది.. అవును కచ్చితంగా. అమ్మా! నీతో ఎప్పుడేనా చెప్పేనా నేను అదృష్టవంతుడ్నని? "

"లేదు నువ్వెప్పుడూ చెప్పలేదు" అంది.

ఆ రాత్రి పాల్ చనిపోయాడు.

చనిపోయిన కుర్రాడ్ని చూస్తూ ఆమె సోదరుడు యిలా అన్నాడు "Oh, God- Hester నీకిప్పుడు ఎనభై వేల పౌండ్లు పైనున్నాయి. కానీ బంగారంగని లాంటి కొడుకుని పోగొట్టుకున్నావ్. వాడు చనిపోడమే మంచిది. స్వర్గంలో తూగుడు గుర్రం మీద వూగుతూ గెలుపు గుర్రం కోసం చూస్తుంటాడు" ©




బొల్లిముంత శివరామకృష్ణ

# మృత్యుంజయులు

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**గత కాలానికి చరిత్ర సాక్షి. చరిత్రలో తేదీలు, సంఘటనలు, గణాంకాలు వుంటాయి. సామూహిక స్థాయిలో జరిగిన విషయాల వివరణా వుంటుంది. కానీ ఆ సమయాల్లో కలిగిన భయోత్పాతం, నరకయాతన, వ్యక్తిగతస్థాయిలోని సుఖఃదుఖాలు పైవాటి స్థాయిలోలాగ చరిత్రలో నమోదు కావు. వాటిని తెలుసుకోటానికి సాహిత్యం, కళలే ఆధారం. నిజాంపాలన నాటి జనజీవన స్థాయిని వివరంగా తెలిపిన నవల బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు'. ఈ నవల కథాకాలంలో నిజాంపాలనలోని తెలంగాణ పల్లెల మీద కీ.శే. వట్టికోట ఆళ్వార్‌స్వామి రచనలు గంగు, ప్రజల మనిషి- దాశరథి రంగాచార్యగారి నవలలు వున్నాయి. బొల్లిముంత శివరామకృష్ణకు తెలంగాణ ప్రజాజీవితం తోటి, మాండలికం తోటి ప్రత్యక్ష సంబంధం లేదు. ఈయన తెలంగాణవాసి కాదు. అయినా తెలంగాణలో జరిగిన అన్యాయాలకి, ఘాతుకాలకి, అమానుషదోపిడీకి స్పందించి ఈ నవల రాశారు. తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ దినోత్సవ ప్రత్యేకంగా ఈ 'మృత్యుంజయులు' నవలా విశ్లేషణ.**

'మృత్యుంజయులు' నవల పరిచయంలో తుమ్మలవారు.. 'చిరస్మరణీయమైన వీర తెలంగాణా గాథ ఇది. నిరంకుశ నిజాం ప్రభువు రాచరికంలో తొంభై లక్షల తెలుగు ప్రజలు దుర్భర దాస్యాన్ని అనుభవించారు. అమానుష హింసాకాండకు గురయ్యారు. నిజాం నిరంకుశోద్యోగులు జాగీర్దారులు, దేశముఖులు, వతన్‌దారులు అమాయకులైన గ్రామీణ ప్రజలను పీల్చి పిప్పి చేశారు. తమ తొత్తులచే అతిహేయమైన, అత్యంత క్రూరమైన, అనూహ్యామైన రాక్షస పద్ధతులతో ప్రజల్ని చిత్రహింసలకు గురిచేశారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలోనూ, ఆ తర్వాతనూ దేశమంతటా పెల్లుబికిన సంస్థానాధీశ వ్యతిరేక ప్రజాఉద్యమ వెల్లువకు తెలంగాణ మార్గదర్శకమైంది' అని రాశారు.

అలాగే రావి నారాయణరెడ్డిగారు రాసిన పరిచయంలో.. 'సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన సంస్థానాధీశులు, జాగీర్దారులు, జమీందార్లు తమ రెండు వందల సంవత్సరాల దోపిడీ ద్వారా భారతదేశానికి ఎంత నష్టం చేశారో చూడదలుచుకుంటే తెలంగాణ ప్రజల పరిస్థితి చూస్తే బోధపడుతుంది' అన్నారు.

వీరిద్దరూ అన్న మాటలకి ప్రతిబింబం 'మృత్యుంజయులు' నవల. బొల్లిముంత శివరామకృష్ణ పై విషయాలతో పాటు ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీ ప్రజాఉద్యమం వివరాలు కూడా ఈ నవలలో తెలిపారు.

'హిందూ ముస్లిం సమస్యను కూడా రచయిత చక్కగా చిత్రించారు. నైజాం నవాబు, హిందూ ముస్లిం ప్రజలకు సమాన శత్రువని నిరూపించారు. ప్రజాఉద్యమ విజయానికి హిందూ ముస్లిం ఐక్యత ప్రాముఖ్యతను గుర్తింపజేశాడు' అన్నారు రావి నారాయణరెడ్డి.

చారిత్రకంగా, మానవతాపరంగా 'మృత్యుంజయులు' నవలా వస్తువు ఎంతో విలువైంది. ఆ వస్తువు వివరంగా అర్థమయ్యేలాగే ఈ నవలా కథనం సాగింది.

అక్కడి దేశముఖ్ అధికారం చెలాయించే ప్రతినిధి అప్పన్న. అతను ఊరివాళ్ళ మధ్య నానాగోల చేస్తుంటాడు. నాట్లూ, కోతలు జరిగే రోజుల్లో అప్పన్న చేసే హడావిడి ఆ ఊరివాళ్ళకి అలవాటే. ఆ ఊళ్లో ఎవరికీ సొంత భూమి లేదు.

రైతులంతా తాతల, తండ్రుల తరాల నుంచీ కూడా అడవులు కొట్టి, బీళ్ళు దున్ని బాగుచేసు కున్న భూమి. అది తలా నాలుగెకరాలు సాగు చేసుకుంటున్నారు. కానీ కాగితాల్లో మాత్రం అ దంతా దేశముఖ్‌గారి పేర వుంది. ఆయనకి ఇంకా చాలా భూమి వుంది. అదంతా ఆయనకి ఎలా వచ్చిందనేది ఎవరికీ తెలియని బ్రహ్మర హస్యం. ఆ ఊరే కాదు, ఆ చుట్టుపక్కల గ్రామా ల్లోని భూమి కూడా దేశముఖ్‌గారిదే. ఆ పొలా లన్నీ ఊరివాళ్ళే వెళ్ళి దున్నాలి. ఇంటికో రెండు బళ్ళు అయినా పెంటమన్ను తోలాలి. దేశముఖ్ గారి పని తర్వాతే ఎవ్వరికేనా సొంత పని. ఆ రోజు అప్పన్న తన జోరు రాములమ్మ మీద చూపిస్తున్నాడు. ఇంట్లోకి జొరపడి, కూరలు తరు గుతున్న రాములమ్మని జబ్బ పట్టుకు వీధిలోకి లాక్కొచ్చాడు. కాదనే ధైర్యం కానీ, ఎదిరించే శక్తి కానీ ఎవరికీ లేదు.

అంతలోనే రాములమ్మ.. 'అప్పన్నా! కాస్త ఆలోచించు! నీవూ పిల్లలు గలవాడివే! రెండు రోజులైంది నారు పీకి చేలో వేసి. అది కాస్తా నాశ నమై పోతుంది. మొన్నా, నిన్నా మీ పనిలోనే వున్నామా! ఈ ఒక్కరోజూ వదిలేస్తే నీ పుణ్యం వూరికేపోదు. ఆ ఉన్న నారు కాస్తా వూడ్చేసి మిగ తాది మీ పనులైనాకే చూసు కుంటాం'అని ఎంతగానో బతి మాలింది.



అప్పన్న వినలేదు. రాముల మ్మనే కాదు.. మిగిలిన ఇళ్ళల్లోంచి కూడా ఆడ వాళ్ళని గొడ్లని తోలుకొచ్చినట్టు తీసుకొచ్చాడు. ఈ ఊళ్ళోనే కాదు. ఆ ప్రాంతమంతా అంతే! అధికారపు తొత్తులు ఏం చెప్తే అదే జరగాలి.

రాములమ్మ నారు మీది కాపీనంతో అప్పన్న చెప్పినట్టు చెయ్యలేదు. చెప్పిన మాట వినలేదని రెచ్చిపోయిన అప్పన్న, రాములమ్మ దొరకలేదని, ఆమె కూతురు రాజాలుని పొలం పనికి రమ్మ న్నాడు. ఆ సమయంలో రాజాలు రజస్వల అయి మూల కూచునుంది. తన పరిస్థితి చెప్పి, తనని అంటుకోవద్దని ఎంతగానో బతిమాలింది. అప్పన్న చెయ్యి పట్టుకుంటే, విధి లేక ఆ చేతిని కరిచింది. దాంతో అప్పన్న మృగంలా తయార య్యాడు. కొట్టుకుంటూ రాజాలుని లాక్కెళ్ళి, రౌడీ లకి అప్పజెప్పాడు. ఆ ఇద్దరు రౌడీలు రాజాలుని నానా హింసాపెట్టి, ఆ పసిదాని బతుకు పాడు చేశారు.

'ఏమయ్యో రెడ్డీ! నీ కూతురు కరిచింది. ఇవిగో పళ్ళు కూడా దిగబడ్డాయి. మనిషి కరిస్తే ఎంత ప్రమాదమో తెలుసుగా! ఇప్పుడు దీన్ని బాగు చేయించుకోటానికి పది రూపాయలవు తాయి కట్టు..' అని అప్పన్న నానా గొడవా చేసి, డబ్బు లేదన్నారని ఇంట్లోని ఇత్తడి కడవ పట్టుకు పోయాడు.

రాజాలు అన్న నర్సిరెడ్డిని మాత్రం ఆ గొడవ వదలలేదు. చెల్లెలు పరిస్థితికి ఆవేశపడి అప్పన్న వాళ్లన్న సత్రం మీదకి వెళ్ళాడు. అక్కడ జరిగిన గొడవతో భయపడి ఎవరికీ చెప్పకుండా హైదరా బాదు పారిపోయాడు. నర్సిరెడ్డి చిన్నతనం నుం చీ ఎన్నో దారుణాలు చూశాడు. ఎన్నెన్నో కష్టాలు పడ్డాడు. హైదరాబాదులో కూడా అతని బతుకు అంత సాఫీగా సాగ లేదు.

పల్లెలు వదిలి నగరం చేరిన చాలామంది పరిస్థితి అంతే! సరైన పనుండదు. చేతిలో డబ్బులేక పస్తులు. పల కరించి ఆదుకునేవారు అరుదు. ఏదో చిన్నాచితక పని దొరికినా కష్టానికి తగిన కూలి దొరకదు. అయినా వదలని ఆశ. ఏదో సాధించాలన్న తాపత్రయం. ఏదోరకంగా డబ్బు పోగేసి, పల్లెలోని తమవారి కష్టాలు గట్టెక్కించాలని తపన. నగరంలో నర్సిరెడ్డి పరిస్థితీ అదే. రెండు నెలలు గడిచేటప్పటికి నర్సిరెడ్డికి చాలా నిజాలు తెలిశాయి. నగరంలో బతకటం, డబ్బు కూడబె ట్టడం అంత తేలిక కాదన్న గ్రహింపు కలిగింది.

నర్సిరెడ్డి అనుభవాల క్రోడీకరణగా బొల్లి ముంత శివరామకృష్ణ నగరం, పల్లెల స్వరూప స్వభావాల గురించి అద్భుతంగా ఇలా రాశారు. 'పొరుగూరు వెళ్ళేటప్పుడు కొత్తబట్టలు వేసుకునే చుట్టంలాగ, చొక్కా చిరుగులు కనపడకుండా, ఉత్తరీయం కప్పుకునే భారతదేశపు రైతుబిడ్డ లాగా, అంతులేని దరిద్రాన్ని మరుగుపరిచే ఈ పట్టణాల డాంబిక వ్యవస్థ అతనికి వెగటు పుట్టిం చింది' అని గొప్ప విశ్లేషణ ఇచ్చారు.

రాజ్యంలో లక్షల ఎకరాల బంజరుంది. గోదా

# మార్క్సిస్టు గాంధీ బొల్లిముంత



అభ్యుదయ రచయిత, సినీరచయిత, విప్లవ కారుడు, మార్క్సిస్టు గాంధీగా పేరుగాంచిన బొల్లిముంత శివరామకృష్ణ గుంటూరు జిల్లా చదలవాడలో 1920 నవంబరు ఏడో తేదీన జన్మించారు. త్రిపురనేని గోపీచంద్ ప్రభావంతో శివరామకృష్ణ కూడా కథారచనకు శ్రీకారం చుట్టారు. మద్రాసు నుంచి వెలువడే 'చిత్రాంగి' పత్రికలో తొలికథ 'ఏటొడ్డు' 1936లో ప్రచురిత మైంది. అప్పటికి బొల్లిముంతకు పదహారేళ్లు.

ఉపాధ్యాయ వృత్తిని వదిలిపెట్టి శివరామ కృష్ణ 1945లో వ్యవసాయకార్మిక సంఘంలో చేరి చల్లపల్లి రాజాకి వ్యతిరేకంగా సాగిన భూపోరాటంలో పాల్గొన్నారు. పద్యనాటికలు, రేడియో నాటికలు రాశారు. నాటకాల్లో హార్మో నియం వాయించేవారు. స్త్రీ పాత్రలు ధరించే వారు. సినీరచయితలు ఆత్రేయ, ఆరుద్రలతో కలిసి పనిచేశారు. బొల్లిముంత దాదాపు ఏభై సినిమాలకు సంభాషణలు రాశారు. వీటిలో మనుషులు మారాలి, ప్రజా నాయకుడు, శారద, కళ్యాణమంటపం, కాలం మారింది, తిరపతమ్మ కథ వంటి ప్రధాన చిత్రాలు ఉన్నాయి. వాగ్దానం సినిమాకు స్క్రీన్‌ప్లే రాశారు. విశాలాంధ్ర ప్రారంభించిన 'ప్రతిభ' వార పత్రికకు, 'ప్రజా పక్షం' అనే మాస పత్రికకు సంపాదకులుగా పనిచేశారు.

తెలంగాణ పోరాటం గురించి తెలుసుకున్న శివరామకృష్ణ ఇరవై మూడేళ్ల వయసులో 'మృత్యుంజయులు' నవల రాశారు.

'అంతరాత్మ అంత్యక్రియలు' తోపాటు మరికొన్ని కథా సంపుటాలు వెలువరించారు. 1955 మధ్యంతర ఎన్నికల సందర్భంగా శివరామకృష్ణ మీద రెండు పర్యాయాలు హత్యాయత్నం జరిగింది. అరసం కార్యకర్తగా పనిచేశారు. శివరామకృష్ణ 2005 జూన్ ఏడో తేదీన మరణించారు.

వరి, కృష్ణ నదుల్లో నీరుంది. ఆనకట్టలు కట్టి నీరు రైతుకు అందేలా చేసి, భూమి ఇచ్చి దున్నుకోమంటే కరువే లేదు. అలా కృషి చేసేదెవరు.

నగరంలో నర్సిరెడ్డి కట్టెలు కొట్టాడు. కూలిపనులు చేశాడు. రిక్షా లాగాడు. ఆరోగ్యం చెడి రక్తం కక్కుకునే స్థితికి వచ్చాడు. అలాకాదని ఫ్యాక్టరీ కార్మికుడయ్యాడు. అక్కడా దోపిడియే. సమ్మెలు, గొడవలు. చివరికి అన్నిరకాలుగా విసిగిపోయి.. తన పల్లెకి, తనవారి దగ్గరికి తిరిగి వెళ్ళిపోవాలనుకున్నాడు. అదే సమయంలో సమ్మె జరుగుతున్న ఫ్యాక్టరీ దగ్గర పోలీసులకి, కార్మికులకి పెద్దగొడవ జరిగింది. కాలుపుల్లో నర్సిరెడ్డిని అంతకాలం ఎంతగానో ఆదరించిన తాత చనిపోయాడు. ఆ భీభత్సం చూడలేక నర్సిరెడ్డి పల్లెకి పారిపోయాడు.

పల్లెలో పరిస్థితి మరింత ఘోరంగా వుంది. సంఘం కార్యకలాపాలతో ప్రజలు ప్రభుత్వానికి ఎదురు తిరిగారు. దేశముఖ్‌లు, పోలీసులు, నైజాం అధికారులు ఒకవేపు.. ప్రజల ఆవేశం మరోవైపు. అక్కసు పట్టలేని అధికారం పరమ కిరాతకం అరబ్ గూండాల్ని పిలుచుకొచ్చింది. వాళ్ళు పల్లెనంతా ధ్వసం చేశారు. పిల్లలనీ చూడలేదు.. ముసలి వాళ్ళనీ కనికరించలేదు. అందర్నీ తమ కత్తులకి బలిచేశారు. ఆడవాళ్ళని చెరిచి, హింసించి చంపారు.

నర్సిరెడ్డి తండ్రి మల్లారెడ్డిని అంతకుముందే దేశముఖ్ మనుషులు చంపేశారు. నర్సిరెడ్డి కొడుకు పసివాణ్ణి గూండాలు చంపేశారు. నర్సిరెడ్డి తమ్ముడు ఎల్లారెడ్డి నిర్బంధంలో వున్నాడు. ఊళ్ళోకి వస్తుండగానే నర్సిరెడ్డికి తుపాకీ గుండు తగిలింది. అప్పటికే రాజాలు చచ్చిపోయింది. తల్లి రాములమ్మ దగ్గరికి తీసుకొచ్చి నర్సిరెడ్డిని పడుకోబెట్టారు. ఆ ముసలి గుండె ఈ విధ్వంసాన్ని తట్టుకోలేకపోయింది. ఆమె చేతుల్లోనే నర్సిరెడ్డి ప్రాణాలు విడిచాడు.

అంతటి దుఃఖాన్ని ఎదుర్కొన్న రాములమ్మ విప్లవ ఉద్యమంలో చేరింది. కొడుకు ఎల్లారెడ్డితో కలిసి అభ్యుదయ పథంలో సాగటం 'మృత్యుంజయులు' నవల ముగింపు.

ఒక కుటుంబపరంగా కథ సాగినా, నవలలోని రకరకాల సంఘటనల, వివరాల ద్వారా మొత్తం ఆనాటి తెలంగాణా జీవితాన్నంతా కళ్ళకు కట్టించారు బొల్లిముంత శివరామకృష్ణ.

గత చరిత్రకు ప్రతిబింబం ఈ నవల. సాంఘిక రూపానికి ప్రతీక 'మృత్యుంజయులు'. ఈ నవల ఎప్పటికీ చిరంజీవే. ©

ఫలము తీవ్రత తగ్గుతుంది. హెల్మెట్, లైఫ్ జాకెట్, పారాచూట్' లాంటివి గ్రహశాంతులు. కాలు విరగవలసింది, చిటికెనవేలి దెబ్బతోనో బెణుకుతోనో- ఆగుతుంది! గత జన్మపాపాలు తప్పకుండా పరిగణనలోకి వస్తాయి. కొన్ని అను భవించి తీరవలసిందే! తల నొప్పి, కడుపు నొప్పికి మాత్ర వేసుకోగానే నొప్పి తగ్గదు. తగ్గినట్ల నిపించినా, నొప్పి సంబంధించి శరీరంలో, వ్యవస్థలో తేడా రాక తప్పదు. అయితే ఒకమాట! కుటుంబంలోని రకరకాల వ్యక్తులు, ఆయా సందర్భాలలో తృప్తికో, అసంతృప్తికో గురికావడం చూస్తాము. మన శరీరమూ అలాంటిదే. శరీరంలో దేవతలు, గ్రహాధిదేవతలు మానవుల వలె తలతిక్కగా ప్రవర్తించరు. మనం చేస్తున్న పాప పుణ్యాలను అనుసరించి వారు వారు ఆయా భాగాలని ప్రభావితం చేస్తారు. గ్రహశాంతులు, దైవారాధనలు వాటికి సంబంధించినవే! అయితే రెండు మూడు దశాబ్దాలుగా వ్యాపారధోరణి పెరిగి, బలహీనతలని అవకాశంగా తీసుకొనే వారు పెరిగిపోయారు.

*ప్ర. ఇంద్రుడనేది ఒక పదవని, ఇంద్రులు మారుతూ ఉంటారని పురాణాలలో చెబుతారు. మరి వృత్రాసురుని సంహరించింది, అహల్యను మోసం చేసింది, హిరణ్యకశిపుని భార్య లీలావతి గర్భంలో శిశువును చంపబూనింది, అర్జునుని మేలు కోరి కర్ణుని కవచకుండలాలు యాచించింది, నారదునికి పారిజాత పుష్పం బహూకరించింది ఒక ఇంద్రుడేనా? ఇంద్రుడు మారినప్పుడల్లా శచీదేవి కూడా మారుతుందా?*

**– ఎస్. ప్రసాద్,** టి.నగర్, చెన్నై

**జ.** రుగ్వేదంలో ఇంద్రునికి సంబంధించిన యంత్రాలలో సుమారు వెయ్యి నామములు క్రోడీకరించారు కావ్యకంఠ గణపతిమునిగారు. కల్ప భేదము అనుసరించి ఇంద్రులు మారుతారన్నది నిజమే! మనకి అర్థంకావడానికి ఇంద్ర, రుద్ర, విష్ణు, వ్యాస అంటూ వీరిని పదవులు అధిష్ఠించినవారుగా చెప్పడం జరిగింది. మీరు ఉటంకించిన ఘట్టాలలో ఇంద్రుడు ఒక్కరే! అతని పనులు పుణ్యమా? పాపమా? అంటూ చర్చించడానికి మనకి అధికారం చాలదు. వార్తాపత్రికలలో, దృశ్య మాధ్యమాలలో చూస్తున్నాం.. అధికారంలో ఉన్న వ్యక్తులు ఏవే పనులు చేసినా జరగవలసినంతకాలం వారి అధికారం కొనసాగుతోందా? లేదా? ఎవరు ఎంతగోల చేసినా ఫలితం ఉంటోందా? 'ఇంద్ర'తత్త్వమూ కల్పము ముగిసే వరకూ అంతే! మన శరీరములో మనసు ఇంద్రుడు, బుద్ధి శచీదేవి. అధికారి ఇంద్రుడే అయినా నడిపించేది శచీదేవి - 'ఇంద్రాణీవై సేనాయాం దేవతా' అని వేదవాక్యం

*ప్ర. దానధర్మాల వల్ల లభించే పుణ్యఫలం జన్మపరంపరకు కారణమైన కర్మను ప్రభావితం చేస్తుందా? జన్మరాహిత్యానికి మార్గం ఏమిటి?*

**– యస్.వి.వి.యస్. పద్మావతి,**

కాకినాడ

**జ.** 'దానము' మనిషిలో అహంకారమును (నేను అన్న భావనను) మమకారమును (నాది అన్న భావనను) తొలగించే సాధనము. అందుకే దానము యిచ్చి, దానము తీసుకొన్న వ్యక్తికి నమస్కరిస్తాము. అర్థం అదే! ధర్మము మనిషిని మనిషిగా రూపించే లక్షణము. మరొక విశేషం. అడగకుండానే ఎదుటి మనిషికి ఇవ్వడం దానము. అడిగిన తరువాత వారికి ఇవ్వడము ధర్మము. ఈ రెండూ మనిషిని పవిత్రము చేస్తాయి. ఫలితము (కీర్తి, ప్రతిష్ఠ, పేరు, గౌరవము, తిరిగి వారి సహాయము) ఆశించి చేస్తే అవి బంధనహేతువు అవుతాయి అని ఉపనిషత్తు. నిండు మనసుతో, భగవంతుని ఆజ్ఞగా చేయగలిగితే, ముందు చెప్పిన ఫలితములు లభించినా, అవి నిన్ను బంధించవు. వీటివలన పాపములు శమిస్తాయి. నశించవు. జన్మరాహిత్యానికి ఇవి సోపానాలు కావు. కానే కావు. పుణ్యము, పాపమూ రెండూ తొలగిపోతేనే మోక్షము. 'పుణ్యపాపే వుభే విద్వాన్ విధూయ పరమం సామ్యముపైతి' అనే మాట ఉపనిషత్తు లోది. తల్లి బిడ్డకి చనుబాలు ఇస్తుంది. ఫలితం ఆశించి, ప్రతిఫలం ఆశించి కాదు. అది బంధన హేతువు కాదు. రేపొద్దున దండిగా కట్నం వస్తుందని పిల్లవాడి మీద పెట్టుబడి పెట్టి చదివిస్తే అది బంధన (బాధా) హేతువు.

*ప్ర. స్వర్గం, నరకం ఉన్నాయా? పాపకృత్యాలు నివారించడానికే పెద్దలు అలా చెబుతారా? మృత్యువు ఎవరి చేతిలోనూ లేనప్పుడు ఉత్తరాయణ, దక్షిణాయన మరణాల్లో తేడాలెందుకు? దుర్మార్గుడు ఉత్తరాయణంలో మరణిస్తే స్వర్గద్వారాలు తెరుస్తారా?*

**– తటవర్తి రామకృష్ణ,**

తాళ్లగడ్డ, హైదరాబాద్

**జ.** అసలు పాపకృత్యం అంటే ఏమిటి? నీవు నీ కోసం చేసినా, ఎదుటి వారి కోసం చేసినా, మరొకరికి కష్టం కలిగితే, కలిగిస్తే అది పాపం!

ఫలము తీవ్రత తగ్గుతుంది. హెల్మెట్, లైఫ్ జాకెట్, పారాచూట్' లాంటివి గ్రహశాంతులు. కాలు విరగవలసింది, చిటికెనవేలి దెబ్బతోనో బెణుకుతోనో- ఆగుతుంది! గత జన్మపాపాలు తప్పకుండా పరిగణనలోకి వస్తాయి. కొన్ని అనుభవించి తీరవలసిందే! తల నొప్పి, కడుపు నొప్పికి మాత్ర వేసుకోగానే నొప్పి తగ్గదు. తగ్గినట్లనిపించినా, నొప్పి సంబంధించి శరీరంలో, వ్యవస్థలో తేడా రాక తప్పదు. అయితే ఒకమాట! కుటుంబంలోని రకరకాల వ్యక్తులు, ఆయా సందర్భాలలో తృప్తికో, అసంతృప్తికో గురికావడం చూస్తాము. మన శరీరమూ అలాంటిదే. శరీరంలో దేవతలు, గ్రహాధిదేవతలు మానవుల వలె తలతిక్కగా ప్రవర్తించరు. మనం చేస్తున్న పాప పుణ్యాలను అనుసరించి వారు వారు ఆయా భాగాలని ప్రభావితం చేస్తారు. గ్రహశాంతులు, దైవారాధనలు వాటికి సంబంధించినవే! అయితే రెండు మూడు దశాబ్దాలుగా వ్యాపారధోరణి పెరిగి, బలహీనతలని అవకాశంగా తీసుకొనే వారు పెరిగిపోయారు.

*ప్ర. ఇంద్రుడనేది ఒక పదవని, ఇంద్రులు మారుతూ ఉంటారని పురాణాలలో చెబుతారు. మరి వృత్రాసురుని సంహరించింది, అహల్యను మోసం చేసింది, హిరణ్యకశిపుని భార్య లీలావతి గర్భంలో శిశువును చంపబూనింది, అర్జునుని మేలు కోరి కర్ణుని కవచకుండలాలు యాచించింది, నారదునికి పారిజాత పుష్పం బహూకరించింది ఒక ఇంద్రుడేనా? ఇంద్రుడు మారినప్పుడల్లా శచీదేవి కూడా మారుతుందా?*

**– ఎస్. ప్రసాద్,** *టి.నగర్, చెన్నై*

**జ.** ఋగ్వేదంలో ఇంద్రునికి సంబంధించిన యంత్రాలలో సుమారు వెయ్యి నామములు క్రోడీకరించారు కావ్యకంఠ గణపతిమునిగారు. కల్పభేదము అనుసరించి ఇంద్రులు మారుతారన్నది నిజమే! మనకి అర్థంకావడానికి ఇంద్ర, రుద్ర, విష్ణు, వ్యాస అంటూ వీరిని పదవులు అధిష్ఠించినవారుగా చెప్పడం జరిగింది. మీరు ఉటంకించిన ఘట్టాలలో ఇంద్రుడు ఒక్కరే! అతని పనులు పుణ్యమా? పాపమా? అంటూ చర్చించడానికి మనకి అధికారం చాలదు. వార్తాపత్రికలలో, దృశ్య మాధ్యమాలలో చూస్తున్నాం.. అధికారంలో ఉన్న వ్యక్తులు ఏవ పనులు చేసినా జరగవలసినంతకాలం వారి అధికారం కొనసాగుతోందా? లేదా? ఎవరు ఎంతగోల చేసినా ఫలితం ఉంటోందా? 'ఇంద్ర'తత్త్వమూ కల్పము ముగిసే వరకూ అంతే! మన శరీరములో మనసు ఇంద్రుడు, బుద్ధి శచీదేవి. అధికారి ఇంద్రుడే అయినా నడిపించేది శచీదేవి - 'ఇంద్రాణీపై సేనాయాం దేవతా' అని వేదవాక్యం

*ప్ర. దానధర్మాల వల్ల లభించే పుణ్యఫలం జన్మపరంపరకు కారణమైన కర్మను ప్రభావితం చేస్తుందా? జన్మరాహిత్యానికి మార్గం ఏమిటి?*

**– యస్.వి.వి.యస్. పద్మావతి,** *కాకినాడ*

**జ.** 'దానము' మనిషిలో అహంకారమును (నేను అన్న భావనను) మమకారమును (నాది అన్న భావనను) తొలగించే సాధనము. అందుకే దానము యిచ్చి, దానము తీసుకొన్న వ్యక్తికి నమస్కరిస్తాము. అర్థం అదే! ధర్మము మనిషిని మనిషిగా రూపించే లక్షణము. మరొక విశేషం. అడగకుండానే ఎదుటి మనిషికి ఇవ్వడం దానము. అడిగిన తరువాత వారికి ఇవ్వడము ధర్మము. ఈ రెండూ మనిషిని పవిత్రము చేస్తాయి. ఫలితము (కీర్తి, ప్రతిష్ఠ, పేరు, గౌరవము, తిరిగి వారి సహాయము) ఆశించి చేస్తే అవి బంధనహేతువు అవుతాయి అని ఉపనిషత్తు. నిండు మనసుతో, భగవంతుని ఆజ్ఞగా చేయగలిగితే, ముందు చెప్పిన ఫలితములు లభించినా, అవి నిన్ను బంధించవు. వీటివలన పాపములు శమిస్తాయి. నశించవు. జన్మరాహిత్యానికి ఇవి సోపానాలు కావు. కానే కావు. పుణ్యము, పాపమూ రెండూ తొలగిపోతేనే మోక్షము. 'పుణ్యపాపే వుభే విద్వాన్ విధూయ పరమం సామ్యముపైతి' అనే మాట ఉపనిషత్తులోది. తల్లి బిడ్డకి చనుబాలు ఇస్తుంది. ఫలితం ఆశించి, ప్రతిఫలం ఆశించి కాదు. అది బంధన హేతువు కాదు. రేపొద్దున దండిగా కట్నం వస్తుందని పిల్లవాడి మీద పెట్టుబడి పెట్టి చదివిస్తే అది బంధన (బాధా) హేతువు.

*ప్ర. స్వర్గం, నరకం ఉన్నాయా? పాపకృత్యాలు నివారించడానికే పెద్దలు అలా చెబుతారా? మృత్యువు ఎవరి చేతిలోనూ లేనప్పుడు ఉత్తరాయణ, దక్షిణాయన మరణాల్లో తేడాలెందుకు? దుర్మార్గుడు ఉత్తరాయణంలో మరణిస్తే స్వర్గద్వారాలు తెరుస్తారా?*

**– తటవర్తి రామకృష్ణ,** *తాళ్లగడ్డ, హైదరాబాద్*

**జ.** అసలు పాపకృత్యం అంటే ఏమిటి? నీవు నీ కోసం చేసినా, ఎదుటి వారి కోసం చేసినా, మరొకరికి కష్టం కలిగితే, కలిగిస్తే అది పాపం!

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. నేటితరం ఆడపిల్లలు కొందరు బొట్టు పెట్టుకోవడం అనాగరికంగా భావిస్తుంటే, మరి కొందరు కనుబొమల మధ్య కనిపించీ కనిపించకుండా పెట్టుకుంటున్నారు. భారతీయ సంప్రదాయంలో తిలకం వైశిష్ట్యాన్ని వివరించ గోరుతున్నాను!

– పక్కి సుందరీ కృష్ణ, విజయనగరం

జ. వినడానికి, తెలుసుకొనడానికి వింతగా, తమాషాగా అనిపించినా, కొన్ని దేశాలలోని వారు తిలకం ధరించకపోవడానికి ప్రత్యేక కారణాలున్నాయి. ఆయా దేశాలవారు భారతీయులను వందల సంవత్సరాలు పాలించిన కారణం వలన, పాలనా దండ ప్రభావం వలన అలవాట్లు మారాయి.. మార్చుకున్నారు. అది ఒక తరము దాటేసరికి ఫాషన్ అయింది.

నిరంతరం వర్షాలు, మంచు కురిసే ప్రాంతాల వారు, అడవులలో విస్తారంగా తిరిగేవారు - నుదుట కుంకుమ లేదా అటువంటి గుర్తులు ధరించకపోవడం ఆత్మరక్షణలో ఒక భాగం. మిలటరీ ప్రత్యేకించి పదాతిదళంవారు తిలకధారణ చేయరు. ఇదే కారణం.

జోరాష్ట్రియన్ సంప్రదాయంలో పెండ్లికాని ఆడపిల్లలు తిలకం ధరించరు. నుదుట తిలకము ఎందుకు ధరించాలి? అన్నది అధర్వణ వేదం వివరించింది. తిలకాలలో రకాలు కూడా చెప్పింది. పసుపు, చందనము, పూల పొడి ఇలా రకరకాల మంగళద్రవ్యాలు, ఆఖరికి గోమయము, తులసికోటలోని మట్టి - ధనం ఉన్నవారు కస్తూరి వంటి ఖరీదైనవి వాడవచ్చు. సూర్యకిరణాలలోని దాహకశక్తి, ఔషధీశక్తికి 'ఆది' అని పేరు. దానిని నాడీ మండల కేంద్రమైన భ్రుకుటి (కనుబొమ్మల మధ్యస్థానము) ద్వారా ఇతర నాడులకి అందించడానికి, ఉత్ప్రేరకముగా పనిచేస్తుంది తిలకము. దుష్టప్రేరణలు, భావనలు నివారించడానికి ఉపయోగపడుతుంది.

టీవీల్లో ఆడవిలన్లకి, పౌరాణిక విలన్లకోసం కొత్తకొత్త డిజైన్లలో బొట్టు తయారుచేస్తుంటారు. అది అశాస్త్రీయం! శాస్త్రీయమైన 'తిలకధారణ' ఎంత గొప్పదో తెలియచేయడానికి పురాణాలలో ఎన్నెన్నోగాథలున్నాయి. చివరికి 'పుణ్యస్త్రీ' ముత్తైదువ అనేటందుకు గుర్తులలో కుంకుమ తిలకం ప్రధానం! గమనించండి.

ఆ పాపానుభవమే నరకం! ఆకలి అయితే తినడం తప్పు అని ఎవరూ అనరు. తిన్నందువలన, అజీర్తి, కడుపునొప్పి వగైరా వస్తే ఆ అనుభవమే నరకము. ఉత్సాహము, బలము, ఆనందము కలిగితే అదే స్వర్గము. 'భగవాన్ నా పని వలన నీ సృష్టిలోని ఏ జీవికి మంచి జరిగినా అది పుణ్యమే! అలా కానిది పాపం' అన్నాడు ఒక భక్తుడు. ఇంక ఉత్తర దక్షిణ అయనాలు- ఆ కాలాల్లో మృత్యువు సంగతి. కాలము భగవంతుని స్వరూపమే! అందులో మంచి, చెడు అని ఉండదు. మనం గమనించే విధానంలో తేడా అది. కాల విభాగము ప్రకారము ఉత్తరాయణము పగటిభాగం లాంటిది అయితే దక్షిణాయనం రెండవ భాగం లాంటిది. ప్రయాణం చేసేవారు చీకటి పడగానే ఒకచోట ఆగి వెలుతురులో మరల ప్రయాణం సాగిస్తారు. మూర్ఖుడు చీకటిలోనే ప్రయాణం చేస్తా అని బయలుదేరి ఇరుకున పడతాడు. ఇద్దరికీ చివరికి వెలుతురులో ప్రయాణం క్షేమం. ఉత్తరాయణంలో మరణించిన దుర్మార్గుడికి స్వర్గద్వారం తెరిచేస్తారా? అన్నారు మీరు. మరణించిన వ్యక్తుల పుణ్యాపాపాల అనుభవం పూర్తి అయిన తరువాతే స్వర్గానుభవము అని పురాణాలు చెప్పాయి. అది పరిగణించడం మర్చిపోతున్నాము.

ప్ర. శ్రీకృష్ణుడు మధురానగరాన్ని కాదని సముద్రం మధ్యలోనున్న ద్వీపంలో నివాసమేర్పరచుకొని పాలించడానికి కారణమేమిటి?

– యు. విజయశేఖర రెడ్డి,
కూకట్‌పల్లి, హైదరాబాద్

జ. కంసవధానంతర గాథలో ఈ ప్రశ్నకి సమాధానం ఉంది. 'మధురానగరము' శ్రీరామునికి పూర్వం నుంచి అందరిచేత గౌరవించబడిన నగరము. శ్రీకృష్ణునికి అత్యంత ప్రియమైనదని విష్ణుపురాణ వాక్యము. మరి ద్వారక ఎందుకు నిర్మించవలసి వచ్చిందీ గమనించండి! కంసుని మామగారు జరాసంధుడు. తన అల్లుడిని వధించిన కృష్ణుడి మీద కోపంతో మధుర మీదకి ప్రతి




# చతుర ప్ర.జ.1



జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను ఇకపై నిర్వహించటానికి ఉపన్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి. ఇప్పటివరకు ఈ శీర్షిక నిర్వహించిన **టి.కె.వి.రాఘవన్** గారికి కృతజ్ఞతలు.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

సారి 18 అక్షౌహిణులతో 18 సార్లకుపైన దండయాత్ర చేశాడు. కృష్ణబలరాములు సైన్యాన్ని చంపి, జరాసంధుడిని వదిలిపెట్టేవారు. ప్రజలకి సంబంధించిన భద్రత గురించి, ఆరోగ్యం గురించి, క్షేమము గురించి - జరాసంధుడి దండయాత్రకి అనుకూలంగా మధుర ఉన్న కారణాన, మధురా నగరాన్ని శ్రీకృష్ణుడు వదిలిపెట్టేశాడు.

తరువాత సముద్రుడిని ప్రార్థించి, నగరానికి సరిపడ స్థలం తీసుకొని (మన భాషలో 'లీజు'కి తీసుకొని) విశ్వకర్మ ద్వారా అన్ని వసతులతో, స్వయం సమృద్ధముగా, సర్వతో భద్రముగా ద్వారక నిర్మింపచేశాడు. ఆఖరికి తన చిన్ననాటి రోజులు నిరంతరం గుర్తుండేలా మైదానాలు, పశుశాలలు, రథశాలలు - అన్నీ కట్టించారు. ఉప్పునీటి సముద్రంలో మంచినీటి వసతి దగ్గర్నించి ఏర్పాటు చేశారు. ప్రజాక్షేమం కోరే వ్యక్తి ఎలా ప్రవర్తించాలో చూపిన ఘనత కృష్ణునిది! అలాంటివారు ప్రజాప్రతినిధులు అయితే ఎంత అదృష్టం!

*ప్ర. మనుషులు చనిపోయినపుడు తీసుకెళ్తూ భగవద్గీతను వినిపిస్తారెందుకు?*

**- మొహమ్మద్ అఫ్సరా వలీషా,**
*ద్వారపూడి, తూ.గో. జిల్లా*

**జ.** ఒకప్పుడు రేడియోలో షెహనాయి - ఇతర వాద్యాలు గంటల తరబడి వినిపించినా, ప్రకటనలు లేకుండా భక్తిగీతాలు పరంపరగా ప్రసారం అయినా- ఎవరో ప్రముఖుడో దేశనాయకుడో మరణించాడు.. అనే భావనకి తీసుకొచ్చారు మహానుభావులు. భగవద్గీతని కూడా ఆ స్థితికి తెచ్చారు తెలుగువారు. పాపం ఘంటసాల మాస్టారు కమనీయమైన కంఠంతో వేలాది భక్తి గీతాలు పాడి, భగవద్గీతనీ సామాన్యులకి అందించాలని చేసిన ప్రయత్నం ఇలా పరిణమించింది. 'చావు' అనగానే కర్మ, 'జాతస్య ధ్రువోమృత్యుః' ఇది తప్ప వేరే గుర్తురాదు. భగవద్గీతలో భక్తి, కర్మ, జ్ఞాన, వైరాగ్యానికి సంబంధించిన శ్లోకాలే కాదు.. వ్యక్తిత్వ వికాసము, కార్యనిర్వహణా దక్షతలాంటి వంద విషయాలున్నాయి. కస్తూరితో ఇల్లు అలుక్కుని, చందనపు చెక్కలతో మంటపెట్టి వంట వండుకునే దురదృష్టం మనది.

*ప్ర. దాదాపు దేవుళ్లందరూ ఎత్తయిన కొండల మీదనే వెలియడానికి కారణమేమిటి?*

**- నేమాన సుభాష్ చంద్రబోస్,**
*విశాఖపట్నం*

**జ.** నదీతీరాలు, అడవి ప్రాంతాలు, కొండలు- ఇవి భగవంతుని ఆలయాలు ఉండే చోటు. భగవంతుని శరీరంలో చర్మము మీది రోమములు అడవులు అని, నీరు భగవంతుని రక్తప్రసరణ మండలము అని, అస్థి, సంధులు పర్వతాలనీ వర్ణన. ఈ మూడింటిలో బలిష్ఠమైనవి అస్థులు.. కొండలు. మిగతా రెండు స్థలములు అక్కడికి చేరితేగానీ దర్శించలేనివి. దూరాన ఉన్న కొండ శిఖరము దర్శనం యిస్తుంది. అంతేకాక భగవత్ తత్త్వం 'నిహితం గుహాయాం' అని వేదము. కొండ గుహలలో రహస్యముగా ఉంటుంది. అని సామాన్యార్థము. వేదాంతదేశికులు అనే పెద్దలు ఈ తత్త్వాన్ని దయాశతకంలో 'రైతు తన పంట పొలం కాపలా కాచుకొనడానికి మంచె మీద ఉన్నట్లుగా, భగవంతుడు జీవులు అనే సస్యములని కాపాడుకోవడానికి ఏడుకొండలు అనే మంచె మీద నిలిచి ఉన్నారు' అని చమత్కరించారు. ఇది దేవాలయాలు అన్నింటికి వర్తిస్తుంది. ©

# భామనే.. సత్యభామనే..!

28

'పెద్దయ్యాక నా కూతురు మిస్ వరల్డ్ అవుతుంది' అన్న తండ్రి మాటను తన జీవిత లక్ష్యంగా ఎంచుకుందామె. అందుకనుగుణంగానే శ్రమించింది. అనేక అందాల పోటీల్లో పాల్గొంది. మిస్ ఇండియా కిరీటాన్ని గెలుచుకుని మిస్ వరల్డ్ పోటీల వరకూ వెళ్లింది. పాండ్స్ యాభయ్యో ఎడిషన్ ఆఫ్ ఫెమినా మిస్ వరల్డ్ ఇండియా 2013 విజేతగా నిలిచింది. పాండ్స్ ఫెమినా మిస్ గ్లోయింగ్ స్కిన్ కిరీటాన్ని సొంతం చేసుకుంది. ప్రస్తుతం బాలీవుడ్‌లోకి ఎంటరై రెండు సినిమాల్లో నటిస్తోన్న ఆ అందాల చిన్నది మరెవరో కాదు.. నవనీత్ కౌర్ ధిలాన్. ఆమె సౌందర్య రహస్యమేంటో ఆమె మాటల్లోనే తెలుసుకుందాం..

## సొగసు చూడతరమా...



ముఖ్యంగా రెండు విషయాలకు చాలా ప్రాధాన్యమిస్తాను.. ఒకటి ఆహారం, రెండు వ్యాయామం.

నిద్ర లేచిన అరగంటలోపు ఏదో ఒకటి తింటాను. ఎందుకంటే నిద్రపోయినపుడు ఎక్కువసేపు ఏమీ తినకపోవడం వల్ల రక్తంలో పంచదార స్థాయిలు చాలా తక్కువగా ఉంటాయి. కానీ జీర్ణక్రియలో ఇవి చాలా అవసరం. అందుకే లేవగానే పోషకవిలువలతో కూడిన ఆహారం తీసుకుంటాను. ప్రతి రెండు గంటలకో సారి.. అంటే కడుపు ఖాళీగా అనిపించినపుడల్లా తింటుంటాను. రాత్రి భోజనం చేసిన వెంటనే పడుకుంటే అరుగుదల తక్కువగా ఉంటుంది. అందుకే పడుకోవడానికి రెండు మూడు గంటల ముందే భోజనం ముగిస్తాను. కడుపు నిండింది అనిపించాక ఇక ఒక్క ముద్ద కూడా నోట్లో పెట్టుకోను. వీలై

నంత ఎక్కువగా నీరు తాగుతా. శరీరం తేలికపడి జీవక్రియ వేగంగా జరుగుతుంది. అంతేకాదు శరీరంలోని వ్యర్థాలు తేలికగా బయటికి వెళ్తాయి. చర్మం కాంతిమంతంగా ఉంటుంది.

స్కూల్లో చదివేపుడు గుర్రపు స్వారీ చేసేదాన్ని. వర్కవుట్స్ అన్నా, యోగా అన్నా చాలా విసుగు. అవి చేసేందుకు చాలా ప్రయత్నించాను, నా వల్ల కాలేదు. అందుకే వాటికి బదులు ఈత కొట్టడం, ధ్యానం చేయడం అలవర్చుకున్నాను. ఇవే నా ఫిట్‌నెస్‌కు ముఖ్యకారణం. ఈత కొట్టడం గుండెకు సంబంధించిన చక్కని వ్యాయామం. ఇది చక్కని శరీరాకృతినీ ఇస్తుంది.



నాకిష్టమైన ఆహారం ఎపుడంటే అపుడు తినేస్తా. కానీ ఫాస్ట్ ఫుడ్ జోలికి మాత్రం వెళ్లను. చర్మం, జుట్టు విషయంలో జాగ్రత్తగా ఉంటాను. తరచుగా స్పాకు వెళ్తుంటాను. గోర్లు శుభ్రంగా ఉంచుకుంటాను.

ఆరోగ్యమనేది శరీరానికి సంబంధించినది మాత్రమే కాదు, మనసుకు సంబంధించింది కూడా. ప్రతిరోజూ కనీసం అరగంట పాటు ధ్యానం చేస్తాను. అది మనసును ప్రశాంతంగా ఉంచడమే కాక జబ్బుల నుంచి దూరంగా ఉంచుతుంది. శరీరం ఆరోగ్యంగా ఉన్నపుడు ఆ ప్రభావం చర్మంపై కనిపిస్తుంది.

శరీరాకృతి కోసం పస్తులుండడం సరైన పద్ధతి కాదు. మనసును ప్రశాంతంగా ఉంచుకోవడమే ఫిట్‌నెస్ వైపు వేసే మొదటి అడుగు. ఫిట్‌గా ఉన్నపుడు అందంగా ఆలోచిస్తారు. అందంగా ఆలోచించినపుడే అందంగా కనిపిస్తారు.

సేకరణ : **సంధ్యారాణి**

## సంతోషానికి చిరునామా



★ సంతోషంగా ఉంచేందుకు సహజమైన ఉత్ప్రేరకం నవ్వు. ఒక్క చిరునవ్వుతో మెదడు నుండి సంతోషాన్ని కలిగించే హార్మోను సెరోటొనిన్ విడుదలవుతుంది. ఉదయాన్నే ఓ ఐదునిమిషాలు నవ్వితే ఇక రోజంతా సంతోషమే!

★ ప్రతిరోజూ ఇరవై నిమిషాల పాటు ధ్యానం చేయాలి. మనసును ప్రశాంతంగా ఉంచి రుణాత్మక ఆలోచనలను దరిచేరనీయదు. నూతన ఉత్సాహాన్నిస్తుంది. పనితీరునూ మెరుగుపరుస్తుంది.

★ క్షమించడానికి మనలో చాలామంది వెనకడుగేస్తాం. కోపం, పగ అనేక సమస్యలను తెచ్చిపెడతాయి. బంధుమిత్రులతో మంచి సంబంధాలకి అడ్డంకిగా మారతాయి. చిన్నచిన్న పొరపాట్లు జరగడం సహజం. వాటిని పట్టించుకోకుండా ఉంటే మనసు తేలికగా ఉండడమే కాకుండా బంధుమిత్రులతో మంచి సంబంధాలూ కొనసాగుతాయి.

## మహిళా శక్తి



**✸ ఎల్లపుడూ సంతోషంగా జీవించలేకపోవచ్చు, సమస్యలన్నిటినీ పరిష్కరించలేకపోవచ్చు.. కానీ నిన్ను నువ్వు ఎపుడూ తక్కువ అంచనా వేసుకోకు. ధైర్యం, నమ్మకం.. ఈ రెండూ జీవితాన్ని మంచి బాటలోకి తీసుకెళ్తాయని చరిత్ర చెబుతోంది.**

– మిచెల్లీ ఒబామా



**✸ వెళ్తున్న మార్గం నచ్చకపోతే మరో మార్గాన్ని నువ్వే కనిపెట్టు.**

– డోలీ పార్టన్

## సోయగం

వేసవి ఎండలకు కందిపోయిన చర్మం మునుపటి కాంతిని సంతరించుకోవాలంటే..

★ నిమ్మరసం, రోజ్‌వాటర్, దోసరసం సమ పాళ్లలో కలిపి చర్మానికి రాసుకుని పదినిమిషాల తర్వాత కడిగేసుకోవాలి. నిమ్మరసం టాన్‌ను తొల గిస్తే దోసరసం, రోజ్‌వాటర్ చర్మాన్ని చల్లబరుస్తాయి.



★ పచ్చిపాలు, పసుపు, నిమ్మరసం కలిపి ముద్దలా చేసి, చర్మానికి రాయాలి. ఎండిన తర్వాత చల్లని నీటితో కడగాలి.

★ కొద్దిగా శనగపిండి, నిమ్మరసం, పెరుగు కలిపిన మిశ్రమం టాన్ తొలగించడంలో బాగా ఉపకరిస్తుంది.

★ తాజా నిమ్మరసం మోచేతులు, మోకాళ్లు వంటి ప్రదేశాల్లో రాసి పదిహేను నిమిషాల పాటు ఆరాక కడిగేయాలి. తరచుగా ఇలా చేయడంవల్ల చర్మం మృదువుగా మారుతుంది.

★ ప్రతిరోజూ కాళ్లకు చేతులకు కొబ్బరినీళ్లు రాసుకుంటే టాన్ పోయి మృదువుగా ఉంటాయి.

★ పసుపులో నిమ్మరసం కలిపి ముద్దలా చేయాలి. దాన్ని చర్మానికి రాసుకుని ఎండిన తర్వాత కడిగేయాలి. వారానికి మూడుసార్లు చేస్తే చక్కని ఫలితం కనిపిస్తుంది.

★ పాలపొడి, నిమ్మరసం, తేనె, బాదం నూనె లను సమపాళ్లలో కలిపి చర్మానికి రాసుకోవాలి. ఇరవై నిమిషాల తర్వాత కడిగేయాలి. రోజుకు మూడుసార్లు ఇలా చేయడం వల్ల మంచి ఫలితముంటుంది. ఈ మిశ్రమం ఓ వారం పాటు నిల్వ ఉంటుంది కూడా!

★ బొప్పాయి గుజ్జుతో మసాజ్ చేయడం వల్ల ఎండకు నల్లబడిన చర్మం మృదువును సంతరించుకుంటుంది.

## టెక్ గురూ!

### 1500 + తెలుగు టిప్స్

అందం, ఆరోగ్యం, వంట.. ఇలా ప్రతి విషయంలో వచ్చే చిన్న చిన్న సందేహాలకు, సమస్యలకు చక్కని పరిష్కారం చూపుతుంది ఈ యాప్.. అది కూడా తెలుగులోనే! పదిహేనొందలకు పైగా ఉండే ఈ చిట్కాలను వాట్సప్, ఫేస్‌బుక్‌లో మిత్రులతో షేర్ చేసుకునే వెసులుబాటు కూడా ఉంది.

### భగవద్గీత తెలుగు

భగవద్గీతను పూర్తిగా తెలుగులో అందిస్తోన్న యాప్ ఇది. మొత్తం పద్దెనిమిది అధ్యాయాలను చదువుకునేందుకు వీలుగా పొందుపరిచారు. చదివే ఓపిక లేదనుకుంటే ఆడియో వినొచ్చు లేదంటే అందులోని ముఖ్యాంశాలు చదువుకోవచ్చు దీనికి సంబంధించిన బొమ్మలు కూడా ఈ యాప్‌లో లభిస్తాయి. వాటిని ఎస్.డి కార్డులో సేవ్ చేసుకునే అవకాశం కూడా ఉంది. వాల్ పేపర్‌గా కూడా ఉపయోగించుకోవచ్చు



### లాస్ట్ మెసేజ్

ఆన్‌లైన్‌లో చాట్ చేస్తున్నపుడు ఒక్కోసారి అకస్మాత్తుగా బ్యాటరీ చార్జింగ్ అయిపోతుంది. అలా జరిగినపుడు అవతలివాళ్లు విషయం తెలియక నొచ్చుకునే అవకాశం ఉంది. అలా కాకుండా ఫోన్ బ్యాటరీ అయిపోయినట్లుగా ఓ మెసేజ్ వెళ్తే ఎంత బాగుంటుంది! లాస్ట్ మెసేజ్ యాప్ సరిగ్గా ఆ పనే చేస్తుంది. బ్యాటరీ పూర్తిగా అయిపోవస్తుందనగా ఆ విషయాన్ని తెలియజేస్తూ మన ప్రమేయం లేకుండా అవతలి వాళ్లకు మెసేజ్ వెళ్తుంది. అయితే మనం ముందుగా సెలెక్ట్ చేసి పెట్టుకున్న వారికి మాత్రమే అలా మెసేజ్ వెళ్తుంది.

# జతపరచండి

ఇక్కడ కొందరు పౌరాణిక దంపతులపేర్లు గజిబిజిగా ఉన్నాయి.
ఆ జంటలను గుర్తించగలరేమో చూడండి..

| భర్తలు : | భార్యలు : |
|---|---|
| 1. హరిశ్చంద్రుడు | ఎ. రత్నమాల |
| 2. హిరణ్యకశిపుడు | బి. శుభాంగి |
| 3. కంసుడు | సి. లోపాముద్ర |
| 4. కుబేరుడు | డి. మనోరమ |
| 5. జనకుడు | ఇ. సరమ |
| 6. కుంభకర్ణుడు | ఎఫ్. చంద్రమతి |
| 7. కర్ణుడు | జి. మాండవి |
| 8. విభీషణుడు | హెచ్. లీలావతి |
| 9. అగస్త్యుడు | ఐ. వజ్రజ్వాల |
| 10. భరతుడు | జె. అస్తి, ప్రాప్తి |

జవాబులు ఈ సంచికలోనే..

కూర్పు : పక్కి శ్రీదేవి




## ఏమంటారు?

రాధ కాసేపు తనను అద్దంలో చూసుకుంది. తర్వాత నేను వయసై పోయినదానిలా, లావుగా, అందవికారంగా కనిపిస్తున్నాను.. మీరేమంటారు? అంది భర్తతో.

భర్త: నీ చూపు బాగా పనిచేస్తోంది!

## ఉదాహరణ



టీచర్: సంకోచ వ్యాకోచాలకు ఒక ఉదాహరణ చెప్పండి..?

విద్యార్థి: చలికాలంలో కంటే వేసవి కాలంలో పగలు ఎక్కువ సమయం ఉంటుంది!

## మరోసారి ఆలోచించండి!



రాజయ్య: లాయర్ గారూ! నా భార్య ఆర్నెల్ల నుంచి నాతో మాట్లాడడం లేదు. మాకు విడాకులు కావాలండి.

లాయర్: మరోసారి బాగా ఆలోచించు రాజయ్యా! మాట్లాడకుండా ఉండే భార్య మళ్లీ దొరకడం చాలా కష్టం.

## సౌందర్య రహస్యం!

రాగన్ : వావ్! మీ అక్క చాలా బాగుంది. పువ్వులాంటి మృదువైన చర్మం! ఏం వాడుతుందే మిటి?



అమర్ : అడోబ్ ఫొటోషాప్!

# పెసర పుదీన పునుకులు

చిటికెలో రుచిగా..!

## కావలసిన పదార్థాలు

- నానబెట్టిన పెసలు/ పెసరపప్పు - కప్పు
- ఉల్లిపాయ - 1
- పచ్చిమిర్చి - 3 లేదా 4
- అల్లం - చిన్న ముక్క
- జీలకర్ర - టీ స్పూను
- పుదీన - సరిపడ
- ఉప్పు - తగినంత
- నూనె - వేయించడానికి

### తయారుచేసే విధానం:

ముందుగా నానబెట్టిన పెసరపప్పును వడ గట్టాలి. దానిలో పచ్చిమిర్చి, అల్లం, ఉప్పు వేసి కొంచెం బరకగా మిక్సీ పట్టాలి. దాన్ని ఓ గిన్నె లోకి తీసుకుని తరిగిన ఉల్లిపాయ, జీలకర్ర, పుదీన కలపాలి. కళాయిలో నూనె పోసి బాగా వేడి అయ్యాక స్టవ్‌ను సిమ్‌లో ఉంచాలి. తర్వాత కొద్దికొద్దిగా పిండిని నూనెలో వేసి బంగారు రంగు వచ్చేక తీయాలి. పెసర పునుకులు రెడీ! టీతో పాటు ఆరగిస్తే చాలా రుచిగా ఉంటాయి.

# క్యాబేజీ పకోడి

## కావలసిన పదార్థాలు

- శనగపిండి - 1 1/2 కప్పు
- బియ్యపు పిండి - 1/2 కప్పు
- పచ్చిమిర్చి - 2 లేదా 3
- కారం - 1/4 టీ స్పూను
- అల్లంవెల్లుల్లి పేస్టు - 1/2 టీ స్పూను
- పెద్ద ఉల్లిపాయ - 1
- సన్నగా తరిగిన క్యాబేజీ - 2 కప్పులు
- వేడి నూనె - 1 టేబుల్ స్పూను
- కరివేపాకు, ఉప్పు - తగినంత
- నూనె - వేయించడానికి సరిపడ

### తయారుచేసే విధానం

ముందుగా వెడల్పాటి గిన్నెలో శనగపిండి, బియ్యపు పిండి, అల్లంవెల్లుల్లి పేస్టు, ఉప్పు, కారం, తరిగిన పచ్చిమిర్చి, ఉల్లిపాయ, క్యాబేజీ, కరివేపాకు వేయాలి. అందులో వేడి నూనె కూడా వేసి కలపాలి. తడి కోసం కొద్దిగా నీళ్లు పోసి ముద్దగా చేయాలి. నూనె బాగా కాగాక మంటను సిమ్‌లో పెట్టి కొద్దికొద్దిగా పిండిని పకోడిల్లా వేసి దోరగా, క్రిస్పీగా వేయించాలి. అంతే క్యాబేజీ పకోడీ రెడీ! గాలి చొరబడని సీసాలో వేస్తే కొద్దిరోజులు నిల్వ ఉంటాయి.



జతపరచండి జవాబులు: 1. ఎఫ్, 2. హెచ్, 3. జె, 4. డి, 5. ఎ, 6. ఐ, 7. బి, 8. ఇ, 9. సి, 10. జి

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**డా. ఎం.ఎస్.ఆర్. శర్మ**

ఇం.నెం. 4-64,
చిప్పిలి, బెంగళూరు రోడ్,
మదనపల్లె, చిత్తూరు జిల్లా

## చతురంగం - 62 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | గ్ని | | 2 ఒం | 3 టె | లు | | 4 లే | ప | 5 నం |
| పా | | 6 కా | ట | న్ | | 7 వా | మ | | జు |
| 8 యం | 9 డ | మూ | రి | | 10 ని | ఘా | | 11 పే | డు |
| | బ్బు | | 12 త | 13 మా | షా | | 14 మా | ల | |
| 15 స | | 16 అ | నం | తం | | 17 సు | | 18 వం | 19 త |
| 20 మ | ది | ర | | 21 గం | 22 గా | జ | లం | | రు |
| ర | | 23 విం | త | | 24 రా | నా | | 25 వే | ణీ |
| 26 ము | 27 కుం | ద | | 28 కం | బం | | 29 నే | త | |
| | త | | 30 మం | త | | 31 ర | త | నా | ల |
| 32 క | ల | బం | ద | | 33 వ | వి | లు | లు | |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 2. ధరణి పద్మాసన, నల్లకుంట, 3. చింతలపాటి శివశంకరశాస్త్రి, లింగంపల్లి, 4. నోరి శివప్రకాశం, నెల్లూరు, 5. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 6. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 7. జి. ముత్తుమారన్, హైదరాబాద్, 8. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 9. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 10. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 11. టి. తులశమ్మ, మల్కాజిగిరి, 12. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 13. జె. సుధా పరిమళ, కర్నూలు, 14. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 15. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 16. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 17. కె. సుబ్రమణ్యం, అనంతపురం, 18. ఎ. రంగనాథం, బెంగళూరు, 19. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 20. శిరీష, తిరుపతి, 21. పి. శుభ, బంజారాహిల్స్, 22. గోగాడ శ్రీనివాసరావు, మహారాష్ట్ర, 23. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, తూ.గో. జిల్లా, 24. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 25. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 26. పూల రమాదేవి, వనస్థలిపురం, 27. సి. నిర్మల, తిరుపతి, 28. ఎస్. పద్మావతీదేవి, ఒంగోలు, 29. ఎస్. మణిమేగలై, తిరుపతి, 30. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 31. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 32. బచ్చు రోహిత్‌సత్య, కొత్తగూడెం, 33. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 34. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 35. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 36. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 37. ఎస్. శ్రీహరి, బెంగళూరు, 38. వడ్డీ సుశీల, సికింద్రాబాద్, 39. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్., 40. టి. రాంకిషన్, హైదరాబాద్, 41. బి. రామమోహనరావు, దిల్‌సుఖ్‌నగర్, 42. గానుగపాటి సరోజినీదేవి, మల్లాపూర్, 43. అనసూరి సత్యవేణి, కె.పి.హెచ్.బి. కాలనీ, 44. ఎం. లాస్యప్రియ, బోరబండ, 45. జి. లిఖిత్‌సాగర్, చిక్కడపల్లి, 46. నార్నె చంద్రబాబునాయుడు, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 47. జి. జనార్దన్‌రెడ్డి, నిజామాబాద్, 48. టి.యన్. లత, మంచిర్యాల, 49. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 50. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, ప.గో. జిల్లా, 51. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 52. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 53. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 54. అడపా ధనలక్ష్మి, పర్లాకిమిడి, ఒడిశా, 55. అడపా రత్నకుమారి, కాకినాడ, 56. ఎన్. సుదర్శనరావు, హైదరాబాద్, 57. వేలూరి భారతి, కాకినాడ, 58. యు. ఝాన్సీలక్ష్మి, న్యూ పాల్వంచ, 59. పి. సుస్మిత, ఖమ్మం, 60. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 61. ధఫ్పూరి సుధాదేవి, సీతారాం బాగ్, 62. డా. కె. శివభూషణమ్, కర్నూలు, 63. జె. వసంత, ట్రూప్‌బజార్, 64. నియాజ్ అలి, ఉప్పరిపల్లి, హైదరాబాద్, 65. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 66. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 67. తాయ్యేటి వెంకటసూర్యం, విశాఖపట్నం, 68. ఎం. వీరరాఘవరాజు, మోతీనగర్, 69. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 70. ఏకా సావిత్రి, బాపట్ల, 71. జి.వి. వసుధ, శ్రీకాళహస్తి, 72. కె. ప్రభావతీదేవి, నరసరావుపేట, 73. దొండపాటి గోపి పద్మజ, విశాఖపట్నం, 74. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 75. రాంపల్లి శ్రీనివాస్, విజయవాడ, 76. సి. భారతి, మన్సూరాబాద్, 77. దండు రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 78. పి. హైమవతి, మంచిర్యాల, 79. కొల్లూరు వేంకటరమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిశా, 80. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 81. పి.వి. సుబ్బలక్ష్మి, విశాఖపట్నం, 82. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 83. ఎన్. జయరామ్‌మోహన్, చెన్నై, 84. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 85. బిక్కనూరి రాజేశ్వర్, నిర్మల్, 86. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 87. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 88. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 89. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 90. అవధూత రాజేశ్వర్, నల్లగండ్ల, హైదరాబాద్, 91. గరికిపాటి రాజా దత్తాత్రేయ, కాకినాడ, 92. శ్రీదాస్యం లక్ష్మయ్య, హుస్నాబాద్, 93. పేర్వేల పవన్‌కుమార్, *(..128లో)*

# చతురంగం - 63 ఆధారాలు

## అడ్డం

1. ఆం.ప్ర. ఆర్థికమంత్రి ఇంటిపేరు (4)
4. కల కాదు.. వరం.. అంతకన్నా కాదు.. విచారం (4)
7. బుద్ధి (2)
8. నల్లకలువ, భూమండలం (4)
10. రవితేజ బోయపాటిల సినిమా (2)
12. అసోంని ఒకప్పుడు ఈ దేశమనేవారు (4)
14. ఆస్ట్రేలియన్ల జంతు చిహ్నం (3)
16. వ్యూహం, ఎత్తుగడ (4)
18. ఆబాలగోపాలం ఇష్టపడేవి (4)
20. ప్రకాశం జిల్లాలో ఒక పట్టణం (4)
22. లాభం, 'తగులు'కు వ్యతిరేకం (3)
25. పాఠశాల (2)
26. మహాపాపం (3)
28. 'జగదేకవీరుని కథ' సినిమాలో అప్పటికీ ఇప్పటికీ సూపర్‌హిట్ పాట (5)
32. గాడిద (2)
33. పాండవుల అజ్ఞాతవాసం ఈ రాజు కొలువులోనే (5)
36. అడ్డు, అవరోధం (3)
37. వెండి (4)

## నిలువు

1. పాపులుండే చోటు (4)
2. నమస్కారం (2)
3. 'కర్పూర వసంతరాయలు' కావ్య నాయిక (3)
4. కొయ్య (3)
5. వినాశనం (2)
6. అప్సరసల్లో ఒకామె, ఒకప్పటి సినీ నాయిక (2)
9. ప్రవరుడ్ని కామించిన గంధర్వాంగన (4)
11. దక్షిణాది భాషల్ని ఈ భాషలంటారు (3)
12. తెరాస గుర్తు (2)
13. వీపు, వరి.. చెరకు మొదలగువాటి కంకి (2)
15. గాయకురాలు (3)
16. తవ్వే సాధనం (3)
17. ఏనుగు (2)
18. శ్రీకి వికృతి.. లక్ష్మి (2)
19. ఫలాల్లో రాజు (3)
21. 'కన్యాశుల్కం'లో ప్రధాన పాత్ర (3)
23. క్షీరం.. శీర్షాసనం (2)
24. కొంగ (2)
25. గీత, హద్దు, రంగం(2)
27. 'విధిలిఖితం', 'లలాటలిఖితం' లాంటిదే తెలుగులో.. (4)
28. కొండ కొనకొమ్ము (3)
29. దేవుడిచ్చేది (2)
30. తలుపు (3)
31. 'మనసార' లాగే 'నోరు'కు సంబంధించి (3)
34. జడ లాటిదే తలకిందులు (2)
35. 'గాజుముక్క' రెండు, మూడు (2)

(127వ పేజీ తరువాయి...)

మణికొండ, 94. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా, 95. చివుకుల నాగమణి, రాజమండ్రి, 96. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 97. శీతేపల్లి లక్ష్మికామేశ్వరి, విజయవాడ, 98. యిర్రి భక్తవత్సల రావు, చిలకలూరిపేట, 99. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 100. పారేపల్లి పద్మకుమారి, కేసరపల్లి, కృష్ణాజిల్లా, 101. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 102. ఆర్. శ్రీగౌరి, నొయిడా, ఉత్తరప్రదేశ్, 103. కె. మోహన్, బెంగళూరు, 104. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 105. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 106. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 107. కనకల కుమారి, విజయవాడ, 108. డా.సి. జనార్దనసింగ్, నల్లకుంట, 109. ఎం. వసంతవీరేశ్, మద్దికెర, 110. తేనేటి రమ్యదీప్తి, సత్తెన్నపల్లి, 111. జి. లక్ష్మినరుసు, ముచ్చుమిల్లి, తూ.గో.జిల్లా, 112. గుత్తిన వెంకటమురళీమోహన్‌రావు, కోటరామచంద్రపురం, తూ.గో.జిల్లా, 113. వాసా లీలాపద్మావతి, తగరపు వలస, విశాఖ, 114. ఎన్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 115. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 116. సూరి నాగరాజు, బెంగళూరు.

# చతురంగం - 63

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : జూన్ 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ■ | 4 | 5 | | 6 | ■ |
| 7 | | ■ | 8 కు | 9 | | | ■ | 10 | 11 |
| | ■ | 12 | | రూ | | ■ | 13 | ■ | |
| 14 | 15 | | ■ | | ■ | 16 ప | | 17 | |
| ■ | | ■ | 18 | | 19 | | ■ | | ■ |
| 20 | | 21 | | ■ | 22 | | 23 | ■ | 24 |
| ■ | ■ | | ■ | 25 | | ■ | 26 | 27 | |
| 28 | 29 | | 30 | | ■ | 31 నో | ■ | | ■ |
| 32 | | ■ | | ■ | 33 | | 34 | | 35 |
| | ■ | 36 | | | ■ | 37 | | | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------------

------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ----------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర,** ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# ఏమిటా నిర్ణయం?

ప్రారంభంలో తీయగా వినిపించిన మాటలు రాను రాను చేదెక్కాయి. ఆంక్షలు ముందరి కాళ్లకు బంధాలయ్యాయి. అందుకే ఓ కీలక నిర్ణయం తీసుకుందామె. ఏమిటది? చదవండి **రమానాథ్ రాయ్** బెంగాలీ కథ **ఓ భర్త ఉపదేశం**

ఆమె గాయపడిన హృదయాన్ని నయం చేయాలనుకున్నాడో వైద్యుడు. కానీ ఆ గాయం తన హృదయాన్ని తాకుతుందని ఊహించలేకపోయాడు. ఇంతకీ ఆ గాయం వెనుక కథేంటి? చదవండి నోబెల్‌గ్రహీత **లుయిగి పిరాండెల్లో** ఇటలీ కథ **పూల వలయిక**

ప్రేమిస్తే ఇళ్లల్లో వద్దనడం చాలాచోట్ల విన్నదే.. కన్నదే! కానీ ఈ ప్రేమకథలో కారణం ఎవరి ఊహకూ అందనిది. ఏ సిన్మాలో చూడనిది. ఏమిటది? చదవండి **హెర్మన్ హెస్** స్విట్జర్లాండ్ కథ **ఒక భ్రమ**

సంపెంగలపై ఆశతో పూరెమ్మను కదిలించగానే పొద నుంచి బయటకు వచ్చాయి రెండు తాచుపాములు. ఆ ఇద్దరమ్మాయిల చెరోవైపూ తోకపై నిలుచుని పడగలెత్తి బుసకొట్టసాగాయి. అపుడు జరిగిందో అనూహ్య ఘటన. ఏమిటది? చదవండి **వేటూరి ప్రభాకర శాస్త్రి** **కరుణకము** కథకుల ఫైల్‌లో




ఎన్నాళ్ల నుంచో విశ్వసిస్తూ వస్తోన్న సత్యాన్ని కూకటివేళ్లతో పెళ్లగించిందీ కథ. కొన్నిసార్లు న్యాయం ప్లేటు ఫిరాయిస్తుందని చెప్పిన కథ ఇది. ఆ కథే 35 ఏళ్లనాటి విపుల కథ శీర్షికన వచ్చిన **సోమర్సెట్ మామ్** ఇంగ్లండు కథ **చీమ - మిడత**

- ★ కామెడీతో కబడ్డీ **పేరడీ బీరెడీ**
- ★ 'అమ్'అద్మీ అంటోన్న **రింగరింగారింగరింగారే..**

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# ఆ రాత్రి ఏం జరిగింది?

అమెరికాలో అర్ధరాత్రి పన్నెండు గంటలు..!
గాఢనిద్రలో ఉన్న మెదడుకు ఏదో శబ్దం అంతర్లీనంగా తెలిసి ఒక్కసారిగా కళ్లు తెరిచింది వర్ణ.
ఎదురుగా ఉన్న ఆకారాల్ని చూసి విపరీతమైన భయంతో కెవ్వుకెవ్వుమని అరుస్తూనే ఉంది.
కళ్లముందున్న ఆ వికృత రూపాల్ని చూడలేక, భయంతో ముఖాన్ని రెండు చేతుల్తో కప్పుకుని బెడ్ మీద వెనక్కి వెనక్కి వెళ్లిపోయి మోకాళ్లలో తల దూర్చేసుకుంది..
భయంతో గుండె కొట్టుకునే వేగం రెండింతలు పెరిగి, వర్ణకి ఒళ్లంతా చెమట్లు పట్టేశాయి! ఆ తర్వాతేమైంది? ఇంతకీ ఆ ఆకారాలేంటి? ఆద్యంతం ఉత్కంఠగా సాగే **బి. గీతిక** తాజా నవల **అద్వైతం** చతుర జులై కానుక!



బోనస్‌గా...

✦ నవలావలోకనంలో : పోలీసు వ్యవస్థపై దూసిన కత్తి 'ఖాకీవనం'.. పోలీసుల అవినీతితో పాటు వారి మానసిక సంఘర్షణకు అద్దంపట్టిన అక్షరాస్త్రం 'ఖాకీవనం'.. 1980 దశకంలో తెలుగు నవలా సాహిత్యంలో పెను సంచలనం 'ఖాకీవనం'.. చతుర లో ప్రచురితమైన అనేక ఆణిముత్యాల్లో ఒకటి 'ఖాకీవనం'! రచయిత **కె.ఎన్.వై. పతంజలి**కి అక్షర కిరీటం అలంకరించిన ప్రయోగాత్మక నవల **ఖాకీవనం!**

CHATURA Telugu Monthly, Dt. of publication : June 1, 2016.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978